# మహాభక్తవిజయము

గ్రంథకర్త:

జొన్నలగడ్డ వేంకట రాధాకృష్ణయ్యగారు.

మొదటికూర్పు 1000 ప్రతులు.

ప్రకాశకులు:

పి. రంగారావు,

శ్రీ సత్యానందబుక్ డిపో, ఇన్నీసుపేట,

రాజమహేంద్రవరము.

1935

# మహాభక్తవిజయము

(**46** మహాభక్తులకథలు)

గ్రంథకర్త:

జొన్నలగడ్డ వేంకటరాధాకృష్ణయ్యగారు.



ప్రకాశకుఁడు:

పి. రంగారావు,

శ్రీ సత్యానంద బుక్ డిపో, ఇన్నీసుపేట,

రాజమహేంద్రవరము.

1935

—

 [వెల రు **1—4—0**

# పీ ఠి క.



ఈ 'మహాభక్తవిజయము' లోనికథలు నేనపుడపుడు వ్రాసి యుంచితిని. కొన్నింటి నాంగ్లమునందు వ్రాయఁబడియున్న కథల నాధారముగా వ్రాసితిని. ఈకథలు పాతకహారములై, మనస్సునకుల్లాసముఁ గల్పింపఁగలవని నాయాశయము. భగవద్భక్తుల కథలఁజదివి, చదువరులుకూడ భక్తియుక్తులైనచో నేను జరితార్థుఁడ నగుదును.

రాజమండ్రి
21—10—1934

విధేయుఁడు
జొ. వేం. రాధాకృష్ణయ్య.



# విషయసూచిక.

—: 0 :—

ఓం

అవిఘ్నమస్తు.

శ్రీరామాయనమః.

# మహాభక్తవిజయము

## 1 తుకారాము.



మహారాష్ట్రదేశమునకుఁ దలమానికమై యలరారు పూనానగరమున కెనిమిదిమైళ్ల దూరమున నింద్రాణీనదీతీరమున దేహూయను గ్రామమున క్రీ.శ. ౧౬౦౮ సం॥రమున భక్తతుకారాము మోరే యను ప్రసిద్ధశూద్రకుటుంబమున జన్మించెను. తుకారాము తండ్రి బొలోబా. తల్లి కనకాబాయి. తుకారాము సోదరుఁడు శాజీ. అతఁడు బాల్యమునుండియు సంసారమునెడ విరక్తుఁడై యుండుటచే సంసారనిర్వాహణభారము తుకారాము వహింపవలసినవాఁ డాయెను. అతని భార్య జీజీభాయి. తుకారాము పదునేడువర్షముల ప్రాయముగలవాఁడై నపుడు దురదృష్టవశమున నాతని తలిదండ్రులు పరమపదము నొందిరి. జననీజనకుల మరణము తుకారామును క్రుంగజేసెను. అతని చిత్తము చింతాసంకలితమైపోయెను. మఱుచటివత్సరమునఁ దుకారాము సోదరుఁడగు శాజీభార్య మరణించెను. శాజీ విరాగియై తీర్థయాత్రల సేవింపఁబోయెను. సోదరుఁడు వెడలిపోవుట, అతనిభార్య మృతినొందుట, మాతాపితరులు గతించుట—యివియన్నియు సంసారసుఖాసక్తుఁడై యున్న తుకారాము హృదయమున వైరాగ్యముదయించుటకుఁ గారణభూతము లయ్యెను. సంసారబంధవిముక్తుఁడై, నిశ్చింతతోఁ బరమాత్మని భజింపఁదలఁచియున్న తుకారామునకు వర్తకముసాగదయ్యెను.

తుకారామునకు రావలసిన బాకీలురాకుండెను. అతఁ డీయవల
సినవా అందరును దమ ధనమునిమ్మని తొందరచేయసాగిరి. దుకాణ
మునఁ గూర్చుండి యున్నపుడుకూడ హరిభజనాసక్తుఁడై యుండుటచే
నష్టము వచ్చుచుండెను. వ్యాపారము మందగించుటచేఁ దుకారాము
దివాలాతీసినాఁడను వదంతి వ్యాపించెను. ఋణదాతలందఱును తుకా
రాము గృహమున కరుదెంచి, తమ ధనమిమ్మని నిర్బంధింపసాగిరి.
చేయునదిలేక తుకారాము విఠోబానుద్దేశించి, “ ప్రభూ ! నన్ను రక్షిం
పవా ? కఠినుఁడవా ? ” యని విలపించెను. అతనిబంధువులలోఁ గొంద
ఱరుదెంచి యాబాకీలను దీర్చిరి. కొంతధనమిచ్చి, వారు వ్యాపారము
చేసికొనుమని ప్రోత్సహించిరి. తుకారా మట్లేయని వర్తకమారంభిం
చెను. అందుఁగూడ నష్టము వచ్చుటచే భార్యయగు జీజీభాయి నిందా
రోపణము చేయసాగెను. ఆమె తనబందుగుల నెవరినో కొంతయప్పడిగి,
ధనముఁదెచ్చి మిరపకాయలవ్యాపారము చేయుమనియెను. కొందఱు
వర్తకులతోఁగలిసి యాతఁడు బాలేఘాటు అనుపట్టణమునకుఁ బోయి,
సరకునచ్చట కొంతలాభమునకు విక్రయించెను. ఆధనమును గొని
వచ్చుచుండఁగా రాజభటులచే ఋణమునకై యొక బ్రాహ్మణుఁడు
నిర్బంధింపఁబడుచుండుట చూచి దయార్ద్రహృదయుఁడై, యాఋణ
ధనమునంతయుఁ దానేయిచ్చి, యాపేదపాఱునకు బంధవిమోచనము
కలిగించెను. ఈ వృత్తాంతమును మిగిలినవర్తకులు జీజీభాయి కెఱింగిం
పఁగా, నామె మహాగ్రహాయత్తచిత్తయై, తుకారామును వివిధ
దుర్భాషలాడఁగా నాతఁడు మితిమీఱిన మనోవ్యథనొందెను.

తుకారాము కష్టములు నానాఁటికి వృద్ధియగుచుండెనేగాని
తగ్గుటలేదు. పరమాత్ముఁడు భక్తులనేల విషమపరీక్షలయం దిడుచుం
డునో తెలియరాదుగదా ! తుకారాము ప్రథమకళత్రము మృతి
నొందెను—పుత్త్రుఁడు చనిపోయెను. అప్పుడాతఁడు పొందిన హృద

యూవేదన మింతింతనరాక యుండెనని మహారాష్ట్ర కవిచంద్రుఁడగు మహీపతి వ్రాసినాఁడు. ఈకష్టములవలనఁ దుకారామునకు సంసారముపై సంపూర్ణవిరక్తి జనించెను. సుఖదుఃఖములు క్షణభంగురములని యాతఁడు గ్రహించెను. తుకారాము "విఠోబాస్వామీ! సంసారము దుఃఖమయము. సుఖము భ్రాంతితోఁగూడినది. ప్రభూ! నాహృదయమునకు శాంతిఁగల్గించుము" అని పెక్కుతడవులు ప్రార్థించుచుండెను. 'సంసారమునం దాసక్తుఁడనై యున్నచో నాకు శాంతిలభింప' దని నిశ్చయించుకొని తుకారాము దేహూగ్రామమునకు సమీపమున నున్న భాస్వనాథ పర్వతారణ్యముల కరిగి, తపస్సు నత్యుగ్రముగఁ జేయసాగెను.

ప్రకృతిసౌందర్యమును నేత్రపర్వముగఁ జూచుచు, హృదయమున విఠోబాదేవుని నిలిపి నిశ్చలముగ తుకారాము ధ్యానముచేయసాగెను. ఆతనికొఱకు సోదరుఁడు వెదకివెదకి కన్గొని బ్రతిమాలి యింటికి తీసికొనివచ్చెను. తమకు రావలసిన ఋణపత్రములలో సగము పత్రములను దమ్మునికిచ్చి, మిగిలిన వింద్రాణీనదీజలముల కర్పించెను.

నాఁటగోలె తుకారాము ఆహారమును తగ్గించుచు, నిద్రను నియమబద్ధముగావించి, నిరంతరము విఠోబాదేవాలయము శుభ్రపఱచుచు, పథికులమార్గాయాస ఖేదమునపనయింపఁజేయు నుపచారముల నొనరించుచు, పగటివేళల నాగ్రామసమీపముననున్న భాండారపర్వతముపై విహరించి, ఏకాంతమున ప్రియతముఁడగు పరమాత్ముని సేవించుచు రాత్రులయందు దేవాలయమున భజనమొనరించుచుండెను. విఠోబాదేవాలయము శిథిలమగుచుండుటచూచి, తుకారాము తనంతఁదానే మట్టికలిపి, శిథిలమైనభాగముల మరమ్మతుచేసి, సంతర్పణచేసెను.

తుకారాము భక్తిభావాన్వితములైన గీతములరచించి, విఠోబాస్వామికర్పింపఁ గుతూహలము కలిగియుండెను. ఈకోరిక సఫలమగు

టకై యాతఁడు నామదేవు విరచితములైన యభంగములను, ఏకనాథ స్వామి ప్రణీతమైన భావార్థరామాయణమును మఱికొన్ని జ్ఞానోద్బోధకములగు గ్రంథములను జదివి, మధురములగు పదములతో విఠోబా దేవునిపై గీతములవ్రాయ మొదలిడెను. "విఠోబాను సేవించుచున్నందుననే దారిద్ర్యమారంభమైన" దని పలువురు పలుకుచుండుటచే జీజీభాయి యామాటలనువిశ్వసించి, భర్తతోఁ దఱచుగా "విఠోబాసంస్మరణము" మానుమని చెప్పుచుండెను. పదింబదిగఁ గలహించుచుండెను. ఆమెకుఁ గోపమువచ్చినపుడు శాంతమూర్తియగు తుకారాము మాఱుపలుకక భాస్వానాథపర్వతమునకో, బాండారపర్వతమునకో వెడలిపోవుచుండెడివాఁడు. కొంతసేపటికామె శాంతము వహించి, భర్తను భోజనముచేయుటకుఁ బిలుచుకొని వచ్చుటకై బయలుదేఱి, వెదకి వెదకి తీసికొని వచ్చుచుండెడిది. భాస్వానాథపర్వతముకడ తుకారామున్నపుడామె భోజనము నటకుఁ దీసికొనివెళ్లుచు నొకనాఁడు గ్రీష్మాతపమున కోర్వజాలక పడిపోయెను. ఈవిషయము నెఱింగినపిదప తుకారాముభార్య బాధపడునను భయమున దూరప్రదేశములకుఁ బోవుటమానివైచెను.

క్రమక్రమముగా తుకారాము గీతములను, భగవత్కథాప్రసంగములను వినుటకుఁ జుట్టుప్రక్కల గ్రామములనుండి జనులు గుంపులు గుంపులుగావచ్చి విని వెడలుచుండిరి. గంగాధరపంతను బ్రాహ్మణుఁడును సంభాజియను దెలకుల కులజుఁడును తుకారాము శిష్యులలోఁ బ్రధానులై యుండిరి. ఆకాలమున భక్తులని ఖ్యాతిగాంచినవారిలోఁ జాలమంది తుకారాముయెడ నసూయాగ్రస్తులై యుండిరి. అట్లు మత్సరగ్రస్తులైనవారిలో మాస్వాజీయను సాధువొకఁడు. ఆతఁడు పౌరులెల్లరును దనకడ కరుదెంచుట మానివైచుటచేఁ గుపితుఁడై విఠోబాదేవాలయమునకు సమీపముననే దనయాశ్రమముండు

టచేఁ జుట్టును ముండ్లకంచెలను వేసెను. రాత్రి సంకీర్తనసమయమున దూరగ్రామములనుండి వచ్చుభక్తులకాకంటకములు గ్రుచ్చుకొని బాధించునని తలంచి, తుకారామూ ముండ్లకంపనుదీసి, యాప్రదేశమును దాను స్వయముగా బాగుచేయుచుండెను.

మాస్వాజీబాబా యిదిచూచి, మహాగ్రహమతియై రయమున నేతెంచి, యొకముండ్లకంపను జేఁబూని, తుకారాము వీపుపైఁ బది దెబ్బలు కొట్టుసరికి రక్తము స్రవింపసాగెను. ఆదెబ్బల నోర్పుతో సహించి, తుకారాము విఠోబాసన్నిధికరిగి, "ప్రభూ! దుర్జనసాంగత్యము కష్టకారణమగునని నిరూపించుటకే నాకీశిక్షవిధించినా" వను భావముగల యభంగమునుజెప్పెను. తదుపరి, యాతఁడింటికేగినపిదప జీజీభాయి జరిగినదంతయుఁ దెలిసికొని, మిక్కిలి విచారమునుబొంది, యాకంటకములను మెల్లగానీవలికిఁదీసి బాధయుపశమించుట కుపచారములసలిపెను.

రాత్రి సంకీర్తనసమయమున తుకారాముశిష్యులను మాస్వాజీ బాబాను బిలుచుకొనిరమ్మని పంపెను. పశ్చాత్తాపానలతప్తుఁడై యున్న మాస్వాజీ రాఁజాలనని కబురంపెను. తుకారాము స్వయముగావెళ్ళి "స్వామీ! మీరువేసినముండ్లకంచెలను తొలఁగించితినని కోపమా? మీచేయి కందినదా? వలయునుపచారములఁ జేయుదును." అనఁగా, మాస్వాజీ సిగ్గుపడి, సంకీర్తనమున కరుదెంచి, యానాఁటినుండి స్నేహముగలిగి మెలఁగసాగెను. అనేకులు పరిసరగ్రామములనుండి వచ్చుచుండుటచే తుకారాము వారికి భోజనసదుపాయములఁ జేయవలసినవాఁడాయెను. జీజీభాయిభర్త యతిథిసత్కారము చేయుచుండుట గాంచి "ఇంటనేమియులేకున్నను నీసత్కారముతప్పదా?" యని విసిగికొనసాగెను. తుకారామదిచూచి, వ్యాకులితచిత్తుఁడై "సంసా

రమున నాకెప్పటికిని శాంతిలేదు. అరణ్యావాసమే నాచిత్తమునకు శాంతికలిగించును. నిర్మలహృదయుఁడనై నేనట విఠోబాను గీర్తించు కొందు" నని తలంచి, సమీపముననున్న "బొల్లాల" యను పేరు గల గహనమున నివాసమేర్పరచుకొనెను. అనుదినము ప్రాతఃకాలమున నింద్రాణీనదీజలములందు సుస్నాతుఁడై విఠోబాయాలయమున కరు దెంచి, స్వామిని సేవించి, తిరిగి కాననమునకుఁ బోవుచుండెను.

నిరంతరము నొకరిద్దఱు తుకారామున కాహారపదార్థముల నా యరణ్యమునకుఁబోయి సమర్పించుచుండిరి. ఆహారము లభింపని దినములం దాతఁడుపవాసములఁ జేయసాగెను. రెండుమాసము లిట్లు గడచెను. ఒకనాఁడాతఁ డింద్రాణీనదిలో స్నానముచేయుచుండఁగా, పతివియోగమున వ్యథితాత్మయై యున్న జీజీభాయి సమీపించి, "నాథా! నేనేమి యపకారమొనరించితినని మీ రిలువీడి వెడలిపోయి నారు? మీ కెట్టియభ్యంతరము చెప్పను. రండు" అని బ్రతిమా లెను. పాపమామె నేత్రములు దుఃఖాశ్రుప్లావితము లాయెను. తుకా రాము భార్యకనులనుండి వెలువడు బాష్పబిందువుల నవలోకించి, కంపి తుఁడై మాఱుమాటాడక యామె ననుసరించి, నిజగృహమున కరిగెను.

తుకారాము సతియగు జీజీభాయి చిత్తమునుగూడ భక్తిభావ సమన్వితమగునట్లు చేయుటకై ప్రయత్నించుచుండెను. ఒకనాఁడాతఁ డామెకు పదునొకండు అభంగములరచించి, యామెకా యభంగా ర్థముఁ దెలియఁజేసెను. ఈబోధనము "పూర్ణబోధ" యనుపేరునఁ బ్రసిద్ధిఁగాంచెను. ఒక యభంగము "భువనైకరక్షకుఁడును, భక్త జన మందారమును నగువిఠోబా చరణసరోజములఁ బవిత్రాత్ములమై పూజించుచుండుటచేతనేగదా మనయింటి కనేకులు వచ్చుచున్నారు? భగవత్స్వరూపులగు వారిని పూజించిన—వారి కుపచారములు సల్పిన

మనము తరించమా? సంసారము మాయాజాలము. ఈజాలమునం జిక్కుకొని యున్నంతకాలము మనము మోక్షపథానువర్తులము కాజాలము. కనుక నామాటలువిని, మన గృహమునందున్న వస్తువులన్నింటిని దానమొసంగుము. పాండురంగఁడే మనలను రక్షించునని విశ్వసించియున్నచో మన కేకొఱంతయుఁగల్గదు. కావున యింటిలోని సర్వస్వమును దానమొసంగి, భక్తియుక్తవై మెలఁగుము" అను భావము కలిగియుండెను.

భర్తృవాగమృతము గ్రోలి జీజీబాయి మఱునాటిదిన ముదయమున బ్రాహ్మణులను రావించి, యింటిలోని వస్తువులన్నింటిని దానమొసంగి, రెయొక మృణ్మయపాత్రను జేఁబూని, యింద్రాణీనది కరిగెను. ఆసమయమున నొకబీదస్త్రీ తుకారామును సమీపించి "మహాభాగా! నేను ధరించియున్న చీర చినిఁగిపోయినది. ఏదైనవస్త్రమును గ్రహింతురా?" యనెను. తుకారాము లోనికేగి, భార్యకు మిగిలియున్న ఒకచీరను గొనివచ్చి యామె కొసంగెను. జీజీబాయి ఆర్ద్రవస్త్రయై యింటికరుదేర, తుకారాము చీరను దానమిచ్చితినని చెప్పెను. తనకిఁకఁ గట్టుకొనుట కొక్కచీరయు లేదని గ్రహించి, భర్తను తూలనాడెను.

తుకారామస్వామికడ కొకనాఁ డొక బ్రాహ్మణుఁడు వచ్చి, "అయ్యా! అజ్ఞానతిమిరావృతమైన నాహృదయమునకు జ్ఞానతేజము ప్రసాదింప వేఁడుకొనుచున్నా" ననెను. తుకారామస్వామి పదునొకండు అభంగముల రచించి "ఉత్తమజ్ఞాన" మనఁబరఁగు నీయభంగములను, యీ నారికేళఫలమును స్వీకరింపుఁ" డని యచ్చటనుంచెను. ఆపత్రమునుగొని, యీపాటుఁ డాయభంగములు గీర్వాణమునఁగాక, మహారాష్ట్రమునసే యుండుటగని, వానిని స్వీకరింపనొల్లక యచ్చటనే విడిచి వెడలిపోయెను. కొంతసేపటికి మఱియొక బ్రాహ్మణుఁ డేగుదెంచి,

యాయభంగములను, ఫలమును స్వీకరించెను. ఆ ద్విజునిహృదయమా దివ్యభావోద్దీపితములగు నభంగములఁ బఠించినంతనే జ్ఞానవికసితమైనదని చెప్పుదురు.

తుకారామస్వామికి ముగ్గురు కొమార్తెలుండిరి. కాశి, భాగీరథి, గంగయను నామధేయములతో నొప్పు నాబాలికలు వివాహోచితమగు ప్రాయము నొందియుండుటఁ జూచి, తుకారాము శుభదినమున వీథిలో నాటలాడుకొనుచున్న ముగ్గురుబాలురఁ బిలిచికొనివచ్చి తన దుహితలను వారికొసంగి పెండ్లిచేసెను. ఈవృత్తాంతమును దెలిసికొని, యాబాలుర తలిదండ్రులు సంతసించిరి.

తుకారామస్వామి జనులెల్లరకు భక్తిధర్మము నుపదేశించుచుండుటచే సనాతన ధర్మావలంబులగు కొందఱు క్రోధోద్దీపితమానసులై, యొకనాఁ డాతనికడకరిగి "తుకారాం! నీవు శూద్రకుల సంజాతుఁడవయ్యు, అగ్రవర్ణోద్భూతులమగు మా బ్రాహ్మణులు చేయవలసిన ధర్మోపదేశము చేయుచు, మాకప్రతిష్ఠ కలిగించినావు. నీవు ధర్మోపదేశము చేయరాదు. చేయుట కర్హుఁడవో కావో పరమాత్ముఁడగు విఠోబాయే నిర్ణయించును. నీవు రచించిన యభంగముల గ్రంథము నింద్రాణీనదీజలంబులఁ బడవేయవలయును. ఆ గ్రంథముఁ బదమూఁడు దినముల యనంతరము మునిఁగిపోక తేలెనేని విఠోబా నీవు భక్తిధర్మము నుపదేశించుటకు సమ్మతించినాఁడని నిర్ధారణ చేయుదుము. లేనిచో నీవీ ధర్మోపదేశము మానవలయు" నని వచించి, ఆయభంగముల గ్రంథమును గొంపోయి నదిలోఁ బాఱవైచిరి.

తుకారామస్వామి హృదయాకాశము విషాదనీరదావృతమయ్యెను. ఆభక్తుఁడు విఠోబాసన్నిధి కరిగి, బాలకునివలె నేడ్చెను. విఠోబా ఆ సనాతనవాదులకు స్వప్నమున సాక్షాత్కరించి "నాభక్తుఁ

డగు తుకారామునకు దుఃఖము కలిగింపవల" దని చెప్పెనట. పదమూఁడు దినములు గడచినపిదప నాద్విజన్ము లింద్రాణీనదీతీరమున కరిగిచూడఁగా నాయభంగముల గ్రంథము నీటిలో తేలుచుండెనట. నాఁటినుంత బ్రాహ్మణులెవరును తుకారామును బాధింపఁదలంపరైరి. తుకారామస్వామి ఖ్యాతి దిగంతవిశ్రాంతమాయెను.

మహారాష్ట్రసామ్రాజ్య సంస్థాపకుఁడగు శివాజీయు, నాతని మతగురువగు సమర్థరామదాసస్వామియుఁగూడ భక్తతుకారామునెడ నత్యధికగౌరవము గలిగియుండిరి. శివాజీ తుకారామస్వామిఖ్యాతి నాకర్ణించి, యాతనిని దర్శింప నభిలషించుచుండెను. లోహగ్రామ వాసులు తుకారామస్వామి నాహ్వానించిరనివిని, శివాజీ ఛత్రచామ రాందోళికాది వాహనారూఢులగు పరివారమునుబంపి, "దర్శన మను గ్రహించి, తరింపఁజేయుఁ" డని కబురంపెను. తుకారామున కిష్టము లేదాయెను. రాజపుత్రునివలనఁ దానేవైన యుపాయనములు స్వీకరింప వలసివచ్చునేమోయని యాతనిభయము. పాపమాతఁ డిందువలన మనోవ్యథనొంది, తనయావేదనను శివాజీకి క్షత్రియోచితధర్మములను దెలుపు కొన్నియభంగములఁ బంపెను. శివాజీ యాయభంగములను జదువుకొని, నిర్భరానందవివశుఁడై తానేస్వయముగాఁ దుకారాము సన్నిధికరుదెంచి, ఉపదేశమునొందెను. తుకారామస్వామిభక్తి బోధామృతము నాస్వాదించిన శివాజీ పదింబదిగ లోహగ్రామమునకునచ్చి, భక్తిపరవశుఁడగుచుండెను. ఈ వృత్తాంతమెఱింగి శివాజీతల్లి జీజీభాయి వ్యాకులితాత్మయై, తుకారామస్వామి సమ్ముఖమునకరిగి "మహాత్మా! తమయభంగములలోని యనిర్వాచ్య మాధుర్యముఁ గ్రోలుచు, నాతన యుఁడు శివాజీ రాచకీయములందు విముఖుఁడైయున్నాఁడు. రాజ్య చక్రమునువీడి, తుదకు సన్యాసాశ్రమము స్వీకరించునేమో యను

సందియము నాడెందమును మాటి మాటికిని బాధించుచున్నది. తామె ల్లిన నా నందనునితోఁజెప్పి, రాజవ్యవహారనిమగ్నుఁడగునట్లు చేయ గోరెదను. ఈవిషయము శత్రువులవీనులఁ బడెనేని ప్రమాదము వాటిల్లును." అని చెప్పెను.

"అమ్మా! నేఁటిరాత్రి శివాజీ రాఁగానే మాట్లాడుదు" నని తుకారాముచెప్పి, శివాజీ వచ్చినంతనే "రాజకుమారా! శత్రువులజయించుట, ప్రజారంజకముగ రాజ్యపరిపాలన మొనరించుట, కష్టములననుభవించు దీనులరక్షించుట రాజలక్షణములు. కావున రాజ్యకార్యాసక్తుఁడవై, భక్తియుతుఁడవై యుండుము" అని బోధించెను. శివాజీ యాహితబోధ నాలకించి. రాజధానీనగరమున కరిగెను.

తుకారామస్వామి ప్రతిసంవత్సరమునుఁ బుణ్యక్షేత్రమగు పండరీపురమున కరుగుచుండెను. ఒకసంవత్సరము వ్యాధిగ్రస్తుఁడై పోఁజాలకపోయెను. అందువలన నాభక్తాగ్రణిచిత్త మాందోళనాయత్త మైయుండెను. అప్పుడు తుకారాము "ఓ విఠోబాస్వామీ! నిన్ను చూడఁజాలని యశక్తుఁడనై పోవుటవలన నాహృదయము దుఃఖమయ మైనది. పండరినాథా! భక్తులందఱితోఁగలసి, యానందాతిరేకమున నృత్యముసేయు నవకాశము కల్పింపవే నేమిపాపమొనరించితి?" నని యాక్రందనము జేయుచు, తనయావేదన నిరువదినాలుగ భంగములలో వర్ణించి పంపెను. ఉత్సవమునుండి, తిరిగివచ్చిన భక్తులవలన నుత్సవ విశేషములఁ దెలిసికొని యానందకందళిత వదనాంబురుహుఁడాయెను.

తుకారాము శరీరము క్రమ క్రమముగా క్షీణదశనొందసాగినది. అనేకులువచ్చి తమ తమగ్రామములకుఁ గొంపోవుచు నభంగములఁ బాడించుచు, ధర్మోపదేశము నొందుచుండుటవలన మానసిక శ్రమ యధికమయ్యెను. "నాకీ ప్రపంచమునఁ బనిలేదు. నేనిఁక

వైకుంఠమున కేగెదను" అని తలఁచుగా నాతఁడనుచుండెను. జీజీభాయి గర్భవతియైయుండెను. "వైకుంఠమున కేగుచున్నాను. త్వరితముగ రమ్ము" అని యాతఁడు భార్యకుఁ గబురంపఁగా, నామె "గర్భవతి నెట్లురాఁగలను?" అనెను.

తుకారామస్వామి భక్తులందఱితోఁగలసి 'దేహూ' గ్రామమునందలి విఠోబాదేవళమున నృత్యముసేయుచు క్రీ. శ. ౧౬౪౯ బహుళవిదియనాఁటి యుషఃకాలమున నింద్రాణీనదికరిగి, జలసమాధి నొందెను. భార్యనుజూచి తుకారామస్వామి యొకప్పుడు "నీకుఁ బుత్రుఁడు జన్మించును. ఆతఁడు మహాభక్తుఁడగును. నారాయణుఁ డని పేరుపెట్టుము" అని చెప్పియుండెను. అట్లే జరిగెను. తుకారామస్వామి కుమారుఁడు నారాయణుఁడు భక్తాగ్రణియై రచించిన యభంగము లిప్పటికిని మహారాష్ట్రదేశమున వాడుకయందున్నవి. భక్తుల జీవితచరిత్రలు బ్రహ్మానంద దాయకములుగదా!



# 2 శ్రీకృష్ణచైతన్యుఁడు.



క్రీ.శ. 1485 సం॥రమున ఫాల్గుణశుద్ధ పౌర్ణిమనాఁడు గౌరాంగ ప్రభువు గంగానదీతీరముననున్న నవద్వీపమను గ్రామమున జన్మించెను. గౌరాంగప్రభుని నామధేయము విశ్వంభరుఁడు. శరీరము గౌరవర్ణవిరాజితమై యుండుటచే, గౌరాంగుఁడనియుఁ బిలువఁబడుచుండెను. తండ్రి జగన్నాథమిశ్రుఁడు. తల్లి సద్గుణసంశోభిత శచీదేవి. జగన్నాథమిశ్రుఁడు మాత్రము విశ్వంభరుని 'నిమాయి' యనుముద్దుపేరుతోఁ బిల్చుచుండెను. జగన్నాథమిశ్రుని కెనమండ్రు స్త్రీసంతానము గలిగెను. ఆ యాఁడుశిశువులలో నొక్కరును జీవించలేదు. తుదకొక మగశిశువు జన్మించెను. ఆ శిశువునకుఁ దలిదండ్రులు విశ్వరూపుఁడని నామకరణ మొనరించిరి. విద్యానిలయ మననొప్పు నవద్వీపము సకలశాస్త్రపారంగతులగు పండితులతో నొప్పుచుండెను. విశ్వరూపుఁడు సకలశాస్త్రముల నభ్యసించెను. విశ్వరూపునిఁ గన్నతరువాతఁ జాలవత్సరములకు శచీదేవి విశ్వంభరునిఁ గాంచెను. శచీదేవి విశ్వంభరునిఁ బదమూడుమాసములు గర్భమున మోయుటచేతను, జంద్రగ్రహణసమయమున జననమొందుటచేతను, బండితులాతఁడు జగదేకవిఖ్యాతుఁడగునని ఫలముచెప్పిరి.

నిమాయి యనుపేరునఁ బరఁగు విశ్వంభరుఁ డసమానరూపలావణ్యవిలసితుఁ డగుటచే నెల్లరికిఁ బ్రేమాస్పదుఁడై యుండెను. ఆతఁడు నిరంతరము నల్లరిసేయుచుండెను. ఆతని యల్లరికి మితిలేకుండెను. ఎండటో యల్లరిపిల్లల నాతఁడు చేరఁదీసి, తోఁటలలోనికేఁగి, ఫలములఁ గోసితినుట, గంగానదిలో మిట్టమధ్యాహ్నమువఱకు స్నానముఁజేయుచు, నటకు స్నానార్థమేగు బ్రాహ్మణులపైఁ జలముఁజల్లుట,

మున్న గుపనులఁ జేయుచుండెను—వారు జపమొనరించు కొనుతఱి సమీ పించి, యేమియుఁ దోఁచకుండ పెద్దయల్లరి సేయును. స్నానముఁ జేయువారు తీరమున నొకచోఁ బెట్టుకొనిన వస్త్రముల దూరముగఁ గొనిపోవును.

ఇట్టి యల్లరిపనులఁ గావించుచుండుట భరించలేక, నవద్వీప వాసులు పెక్కుఱు నిమాయి తల్లిదండ్రులతోఁ జెప్పిరి. జగన్నాథ మిశ్రునియెడల గలయభిమానము వలనను, శచీదేవి మంచితనమును బట్టియు, గ్రామములోనివారు నిమాయి యెంతయల్లరి చేసినను యూర కొనుచుంటిరి.

కొంతకాల మిట్లుగడచెను. సకలశాస్త్రపారంగతుఁడైన విశ్వ రూపుఁడు తలిదండ్రులకుఁ దెలియకుండ నింటినుండి వెడలిపోయి, సన్యాసము స్వీకరించెను. శచీదేవియు, జగన్నాథమిశ్రుఁడును, పుత్ర వియోగదుఃఖమును భరింపఁజాలకపోయిరి. వారల నూఱడించి, తన యన్న లేనిలోపమును దాను దీర్పనెంచి, నిమాయి విద్యాభ్యాసము నారంభించెను. కొలఁదికాలములో నాతఁ డసాధారణపాండిత్య మల వఱచుకొని, 'శాస్త్రి' బిరుదసత్కారము నొందెను.

కుమారుని విద్యావ్యాసంగముఁ జూచి, తలిదండ్రులు భయము నొందిరి. విశ్వరూపునివలెనే, నిమాయికూడ నద్వితీయపాండితి నల వఱచుకొని సన్యసించి, తమ్ము దుఃఖవారాశిమగ్నమానసులఁ జేయు నేమోయని సంశయించి, శచీదేవియు, జగన్నాథమిశ్రుఁడును నిమాయిని చదువునుండి మాన్పించిరి. నిమాయి కేమియుఁ దోఁచదాయెను. ఆతఁ డొకనాఁ డంట్లుతోమికొను నపరిశుద్ధ స్థలమున నిలువఁబడి యుండుటఁజూచి, తల్లి శచీదేవి నిందిం చెను—నిమాయి మెల్లగానవ్వుచు "నమ్మా! చదువుకొనకుండ జేసి

తివి. పరిశుద్ధాపరిశుద్ధములు నాకెట్లు తెలియు ? ” నని ప్రశ్నించెను. శచీదేవి మాఱుమాటాడక కుమారుఁడు విద్యాభ్యాస మొనర్చుట కంగీకరించెను. నిమాయికిఁ దలిదండ్రు లుపనయన మహోత్సవమొన రించిరి. నిమాయి తర్క వ్యాకరణ మీమాంసలం దసమానపాండిత్య మలవఱచుకొనెను. ఇట్లుండఁగా, జగన్నాథమిశ్రుఁడు వ్యాధిగ్రస్తుఁడై పరలోకమున కేగెను. సంసారభారము నిమాయిపైఁబడెను. అతఁ డొకపాఠశాలనేర్పఱచెను. ఉపనయనానంతరము నిమాయి గౌరాంగుఁ డని పిలువఁబడసాగెను. గౌరాంగుని పాండిత్యప్రకర్ష నెఱింగియున్న నవద్వీపవాసులు తమ సుతులను గౌరాంగుని పాఠశాలకే పంపసాగిరి.

## వి వా హ ము.

---

బాల్యమున నిమాయి వల్లభాచార్యుఁడను ద్విజోత్తముని తనయయగు లక్ష్మిని ప్రేమించియుండెను. ఆమెకూడ నిమాయియెడ ననురక్తయైయుండెను, వల్లభాచార్యుడు నిమాయితల్లియగు శచీదేవి యనుమతిఁగొని, లక్ష్మి నాతనికిచ్చి వివాహ మొనరించెను. కొన్నిదిన ములు గడచినపిదప, గౌరాంగుఁడు శిష్యులతో వంగదేశమునందలి ప్రతినగరమును దర్శించుటకై పయనమయ్యెను. ఎటకేగినను గౌరాం గునకు విశేషసత్కారము లభించెను. అతఁడు తిరిగి, తిరిగి నవద్వీపము నకువచ్చి, తనకుఁ బ్రేమాస్పదమైన యర్ధాంగి, లక్ష్మి సర్పముచే గఱువఁబడి మృతినొందినదని తెలిసికొని దుఃఖితాత్ముఁడాయెను. సనా తనుఁడు తనకుమార్తె విష్ణుప్రియను గౌరాంగునికిచ్చి వివాహ మొన రించెను.

ఈశ్వరపూరియను మహాపండితుఁడు నవద్వీపమున కేతెంచి, యాదిత్యుఁడను వైష్ణవోత్తముని గృహమున శ్రీకృష్ణసంకీర్తనముఁ

చేయుచుఁ గొలఁది దినములుగడపెను. గౌరాంగుఁ డీశ్వరపూరిలో వేదాంతాది విషయములందు చర్చలసలిపెను. ఈశ్వరపూరి మహా మహిమాన్వితుఁడని గ్రహించి, గౌరాంగుఁ డాతనితో గయకేగి, పితృశ్రాద్ధకర్మ లాచరించి, దసాక్షరీ మంత్రోపదేశమునొంది, నవద్వీప మునకుఁ దిరిగివెళ్లెను. అప్పటినుండియు గౌరాంగునిలో గొప్పమార్పు కానవచ్చెను. ఆతఁడు నిరంతరము శ్రీకృష్ణసంస్మరణం బొనరింప సాగెను. ఆతని ప్రవర్తనలో సంఘటిల్లిన యీమహాపరివర్తనమును గాంచి, తల్లి శచీదేవియు, సతి విష్ణుప్రియయు మిగుల దుఃఖించిరి.

నవద్వీపమున కనతిదూరమున గంగానదీతీరమున బ్రహ్మచారి యను సన్యాసి యొక పటకుటీరమును నిర్మించుకొని, నివసించుచుం డెను. గౌరాంగుఁడా బ్రహ్మచారికడకరిగి, భక్తిపరవశుఁడై నృత్యము చేసి, మూర్ఛాగతుఁడాయెను. బ్రహ్మచారి శిష్యులాతనినింటికిఁ గొని పోయిరి. నాఁటినుండి గౌరాంగుఁడు శిష్యులకుఁ బాఠములఁ జెప్పుట మానివైచెను. శిష్యులందఱును విచారబాష్పాక్రాంత లోచనులై "స్వామీ! మాకిఁక నేదిగతి?" యని ప్రార్థింపఁగా, గౌరాంగుఁడు "నేను బాఠముల బోధింపఁజాలను. మీకిష్టమున్నచో నాగోపికా మనోవల్లభుని–రాధాకృష్ణుని భజనలఁ జేయుదము—రాధాకృష్ణుల పవిత్రప్రణయగాథలఁ బాడుకొందము. రండు. లేనిచో మఱొక పండితునికడకుఁబోయి చదువుకొనుఁడు" అనియెను. శిష్యులలో నొక డేని వెడలిపోలేదు. అందఱును గౌరాంగునితోఁగూడి శ్రీకృష్ణభజన మొనరింపసాగిరి.

భక్తాగ్రగణ్యుఁడని గౌరాంగుఁడు ప్రఖ్యాతినొందెను. అనేకు లాతని శిష్యులుగాఁజేరిరి. వాదోపవాదములచేఁ బ్రతిధ్వనించెడి, గౌరాంగునిగృహము శ్రీకృష్ణనామ సంకీర్తనముతో మాఱ్మ్రోగసా గెను. ఆతనికడ మొదట ముకుందుఁడు, గంగాధరుఁడుననువారలు

మొట్టమొదట గౌరాంగుని శిష్యులైరి. ముకుందుఁడు గానకళాప్రవీణుఁడు. శ్రీనివాసపండితుని యింటఁ దఱచుగా భజనలు జరుగుచుండెను. గౌరాంగుఁ డాభజనలఁ బాల్గొనుచుండెను. నిత్యానందుఁడను పేరుగల సన్న్యాసికూడ గౌరాంగుని ప్రఖ్యాతి నాకర్ణించి శిష్యుఁడుగాఁ జేరెను.

గౌరాంగుని గృహము విశాలమైనది కానందున నిరంతరము శ్రీనివాసపండితుని యింటనే భజనలు జరుగుచుండెను. భజనవేళల గౌరాంగుఁడు తఱచుగా స్మృతినిఁ గోల్పోవుచుండెను. ఆతఁ డొకప్పుడు తన్మయుఁడై గంతులిడుచుండెను. తనయందుఁ గృష్ణునధ్యారోపముఁ జేసికొని, యితరుల గోపికలనును మఱొకప్పుడు తానే రాధయనును. గౌరాంగుని వినూత్నప్రేమ సిద్ధాంతములను శిష్యులగు నిత్యానంద హరిదాసులు ప్రచారముఁ జేయసాగిరి. శ్రీనివాస పండితుని గృహముకూడ, భజనలఁ గాంచుటకేతెంచు జనులకుఁ జాలకుండెను. అనుదినము గౌరాంగుని భజనఁజూచుటకై జనులు తండోపతండములుగ రాసాగిరి. జగన్నాధమాధవులను బ్రాహ్మణులు గౌరాంగునియెడ ప్రబలవైరభావ మూని, యాతని శిష్యులగు నిత్యానంద ముకుందులతో నొకనాఁడు పోరాడి, కొట్టిరి. నిత్యానందుఁడు శాంతమూర్తియై మాఱుమాటాడక, జగన్నాధమాధవులను భజనముకడకుఁ దీసికొనిపోయెను. ఆ భజనఁ జూచినపిదప, వారి చిత్తములందుఁ బరివర్తన ముదయించెను. వారు గౌరాంగునిశిష్యులలో, నగ్రగణ్యులైరి.

ఈ విధముగా నిత్యము శ్రీకృష్ణుని భజించుచుండినను, గౌరాంగుని కణుమాత్రమైన శాంతి లేకుండెను. ఆతనిచిత్తమున నేదో చెప్పరాని, మహాకలవర ముదయించెను. సంసారజాలమునఁ దాను జిక్కువడియున్ననాళ్లును, మోక్షము లభించుటకవకాశము లేదని యాతఁడు గ్రహించెను. సన్న్యాసము స్వీకరింతునని, గౌరాంగుఁడు నిత్యానంద

ముకుందులతోఁ జెప్పెను. శిష్యులందఱును దుఃఖాక్రాంతస్వాంతులైరి. శచీదేవికూడ యీవార్త నాలకించి, విచారభరితాత్మయై గౌరాంగునిఁ బిలిచి "నాయనా! సకలశాస్త్రపారంగతుఁడై నీయన్న విశ్వరూపుఁ డిలువీడి, సన్యాసము నవలంబించి, చనెను. నీవుకూడ నాకుఁ గనబడ కుండ వెడలిపోయెదవా?" యని, కనుల నీరునించెను. గౌరాంగుఁ 'డమ్మా! నే నెటకేగినను, నీకు సమీపముననే యుందు' ననెను. ఆతనిసతి విష్ణుప్రియ దుఃఖమాపుకొనఁ జాలక, వలవల నేడ్చినది. వివాహమైన రెండుసంవత్సరములకే వియోగమా యని విలపించినది. గౌరాంగుఁ డామె నోదార్చినాఁడు.

మఱునాఁటిరాత్రి శ్రీనివాసపండితుని గృహమున నెప్పటియట్ల భజనజరిగినది. అర్ధరాత్రమైనది. గౌరాంగుఁడు తల్లి శచీదేవియు, భార్య విష్ణుప్రియయు గాఢనిద్రాముద్రితలై యుండుట గాంచి నాఁడు. మెల్లగాలేచి, మాతృదేవతకు నమస్కరించి, శయ్యాగార ములో నిద్రించుచున్న సతినొకసారి తిలకించినాఁడు. పాపమా యమా యికహృదయ, విష్ణుప్రియ పెదవులపై నిద్రాసమయమునఁ గూడ మందహాసచంద్రికలు తాండవించుచున్నవి. ఆ మనోహరమూర్తి వంక నట్లే యొకటిరెండు నిమిషములుచూచి, గౌరాంగుఁడు దీర్ఘనిశ్వాసము విడిచి, యిలువీడి వెడలిపోయెను—

మఱుచటిదిన ముదయమున గౌరాంగుఁడు గృహపరిత్యాగ మొనరించెనని యెఱిఁగి, నవద్వీపవాసులెల్లరు దుఃఖార్ణవమగ్నమానసు లైరి. నలుగురు శిష్యులు గౌరాంగు నన్వేషింపబయలుదేఱిరి. వారా తని కేశవభారతీస్వామి కుటీరముకడ కాంచిరి. గౌరాంగుఁడు వారిని వెడలిపొమ్మని యెంతో బ్రతిమాలెను. వారు వినలేదు. నిత్యానంద గదాధర ముకుందులు తన్ననుసరించివచ్చుట కాతఁడెట్టకేల కంగీకరిం

చెను. ఈవార్త క్షణములోఁ జుట్టుప్రక్కలనున్న గ్రామములకు వ్యాపించెను. నవద్వీపమునుండి యెందఱో స్త్రీలు, పురుషులు వచ్చిరి. భజన ప్రారంభమాయెను. అత్యంతసుందరములైన గౌరాంగుని కేశములు ఖండింపఁబడెను. ఆ నవమోహనాకారుఁ డట్లువిరూపుఁడగుట చూచి, స్త్రీలు, శిష్యులు భూమ్యాకాశములు ప్రతిధ్వనించునట్లేడ్చిరి. గౌరాంగుఁడు కాషాయాంబరముల ధరించెను—కమండలువు చేఁబూనెను. కేశవభారతీస్వాములు గౌరాంగునకు శ్రీకృష్ణచైతన్యుఁడని పేరుపెట్టెను. శచీదేవియు, విష్ణుప్రియయు వచ్చి, శ్రీకృష్ణచైతన్యునిగాంచి, విలపించిరి. వారి నూఱడించి, యాతఁడు జగన్నాథక్షేత్రము (నీలాచలము) నకు బయలుదేఱెను.

నిత్యానంద ముకుందు లెలుఁగెత్తి, శ్రీకృష్ణసంకీర్తన మొనరించుచుండిరి. ప్రతిగ్రామమునను శ్రీకృష్ణచైతన్యున కఖండమగు గౌరవము లభించెను. కొలఁది దినములు పయనమొనరించి, వారు జగన్నాథక్షేత్రమును సమీపించిరి. దేవాలయగోపురము దృగ్గోచరమైనంతనే, శ్రీకృష్ణచైతన్యుఁడు శిష్యులనువీడి, తన్మయుఁడై పరుగెత్తుకొనిపోయెను. ఆతఁడు దేవాలయమున ప్రవేశించుటఁజూచి, పిచ్చివాఁడని భ్రమించి, పూజారులు పరుగెత్తుకొనివచ్చిరి. చైతన్యుఁ డొకసారి, జగన్నాథ విగ్రహామువంక తేఱిపాఱఁజూచి, భక్తివివశుఁడై మూర్ఛిల్లెను.

ఆ సమయమున సార్వభౌమభట్టారకుఁ డనుపండితుఁ డుండెను. ఆతఁడు చైతన్యుని, శిష్యులను దనగృహామునకుఁ దోడ్కొనిపోయెను. శీతలోపచారములవలనఁ జైతన్యుఁడు స్మృతినిఁగోల్కొనెను. ముకుందుఁడు మనోజ్ఞముగ—హృదయాహ్లాదకరముగఁ బాడసాగెను—భజన జరిగెను. చైతన్యుఁ డందుఁబాల్గొనెను. శాస్త్రవేత్తయగు సార్వభౌమభట్టారకునకును జైతన్యునకును మహాద్భుతమైన చర్చజరిగెను. చైత

న్యుని భక్తిరసభరితములగు నుపన్యాసముల నాలకించి, యనేకులు ముగ్ధులైరి. శ్రీకృష్ణునిఁగూర్చి, చైతన్యుఁడు పలికినవాక్యముల నాకర్ణించి, సార్వభౌమభట్టారకుఁడు ముగ్ధుఁడై, యాతని పాదరజము శిరమునఁ దాల్చెను. చైతన్యునకు సేతుబంధరామేశ్వరమును సందర్శింపఁ గుతూహలమొదవెను. క్రీ.శ. 1509 సం॥రమున శ్రీకృష్ణచైతన్యుఁడు కృష్ణదాసను శిష్యునితో బయలుదేఱి, రామేశ్వర దివ్యక్షేత్రము దర్శించి, యటనుండి ద్వారక కేగి, తిరిగిజగన్నాథమును జేరెను. ఆతని రాకనుగూర్చి శచీదేవికిఁ దదితరులకు వర్తమాన మంపఁబడియెను. నవద్వీపవాసులు పెక్కుమంది, జగన్నాథమునకువచ్చి, చైతన్యునిఁ గలిసికొని, మహదానందభరితులై కొలఁది దినములుగడపి, తిరిగివెడలిరి. చైతన్యుఁడు శాంతిపురమునకేగి, తల్లి శచీదేవిని, భార్య విష్ణుప్రియను జూచి, గౌరునగరమును సందర్శించి, యటఁగొందఱు శిష్యులఁ జేర్చుకొని, బృందావన, మధుర, ప్రయాగ, వారణాసీపుణ్యక్షేత్రముల సందర్శించి, తిరిగివచ్చి, పండ్రెండువత్సరములు నిశ్చలసమాధిలో గడపెను. తనశిష్యుఁడగు నిత్యానందుని వంగదేశమునఁ దన సిద్ధాంతములఁ బ్రజాబాహుళ్యమునఁ బ్రచారమొనర్పఁ బంపెను. ఆతని ప్రియశిష్యుఁడు హరిదాసు మృతినొందినవార్తవిని, చైతన్యుఁడు విచారించెను. ఒకనాఁటిరాత్రి యాతఁడు సాగరతీరమునఁ గూర్చుండి, శ్రీకృష్ణసంకీర్తన మొనరించి, తన్మయుఁడై సముద్రజలములఁ బడిపోయెను. శిష్యులు బెస్తచే వలవేయించగాఁ జైతన్యుని కళేబరముదొరకెను. దహనసంస్కార మొనరించి, శిష్యులు మిక్కిలివిచారించిరి. పుణ్యక్షేత్రముల దర్శించినందునఁ గల్గుఫలము శ్రీకృష్ణనామ స్మరణముననే కలుగునని యాతఁడు బోధించెను.

---

# 3 నందనార్.

తంజావూరు జిల్లాలో 'ఆదనూరు' అను కుగ్రామముండెను. ఈయూరు 'వైతీశ్వరన్ కోయల్' రైల్వేస్టేషనునకు మూఁడుమైళ్ల దూరమున నున్నది. మనకథానాయకుఁడగు నందుఁడీ పల్లెయందు జన్మించెను. నందుఁడస్పృశ్యకులసంభూతుఁడు. అన్నిజాతులలోను పంచములని చెప్పఁబడు నీఅస్పృశ్యులజాతి మిక్కిలి నీచముగఁ బరిగణింపఁ బడుచుండెడిది. పంచములకుఁ జదువులేదు. వృత్తి చెప్పులుకుట్టుట, టముకువేయుట, పొలముల దున్నుకొనుటయై యున్నది. వారి కుటీరము లూరివెలుపల నుండును. వీధులు పరిశుభ్రముగనుండక తేమతో నిండి, దుర్గంధము వ్యాపింపఁజేయుచుండును. వారుపెంచునవి పశువులు, పందులు, కోళ్లు. పాపము వారు నాగరికతయనున దెఱుంగక, భయంకరమగు పిశాచదేవతలఁ గొల్చుచు, బ్రాహ్మణులు పవిత్రముగాఁ బూజించు గోమాంసముఁదినుచు కాలముగడపుదురు. హీనముగాఁ బరిగణింపఁబడునట్టి పంచమకులమున జన్మించిన నందుఁడు బాల్యమునుండియు భూతదయాపరుఁడై యుండెను. మద్యముద్రాగుటయును, పలలము భక్షించుటయు నాతనికిఁ గిట్టకుండెను. మాంసముఁ దిననిచో నిఁక తినుటకేదియు లభింపనందున విధిలేక పలలము నపుడపుడుమాత్ర మాతఁడు భుజించుచుండెను. ఆతఁ డాడుకొనునపుడుకూడ మట్టితో దేవునివిగ్రహములఁ జేయుచుఁ బూజించుచుండెను. తనకులస్థులు గోవులు, మేకలు మున్నగువానిం జంపునపు డవియఱచుటవిని, నందుఁడు కంపితుఁడగుచుండెను. ఆతని నేత్రములు దుఃఖాశ్రుసిక్తములగుచుండెను.

ఒకప్పుడాతఁడు వ్యాధిగ్రస్తుఁడాయెను. ఆతని తలిదండ్రులు తమతనయుఁడు వ్యాధినివృత్తిఁ గాంచినచోఁ గులదేవతలకు మేకను

బలియిచ్చెదమని మ్రొక్కుకొనిరి. నందునికిఁ బ్రియతమమైన మేకఁ పిల్లయొండుకలదు. ఆపిల్లనే తలిదండ్రులు బలియిచ్చినందున, నందుఁడు మేరమీఱిన దుఃఖమునొందెను. బ్రాహ్మణులు మత్స్యమాంసాదులఁ దాఁకక, పవిత్రజీవనము గడపుచున్నపుడు తామేల భయంకరములైన పిశాచదేవతలఁగొల్చి, మధ్యము ద్రావి నీచజీవనముఁ జేయవలయునని యతఁడు సందేహించెను. తనకులమువారుకూడ బ్రాహ్మణులుగొల్చు దైవముల నేలకొలువరాదని యాతనిపంతము. బ్రాహ్మణులవలె నేల దన తలిదండ్రులు, తనకులస్థులు పరిశుభ్రముగ నుండరాదని యాతని సంశయము ?

నందునకు బాల్యమునుండియు బ్రాహ్మణులఁగొల్చు దేవులపై భక్తిమెండుగానుండెను. పరమపవిత్రమైన దివ్యక్షేత్రముల సందర్శించి, పుణ్యము సంపాదించుట నందనారు కుతూహలమైయుండెను. ఇట్లుండఁగా నందునితండ్రి చనిపోయెను. మారివ్యాధి, ఆ మాలగూడెములోఁ బ్రవేశించెను. అనేకులు మృతినొందిరి. గూడెములోనివారందఱును భయకంపితులై, అమ్మవారైన మారెమ్మకు పెక్కుకోళ్ళను, బలియిచ్చిరి. పాపము నందుఁడుకూడ వ్యాధిగ్రస్తుఁడయ్యెను. కులస్తులెల్లరునువచ్చి, పదికోళ్ళను, రెండుమేకలను వీరన్, ఎరులన్ మారెమ్మ దేవతలకు బలియిచ్చినఁగాని, నందునివ్యాధి నివృత్తికాదనిరి. నందుఁడట్టివేమియును జేయనీయఁడాయెను. ఆతనికిఁ దనకులదేవతలన్న విశ్వాసము లేదు. ఆతని స్నేహితులువచ్చి, దగ్గఱకూర్చుండిరి. వారితో నందుఁడు "మిత్రులారా ! నేను తిరుప్పంగూరు దేవాలయముననుండే శంకరుఁడే దైవమని నమ్మినాను. ఆతనినిఁ బూజించినచో మనపాతకములు పటాపంచలగును. నేనా మహామహుని భక్తుఁడను. నేను జీవించినచో నది యా కైలాసలోకాధిపతి యగుశంకరుని కరుణాకటాక్షమే యగును. మనము నీచకులోద్భవులమైనను, బ్రాహ్మణు లగ్రజాత్యుద్భవులైనను, పరమాత్ముని దృష్టిలో నందఱమును సమానులమే. ఆతఁడే మన

తండ్రి" యని, కనులుమూసికొని, నిద్రించెను. తెల్లవాఱు సరికి, నందుఁడు వ్యాధినిర్ముక్తుఁ డాయెను. ఆరాత్రి నందునకు స్వప్నమున కైలాసాధిపతియగు త్రిశూలపాణి సాక్షాత్కరించి యభయహస్తము నొసఁగినట్లాయెను. ఆతఁ డుదయమునలేచి, యానందబాష్పాకుల నయనుఁడై, స్వప్నోదంతమును మిత్రులకెఱింగించెను.

ఆనాఁడు శనివారము. తిరుప్పంగూరు దేవాలయమునకు నందుఁడు కొంతమందిస్నేహితులతో బయలుదేఱెను. ఆతఁడు తనతోఁ బ్రశస్తమైన చర్మమును, గోరోజనమును, కొబ్బరికాయలను, నరటి పండ్లను గొనిపోయెను. ఆతఁడు దేవాలయమును సమీపించి, ప్రదక్షిణమొనరించి, భక్తివివశుఁడై, తాను గొనివచ్చిన గోరోజనమును స్వామికి నివేదించుమనియును, చర్మముతో ఢమరుకము నిర్మింపఁజేయుమనియుఁజెప్పి ధర్మకర్తలకు సమర్పించెను. ఆలయ ఘంటానాదము నందుని హృదయమున నిర్భరానందపరవశమొనర్చెను. ఆతఁడు దూరముగా నిలుచుండెను. నందీశ్వరుఁ డడ్డముగానుండుటచేఁ బార్వతీనాథుఁడు కాన్పించలేదు. దుఃఖాశ్రుపూరిత లోచనుఁడై, నందుఁడు "సర్వేశా! హీనకులసంజాతుఁడను, దీనుఁడను, పాపిని. అందుచేతనే నీదర్శనభాగ్యమునకు నోచుకొనఁజాలనివాఁడనైతి" నని, సాష్టాంగదండప్రణామ మొనరించెను. ఆతఁడు చాలసేపటివఱకు నట్లేయుండెను. మిత్రు లెవరును నతనిని సమీపించుటకు సాహసించలేదు.

చాలసేపైనపిదప, నందుఁడులేచి చూచెను. నందీశ్వరుని విగ్రహమెప్పటివలె యడ్డముగానుండక, ప్రక్కగానుండెను. నందుఁడు మహానందభరితాత్ముఁడై "హరహరమహాదేవ" యని, యనేక విధంబులఁ నాశివుని సంస్తుతించెను. ఇప్పటికిని తిరుప్పంగూరు దేవాలయములోని నందివిగ్రహము శివునికెదురుగా నుండక యొకింత ప్రక్కగానేయున్నది. అచటిప్రజలీ కథనే నేఁటికినిఁ జెప్పుదురు.

## తటాకము (దవ్వుట.



తిరుప్పంగూరు గ్రామమున నొకతటాకము కలదు. అది యెండి పోయియుండెను. ఆ యూరిలోనివా రెల్లరును నూతులలోని నీరుతోడు కొనఁజాలక బాధపడుచుండిరి. స్వామిని సందర్శించుట కేగు యాత్రికులకుఁగూడ మిక్కిలి యిబ్బందిగానుండెను. ఈవిషయము గమనించి, నందుఁడు తటాకముఁ ద్రవ్వుటవలనఁ జాలపుణ్య మొదవునని తలంచి, మిత్రులతోఁగలిసి, యూరాత్రియంతయుఁ గష్టపడి త్రవ్వెను. మహాదేవుఁడు తన తనయుఁడగు గణపతిని వారికి సాహాయ్యముఁజేయుట కంపెనని పురాణమున వ్రాయఁబడియున్నది.

## చిదంబరము.



నందనారు తండ్రి చనిపోయిన కొంతకాలమునకు వృద్ధుఁడైన యజమానికూడ రోగపీడితుఁడై మృతినొందెను. ఆ యజమాని కుమారుఁడు నందునికి సమానవయస్కుఁడై యుండెను. అతనికిఁ గోపము మెండు. నందుఁడు తదితరులవలె మద్యముఁ ద్రాగనందునను, నసత్య మాడనందునను, యజమాని యాతనియెడల నభిమానముఁ గలిగియుండెను. తనపొలముల సేద్యముచేయు నితరపంచములపై నందు నధికారిగ నియమించెను. ఇందువలన నాగూడెములోనివారి కందఱకును నందునియెడ గౌరవము జనించెను. తిరుప్పంగూరులోని శంకరభగవానునకుఁ బ్రతియుత్సవమునకు గోరోజనము, పండ్లు మున్నగు కానుకల సమర్పించుట మానకుండెను.

ఒకప్పుడాతఁడు వైతీశ్వరన్ కోయిలలో నుత్సవము జరుగునని తెలిసికొని, మిత్రులందఱితోఁగలిసి రుద్రాక్షమాలలుధరించి, వెడలెను.

వీథులందు స్వామి నూరేగించినపు డాతఁడు మనఃపూర్వకముగ నమస్క-
రించెను. ఆరాత్రి యాయూరనెల్లరును జాగరము చేయుదురు. ఒక
చోట కొందఱు బ్రాహ్మణు లొకయరుగుపైఁ గూర్చుండి, పురాణ
కాలక్షేపముఁ జేయుచుండిరి. పౌరాణికుఁడు గంభీరస్వరముతో నేదో
గ్రంథమునుండి శ్లోకములఁ జదువుచు, నర్థము చెప్పుచుండెను. నందుఁడు
మిత్రులతో దూరముగాఁ గూర్చుండి, యాపురాణము నాలకింపసాగెను.
ఆ బ్రాహ్మణుఁడు చిదంబరక్షేత్రమునుగూర్చి చెప్పుచుండెను.—
"చిదంబరము మహాపవిత్రమైన పుణ్యస్థలము కాశీరామేశ్వరముల
కంటె విశేషమాహాత్మ్యముగలది. దేవాలయములో నృత్యముచేయు
చుండు నటరాజస్వామివిగ్రహము కనులపండువుగ నుండును. నట
రాజస్వామి నెవరుసందర్శించినను, తుదకు చండాలుఁడైనను సరియే
భవార్ణవమునుండి, తరించుటయేగాక జన్మరాహిత్యము నొందును".

ఇట్లని, నటరాజస్వామి మహాత్మ్యము నాపౌరాణికుఁడు వివిధ
ముల వర్ణించెను. నందుఁడీదియంతయు నాకర్ణించి, నిరవధికానంద భరి
తాంతఃకరణుఁడై, బిగ్గఱగా "ప్రభూ! చిదంబర మెచ్చటనున్న?"
దని ప్రశ్నించెను—

"కాలరూను నదీతీరమున నుత్తరదిశనున్న" దని, యా
భూసురుఁడు పలికెను—ఆతఁడు మఱల "మహాత్మా! చిదంబర
క్షేత్రమును చండాలుఁడు చూచినను, పాపరాసుల భస్మీభూత మొన
రించుకొనజాలునా" యని ప్రశ్నించెను. పౌరాణికుఁడు "ఇచ్చటి
నుండి యొకదినము పయనమొనరించినచో చిదంబరము చేరుదురు.
ఆ ప్రశ్నించున దెవరు? ఇంకేమైన సంశయములున్నచో నిచటికి వచ్చి
యడుగవచ్చును". అనియెను.

"ఆతఁడు పంచముఁడు. అస్పృశ్యభక్తుఁడు. ఆదనూరు నివాసి
యగు నందుఁడు. మన దేవాలయములకు గోరోజనము, ఢమరుకము

నకుఁ బ్రశస్తచర్మము నొసఁగుచుండు" నని, నందుని మిత్రుఁడొకఁ డనెను. పురాణము ముగియుటచే నందుఁడు మిత్రులతోఁగలిసి బయలు దేఱెను. ఆతఁడు తిన్నగా పోవుచుండగా, మిత్రులు "నందా! ఏమిది? ఈ యర్థరాత్రమున నెటకేగెద?" వనఁగా, నాతఁడు "నన్నాపకుఁడు. నేను చిదంబరమున కేగుచున్నాను". అని బదులు పలికెను.

"అయ్యో! అట్లు వెడలిపోనగునా? మన యజమానులకుఁ జెప్పకుండ వెళ్లినచోఁ గోపగింపరా? మనము స్వతంత్రులము కామని, యొకరికి బానిసలమని తెలియదా?" అని మిత్రులుపలుక, నందుఁడు "అవును—మనము బానిసలము. నేను యజమాని నడిగి, యాతని యనుమతిగైకొనియే ఆదనూరు పోవుదును," అని, ఆదనూరుకు తిరిగిపోయెను.

ఆతనికిఁ జిదంబరము పోవలెననుకోరిక దినదినము చిత్తమునుకలంచుచుండెను. గాని యేదియో యొకవిఘ్నము తటస్థించుచుండుటచే "రేపు తప్పకపోవలె" ననుకొనుచుండెను. ఈవిషయము గమనించిన నందునిమిత్రులు "రేపు పోవువాఁ" డని పరిహాసింపసాగిరి. అహర్నిశములు నందునిహృదయమున తాండవశివుఁడు విద్యుల్లతవలె మెఱయుచుండెను. యజమాని యొకనాఁడు తోఁటకు నీరుతోడుమని, మఱొకనాఁడు కలుపుతీయుమని పనులఁ జెప్పుచుండెను. ఒకనాఁటి సాయంకాలము నందుఁడు మిత్రులతోఁ బొలములోని పనిముగించి, యస్తమించుచున్న సూర్యునివంక చూచెను. ఆ దృశ్యమత్యంత శోభాయమానముగ నుండెను. రక్తవర్ణవిరాజితమైయున్న యహస్కరుని బింబమును జూచుచు, నందుఁ డాలోచనానిమగ్నుఁ డాయెను. ఆతని మనశ్చక్షుస్సముఖమున నటరాజు గోచరించెను. నందుఁడు స్తబ్ధుఁడై, యా నట

రాజస్వామివంక చూచుచు, నానందబాష్పాక్రాంతలోచనుఁ డాయెను. స్నేహితులువచ్చి, నందుని పలుకరించి, నాతఁడెంతకును బలుకనందున నాతనికిఁ బిచ్చియెత్తినదని భావించి, యింటికిఁ దీసికొనిపోయి, తమ కులదేవతలగు వీరన్, ఎరులన్ మున్నగువారలకు మ్రొక్కులిడుకొనిరి.

నందుని ప్రవర్తనముఁగాంచి, గూడెములోనివా రెల్లరును భయభ్రాంతులై, పొలములకుఁబోవక కూర్చుండిరి. పొలములన్నియు సస్యసమృద్ధములై కోఁతకు సిద్ధముగానుండెను. అట్టియెడ నందుఁడిట్లు మతిమాలినవానివలె నుండుట, నాతనింజూచుచు గూడెములోనివారు కూడ పనులమాని కూర్చుండుట చూచిన కొందఱువృద్ధులు తిన్నగా నందుని యజమానికడకుఁ బోయి, యావద్వృత్తాంతమును సవిస్తరముగ నెఱిఁగించిరి. కుప్పనూర్చవలసిన యదనున నందుఁడట్లుండుట విని, యాగ్రహాయత్తచిత్తుఁడై, యాతనిని పిలువనంపెను.

నందుఁడేతెంచి, యజమానికి సాష్టాంగదండప్రణామ మాచరించి "మహాప్రభూ! చాలకాలమునుండి, తమకు సేవకుఁడనై, విధేయతతోఁ గొల్చుచున్నాను. నాకుఁ జిదంబరమునకుఁ బోవలయు ననువాంఛ మెండుగానున్నది. తమరు నాయందు దయయుంచి, సెల వొసంగుఁ" డనెను. యజమాని రూక్షవీక్షణముల నాతనిపైఁబఱపి "ఏమీ? చిదంబరమా? అస్పృశ్యుఁడవగు నీకుఁ జిదంబరము చూచుట లోటయినదా? సరే! చిదంబరము చూపింతు" నని, యటనున్న మఱొకని నుద్దేశించి "ఓరీ! కొరడాతీసికొనిరమ్ము" అనెను. నందుఁ డించుకయుఁ జలింపక "నాయేలికా! నన్ను చంపుము. నేను చిదంబరము పోయివచ్చుట నాయభిమతము మూఁడు దినములలోఁ దిరిగివత్తును." అనెను—

నందుని దృఢనిశ్చయముఁగాంచి, యజమాని కోపము నుపశమింపఁజేసికొని "నందా! నీవు చిరకాలమునుండి, నన్ను విశ్వాసపా

త్రుడవై కొల్చుచున్నావు. ఆఱుపొలములకు నిన్ను రైతుగాఁ జేసి యుంటిని. పైరుతోనిండి కోతకు ధాన్యముసిద్ధముగనున్నయవి. ఇట్టి యెడ నీవు చిదంబరమేగినచో సస్యమెందుకును బనికిరాకుండపోవును. నామాటవినుము. నీక్రిందనున్న యాఱుపొలములలోని ధాన్యమును నూర్చినపిదప, చిదంబరమేగి, నీయిష్టము వచ్చినన్నాళ్లుండు" మని నాఁడు.

నందుఁడుపొందిన యానందమునకు మేరలేదు. ఆతఁ డొక్కగంతువైచి, పానములోనికిఁ బరుగెత్తినాఁడు. ఆతఁడు నిజముగాఁ బిచ్చివాఁ డయ్యెనని, యితరులు తలంచిరి. ఆఱు పొలములలోని ధాన్యముకోసి, నూర్చుటకుసిద్ధపఱచుట కెన్నోదినము లగునని యెఱింగిన నందుని కులస్థులు యజమాని యుక్తికెంతయు సంతసించి వెడలిరి.

నందుఁడు యజమాని యనుమతిఁ బడయుట.

---

నందుఁ డింటికిఁబోవలేదు. అతఁడుదిన్నగాఁ బొలమునకేవెళ్లెను. మఱుచటి దినముదయమున నందుఁడు యజమాని గృహప్రాంగణమున నిలువఁబడెను. యజమాని "నందా! ఉదయముననే వచ్చితివేల?" యనియడుగ నాతఁడు వినయవినమితాంగుఁడై "నాయేలికా! సస్యమంతయుఁ గోయఁబడి, నూర్పునకు సిద్ధముగనున్నది. నాకిప్పుడైన చిదంబరముపోవుటకు సెలవి" మ్మనెను. యజమాని నందునిపల్కుల విశ్వసింపక "ఏమిది? ఒక్కరాత్రిలోనే యాఱు పొలములలోని వరినికోసితివా? నమ్మను. చూత" మని బయలుదేఱెను. ఆఱు పొలములను జూచెను—సస్యము పరిశుభ్రముగ కోయఁబడి, కుప్పగా వేయఁబడియుండెను. యజమాని మహదాశ్చర్యానంద భరితాత్ముఁ డాయెను. ఇది కలయా? నిక్కువమా? యని, యతఁడుభ్రమించెను.

"నందా! ఇదియేమి? ఎందఱుకూలివారు నీతో రాత్రిపనిచేసిరి? నీవింటికి పోలేదే?" యని యజమాని నాశ్చర్యముగఁ బలికెను.—

స్వామీ! నేను కూలివారల నెవరిని నియమింపలేదు. నేనొక్కఁడనే రాత్రియంతయుఁ బనిచేసితిని. ఒకవేళ పరమాత్ముఁడైన యా నటరాజస్వామియే సహాయపడి యుండును".

నందుని యజమానిచిత్తమున మహాపరివర్తన ముదయించెను. ఆతఁడు నందు నాలింగనమొనరించుకొని "నందా! నీవస్పృశ్యుఁడవు. అయినను మహామహిమోపేతుఁడవు. నాతప్పు సైరింపుము. నన్ను మన్నింపుము. నీవు చిదంబరమునకు నెంటనేవెళ్లుము. నాకొఱకుఁగూడ నటరాజస్వామిని ప్రార్థింపుము." అనెను.

ఈవార్త దావానలమువలె నాగ్రామమున వ్యాపించెను. అనేకులు పొలములకుఁబోయి కోయఁబడియున్న వరినిగాంచి, విస్మయ విభ్రాంతమనస్కులైరి. నందుఁడు ప్రశస్తమైన చర్మమును గోరోజనమును దీసికొని బయలుదేఱెను. పదిమంది మిత్రులాతని ననుసరించిరి.

నందుఁడు చిదంబరముఁజేరెను. దేవాలయ గోపురమును విలోకించినంతనే యాతని చిత్తము సంతోషాతిశయమున నుఱ్ఱూతలూగెను. ఆతఁడు తన్మయుఁడై నృత్యమొనరించెను. ఆతఁడు మిత్రులతో దేవాలయము చుట్టును ప్రదక్షిణమొనరించి, తాను గొనివచ్చిన చర్మమును గోరోజనమును లోనికంపి, నటరాజస్వామిని దర్శించునభిలాషను దెలియఁజేసెను. నటరాజస్వామి దేవాలయ ధర్మకర్తలను దీక్షితారు లందురు. వారిలోఁ గొందఱు నందుని కోరికనెఱింగి నవ్విరి. కొందఱు గేలిచేసిరి. మఱికొందఱు జాలినొందిరి. ఇఁకఁగొందఱు కోపమునొందిరి. తనకట్టి యవకాశము లేదని గ్రహించి, నందుఁడు బాలునివలెనేడ్చెను.

"ఓ దయాసముద్రుఁడా! పరమేశ్వరా! నిన్ను సందర్శించి, భవార్ణవమునుండి తరింపఁదలంచి, వచ్చితిని. నా కాశాభంగము కలిగింతువా. నీవు నాకు దర్శనభాగ్య మొసఁగనిచో నేనిట మరణింతు" నని, నందుఁడు పలుమాఱు తలపోసెను. ఆరాత్రి నటరాజస్వామి దీక్షితారులందఱకు స్వప్నమున సాక్షాత్కరించి, "నాభక్తుఁడు నందుఁడు ఆదనూరునుండి వచ్చియున్నాఁడు. అతనిఁ బరిశుద్ధునొనర్చి దేవాలయములోనికిఁ గొనిరండు. అతఁడు పరిశుద్ధాత్ముఁడు పుణ్యశీలుఁడు" అనియెను. దీక్షితారులు మఱునాఁటి యుదయమునఁ దమతమ స్వప్నాంతము నొకరితో నొకరు చెప్పికొని, స్వామియాదేశాను సారముగ నందుని బరిశుద్ధశరీరు గావించుటకై తూర్పుమాడవీథిలో నగ్నికుండము నేర్పఱచిరి. అందుండి నిరపాయముగ నీవలికి వచ్చుటవలన నాతని కాయము పరిశుద్ధియగునని దీక్షితారుల యభిప్రాయము. అగ్నిహోత్రమునఁజొచ్చి, యసువులఁ బాయనేల, నాదనూరు పోవుదము రమ్మని, నందునితో స్నేహితులుచెప్పినను, ఆతఁడు వినలేదు. ఊరిలోనివారంఱు నాచిత్రము నాలోకించుటకై వచ్చియుండిరి.

నందుఁడు స్నానమొనరించి, విభూతిరేఖలు ఫాలభాగంబున దీపింప, నా యగ్నికుండమున కెదురుగనిలిచి, చేతులుజోడించి "ఓ ప్రభూ! నటరాజస్వామీ! నీభక్తుఁడను. నన్నిపుడు విషమపరీక్ష చేయనున్నావు. నేను నీచరణములనే నమ్మియుంటినేని, యీయగ్నినుండి నిరపాయముగ నీవలికి వత్తునుగాక" యని, నిర్భయముగ హరహర మహాదేవ యనుచుఁ బ్రజ్వరిల్లుచున్న యనలమునఁ జొచ్చి, యీవలికి వచ్చెను. నందున కేయపాయము ఘటిల్లలేదు. ఆతఁడు ధరించియున్న యార్ద్రవస్త్ర మట్లేయుండెను. ఆ శాంతమూర్తినిగాంచి, దీక్షితారులును, దదితరులును విస్మయ విభ్రాంతచేతస్కులైరి. దీక్షి

తారులు నందుని సమీపించి, "మహాత్మా! నీవు నిజమైనభక్తుఁడవు. నటరాజస్వామి నిన్ననుగ్రహించినాఁడు. నీభాగ్యమేభాగ్యము. నీయదృష్టమే యదృష్టము. రమ్ము" అని, యాతనిని దేవాలయములోనికిఁ దోడ్కొనిపోయి, యచటి విశేషములనన్నిఁటినిఁ జూపిరి. నందుఁడు భక్త్యావేశపరవశుఁడై, నటరాజస్వామినిఁజూచి, యానందము పట్టఁజాలక నృత్యముచేసి, పలువిధముల సంస్తుతించెను.

నందుఁడు నందనారని ప్రఖ్యాతిఁగాంచెను. ఆతఁడు పెక్కుదినములు నటరాజస్వామిసన్నిధిని భజనలఁజేయుచు గడపి, యొకనాఁడు యెల్లరు చూచుచుండ, హరిసంకీర్తనమొనరించి, స్వామిలో నైక్యమొందెను.

హరిజనుఁడై జన్మించియు, భక్తివిశేషముచే జన్మ సార్థకపఱచుకొన్న నందదారుని పవిత్రనామాక్షరము లిప్పటికిని దక్షిణదేశమునఁ బ్రతిగృహమునను దలఁచుకొనుచుందురు.

---

# 4 ఏకనాధస్వామి.

పైటనుపురంబునఁ జక్రపాణియను భక్తాగ్రణి కలఁడు. అతఁడు చిరకాలము సంతానముకొఱకు పెక్కువ్రతములు, దానధర్మములు నాచరించెను. తుదకాతని కొకమగశిశువు కలిగెను. ఆ శిశువునకు సూర్యనారాయణుఁడను పేరుపెట్టి, తలిదండ్రు లధికగారాబముతోఁ బెంచుకొననాగిరి. సూర్యనారాయణుఁడు దినదినప్రవర్ధమానుడైన పిదప రుక్మిణియనునాపె వివాహముఁ గావింపఁబడెను. ఆ దంపతులకు జన్మించిన సుపుత్త్రుఁడే ఏకనాధస్వామి. ఏకనాధస్వామి బాల్యమునుండియు, రమాకాంతునియెడల నసాధారణమగు భక్తికలిగి, వేదాంతచర్చలయం దాసక్తుఁడై యుండెను. ఒకనాఁడు పైటను నగరమునకు మహాభక్తాగ్రేసరుఁడును, జ్ఞానియుఁ బండితోత్తముఁడును నగు జనార్ధనపండితుఁడే తెంచెను. పలువు రాయనను సందర్శించి, ప్రహృష్టమానసులగుచుండిరి. ఏకనాధస్వామికూడ జనార్ధనపండితుని సందర్శింపనరిగెను. జనసమ్మర్ధము తగ్గినపిదప జనార్ధనపండితుఁ డేకనాధస్వామినిఁ జూచి, "ఓబాలుఁడా! నీవెవరవు? నీవు వచ్చినపనియేమి?" అని ప్రశ్నించెను.

ఏకనాధస్వామి "మహాత్మా! జీవులు పూర్వజన్మమున నార్జించిన పుణ్యావిశేషముచే సుఖమును, బాపవిశేషముచే దుఃఖమును బొందుదురు. మాయతోనిండిన యీజగమ్మునందుండి పాపకర్మల నాచరించుటకంటె, ముక్తిమార్గాన్వేషణ మొనరించి, తరించుటమేలుకాదే. నన్ననుగ్రహించి, మోక్షము నుపదేశమొనరింపుఁడు. నేను మీశిష్యుడనై శుశ్రూషచేయుట కనుమతింపఁగోరుచున్నా" ననెను.

బాలుఁడగు నేకనాథస్వామిపల్కులు జనార్దనపండితునకు విస్మయము కలిగించెను. అతఁడు "బాలుఁడా! నీవు పూర్వజన్మార్జిత పుణ్యవిశేషముచేతనే యిట్లు జ్ఞానివై పల్కుచున్నావు. నీవు భగవత్సాన్నిధ్యము నొందుమార్గముఁ దెలుపుదును. రమ్ము" అని చేరఁదీసి, తనతోఁగొంపోయెను. తలిదండ్రు లాందోళనమొందకుండ జనార్దనపండితుఁడు ఏకనాథస్వామిచేఁ గుశలపత్త్రిక వ్రాయించి, యంపెను. ఏకనాథస్వామి పండితుని నత్యధికమగు వినయవిధేయతలతోఁ గొల్చుచుండెను. పండితునిద్రవ్యమంతయు నతనికడనేయుండును. ఎప్పుడెందుల కెంత వ్యయపఱచినదియు లెక్కల నతఁడు సరిగావ్రాసి చూపుచుండెను. శిష్యునిదీక్షకు సంతసించి, జనార్దనపండితుఁడు తారకమంత్రోపదేశమొనరించెను. ఇట్లుండగా దత్తాత్రేయస్వామి జనార్దనపండితునకు దర్శనమొసంగుదునని, స్వప్నమున సాక్షాత్కరించి చెప్పెను. జనార్దన పండితుఁడేకనాథస్వామి నుద్దేశించి, "వత్సా! మద్గురువర్యుఁడు దత్తాత్రేయస్వామి మనలఁ దరింపఁజేయుటకై వచ్చును. ఆయన యేరూపమునవచ్చునో చెప్పఁజాలము. ఆయన రాఁగానే, పాదములపైఁబడి నమస్కరించి, యాయన స్వీకరింపగామిగిలిన యుచ్ఛిష్టము నారగించి, ధన్యుఁడవుక" మ్మనియెను.

ఏకనాథస్వామియు, జనార్దనపండితుఁడు నొకవిజనప్రదేశమునఁ గూర్చుండిరి. దత్తాత్రేయస్వామి తురుష్కునివలె మాఱువేషము ధరించి వచ్చెను. ఆఛద్మవేషధారి తనగురువర్యుఁడని గ్రహించిన జనార్దనపండితుఁడు నిజమహిమాతిశయముచే బంచభక్ష్యపరమాన్నసంయుతమగు భోజనము నేర్పాటుచేసెను. దత్తాత్రేయస్వామి యుచ్ఛిష్టమును దిన నొల్లక దూరముగఁబోయి నిలుచుండియున్న ఏకనాథస్వామిని బిలిచి, జనార్దనపండితుఁడద్దానిని భుజింపఁజేసెను. దత్తాత్రేయస్వామి ఏకనాథునిఁ గాంచి "ఈతఁడు మహాభక్తుఁడై దిగంతవిశ్రాంతయశఃకాముఁ

డగును. మహారాష్ట్రమున శ్రీమద్రామాయణమును విరచించి, యజ్ఞానాంధకారంబున దోఁగాడుచున్న వారి చిత్తముల విజ్ఞానోత్తేజములుగఁ జేయు" మని పలికి, యంతర్థానమునొందెను.

ఏకనాథస్వామి యనర్గళకవితాధారతో గేయముల రచింప సాగెను. భావార్థ రామాయణమనుపేర రామాయణగాథను మనోహరముగ మహారాష్ట్రభాషను రచించి, వినుతికెక్కెను. మహామహిమోపేతుఁడైన ఏకనాథస్వామినిఁ దనశిష్యునిగ నుంచుకొనుట యుక్తము కాదనిభావించి, జనార్దనపండితుఁ డాతనిని స్వస్థలమగు పైఠనుపురము నకుఁబోయి, పుత్రవియోగార్తులై యున్న తలిదండ్రుల సాన్నిధ్యముననే యుండి, పాండురంగనిఁ గొల్చుచుండుమని చెప్పిపంపెను.

పైఠనుపురముఁ జేరినంతనే దివ్యతేజోద్దీపితుఁడై యున్న ఏకనాథస్వామిని గుర్తించి, పౌరులాతని తలిదండ్రుల కవ్వార్త నెఱింగించిరి. సంతోషభరితాత్ములై, యాతని తలిదండ్రులేగి, కుమారు నింటికిఁగొనిపోయిరి. ఏకనాథస్వామి యటనే యచ్చటనేయుండి, హరి భజనతత్పరుఁడై కాలము గడపసాగెను. మహాభక్తుఁడైన ఏకనాథ స్వామిఖ్యాతి నలుగడల వ్యాప్తమయ్యెను. ఆతని ఖ్యాతినాలకించి, జనార్దనపండితుఁడు పైఠన్‌పురమున కరిగెను. గురువురాక నెఱింగి, ఏకనాథ స్వామి సగౌరవముగ లోనికిఁదోడ్కొని పోయి, పూజించెను. ఏకనాథ స్వామి నెట్లయిన గృహస్థుని జేయవలసినదని, యాతని తలిదండ్రులు జనార్దనపండితుని మిక్కిలి వేడుకొనిరి. జనార్దనపండితుఁడు నిజాశ్రమమునకు వెడలిపోవుచు "వత్సా! ఏకనాథా! నీవు సద్గుణసంశోభిత యగు కన్యనొకర్తుకను బెండ్లియాడి, గార్హస్థ్యము నెఱపవలయును." అనియెను. గురునానతి ననుసరించి, యాభక్తుఁడు పైఠనుపురమునకు

సమీపముననున్న యొకపల్లెలోనున్న భూసురుని తనూభవయగు గిరిజా బాయిని వివాహముఁ జేసికొనియెను.

ఇట్లుండఁగా, జనార్దనపండితుఁడు మృతినొందెనని ఏకనాధ స్వామికిఁ దెలిసెను. తద్గురుని సంస్మరణార్థ మేకనాధస్వామి యుత్సవ సమారాధనములఁ జేయఁదలంచెను. ఏకనాధస్వామి శిష్యుఁడగు నుద్ధవుఁడు గురునిచెంత పైకమేమియు లేనందున, నొకవర్తకునికడకుఁ బోయి నాల్గునూఱ్లరూప్యములఁ గొనివచ్చెను. సమారాధన మహోత్సవానంతర మావర్తకుఁడు తానిచ్చిన పైకముకొఱకు తొందరచేయ సాగెను.

ఒకనాఁడావర్తకుఁ డేకనాధస్వామి భోజనసమయమున వచ్చి, "నాధనమిచ్చెదవా లేదా" యని నిరోధించెను. ఏకనాధస్వామి యావర్తకుని పరుషభాషణములకోర్చి, భోజనముమాని, యుపవాసములఁ జేయసాగెను. ఒకనాఁటిరేయి పాండురంగప్రభువు ఉద్ధవరూపమున వర్తకుని యింటితలుపులఁదట్టి "నీవేకనాధస్వామి కొసంగిన ఋణధన మిదిగో తీసికొని, రసీదిమ్ము" అనెను. ఆ వర్తకుఁడు విసిఁగి కొనుచు, "నీయర్ధరాత్రమున నిదియేమి? ఎవరు లెక్కపెట్టుకొందురు? ఉదయమునర" మ్మనగాఁ బాండురంగఁడు "ఓయీ! నీవానాఁడు పరుషభాషణముల నేకనాధస్వామిని నొప్పించినది మొదలు నేఁటివఱకు శుష్కోపవాసములఁ జేయుచున్నాఁడు. రసీదిచ్చితీఱవలె" నసిపల్కి, రసీదునుగొని, ఏకనాధస్వామి నిత్యపారాయణము చేసికొను భగవద్గీతాగ్రంథముననుంచి, తిరోహితుఁ డాయెను.

ఉదయమున నేకనాధస్వామి భగవద్గీతలో నారసీదునుజూచి, పరమాత్ముని యవ్యాజకృపావిశేషమున కెంతయు నచ్చెరువందెను. పశ్చాత్తాపానలతప్తుఁడై యావర్తకుఁడు ఏకనాధస్వామి కడకరిగి, పాద

ములపైఁబడి క్షమింపుమని కోరెను. పాండురంగస్వామి ఏకనాధుని భక్త్యాతిశయమున కెంతయునలరి, యొక నిఱుపేద బ్రాహ్మణుని రూపమున వెడలి ఏకనాధస్వామి గృహమునసే వసింపసాగెను. ఏకనాధస్వామికి సకలోపచారములను జేయుచుండెను.

ఇటనిట్లుండగా ద్వారకలో నొకభూసురుఁడు మహాభక్తుఁడై నిరంతరము హరినామసంస్మరణాసక్తుఁడై యుండెను. ఆపుణ్యశీలుని భక్తివిశేషమున కబ్బురమంది, లక్ష్మీదేవి "ఓభక్తాగ్రణీ! ఆశ్రితవత్సలుఁడైన శ్రీహరి పైటనుపురంబున నేకనాధస్వామి యింటనున్నాఁడు. నీవట కేగి, యాయనను సందర్శించి, ధన్యుఁడవుక" మ్మని స్వప్నమున సాక్షాత్కరించి, చెప్పెను. ఆభూసురుఁడు తిన్నగా పైటనుపురమునకువచ్చి, యపుడే జలఘటమును చేఁబూనివచ్చిన రమాకాంతునిఁగాంచి, యాయన పాదములపైఁబడి "శ్రీకాంతా! భక్తుఁడగు ఏకనాధస్వామియెడ ననురక్తుఁడవై, నీభోగభాగ్యముల వర్జించి, మాఱువేషమున నూడిగము సేయుచున్నావా?" యనెను. వెంటనే బ్రాహ్మణరూపమున నున్న పండరినాధుఁ డదృశ్యుఁడాయెను. అయ్యదిగుర్తింపమికి, ఏకనాధస్వామి మిక్కిలివిచారించెను. చిరకాలము ఏకనాధస్వామి హరిభజనాతత్పరుఁడై, కాలముఁగడపి, వైకుంఠసాయుజ్యము నొందెను.



# 5 తులసీదాసు.



ఆత్మారాముఁడను సచ్ఛీలుఁడగు బ్రాహ్మణుఁడు హస్తినాపురమున వసించుచుండెను. ఆభూసురశ్రేష్ఠున కొకపుత్త్రుఁడు జన్మించెను. ఆపుత్త్రునకు తులసీదాసని నామకరణము చేయఁబడియెను. ఆతఁడు శుక్లపక్షశశింబోలె దినదినప్రవర్ధమానుఁ డాయెను. తులసీదాసు పంద్రెండుసంవత్సరముల ప్రాయముగలవాఁడు కాఁగానే మాతాదేవి యనుకన్య వివాహము సేయఁబడియెను. హస్తినాపురమపు డక్బరు పాదుషా పరిపాలనమునకు లోఁబడియుండెను.

తులసీదాసుభార్య మాతాదేవి కాపురమునకు వచ్చెను. ఆతఁడు సతీలోలుఁడై యహర్నిశములు గడపుచుండెను. ఒకనాఁడు తులసీదాసేదోపనిమీఁద పొరుగూరికిఁ బోయెను. మాతాదేవి యూరినుండి, యామెతల్లికి వ్యాధియెక్కువైనదని, రావలసినదని కబురువచ్చెను. భర్త యింటలేనందున మాతాదేవి సంశయించెను. చేయునది లేక, ఆమె యత్తగారికడ సెలవుఁగొని పుట్టింటికివెడలెను. సాయంసమయమునఁ దులసీదా సింటికివచ్చి, జరిగినదంతయుఁ దెలిసికొని ఖిన్నవదనుఁ డాయెను. ఆతనికారాత్రి నిద్ర జనింపదయ్యెను. అర్ధరాత్రమయ్యెను. సతీవియోగము భరింపఁజాలనివాఁడై తులసీదాసు, మాతాదేవి పుట్టింటికి బయలుదేఱెను. ఆకాళరాత్రమున కంటకాన్వితమైన పథము ననుసరించి, తులసీదాసెట్లో కష్టపడి ఆయూరువెడలెను. అందఱును గాఢనిద్రాపరవశులై యుండుటచేఁ దులసీదాసున కెవరును దలుపులఁ దెఱువలేదు.

తులసీదాసు యింటిప్రహరీగోడనెక్కి లోనికి పోఁదలంచెను. ఆతఁడు కుడ్యముపై ప్రాఁటివలెనున్న సర్పమును బట్టుకొని, లోనికుఱి

కెను. అతనియత్తగారును భార్యయు తులసీదాసునుచూచి విస్మయము నొందిరి. మాతాదేవి నాధునిలోనికిఁ దీసికొనివెళ్లి, కూర్చుండఁబెట్టి "నాథా! మీరు లోనికెట్లువచ్చితి ?" రని ప్రశ్నించెను. "ఏదో త్రాడు కుడ్యముపైనుండి, క్రిందికి వ్రేలాడుచున్నది. ఆ త్రాడును బట్టుకొని లోనికి వచ్చినాను" అని యాతఁడు బదులుపలుక, మాతాదేవి "ప్రాణేశ్వరా! కుడ్యముపై త్రాడెట్లున్నది. చూతముఁరం" డని, దీపముఁగొని, పరిశీలించగా నచ్చటనొక విషోరగము కాన్పించెను. ఆభుజంగమును గాంచి, మాతాదేవి భయభ్రాంతయై "జీవితేశ్వరా! ఇదియేటి సాహసము ? అర్ధరాత్రమున భయంకరము, ప్రాణాపాయకరమగు పామును బట్టికొని, భగవదనుగ్రహమున లోనికుఱికితిరిగాని, యన్యథాజరిగియున్న దో నింకేమైనయున్నదా ? తాము ప్రాజ్ఞులు, వివేకసంపన్నులు. ఇట్లురానగునా ?" యని ప్రశ్నించెను. తులసీదాసు "సతీమణీ! నీవియోగము భరించలేక యిట్లుసాహసించి వచ్చితిని. నీసౌందర్యపాశ బంధితుఁడనై పోయిన నేనన్యథా యెట్లుచరింపఁగలను ?" అని బదులు పలికెను.

"నాథా! ఎంతయన్యాయముగ మాట్లాడుచున్నారు ? తలిదండ్రుల శుశ్రూషమాని యర్థరాత్రి నీరీతిగా కామాతురులై, లజ్జాభయంబుల విడనాడి, రావచ్చునా ? కామమెంతగర్హ్యమైనది ? తొల్లి యహల్యకొఱ కింద్రుఁడును, కైకకై దశరథుఁడును కామాంధులై పరాభవమునొంది, పశ్చాత్తాపానలతప్తులు కాలేదే ? సంసారము నిస్సారము. బుద్బుదప్రాయము. క్షణభంగురము. రక్తమాంసపూరితమైన యీకాయము మిక్కిలిహేయమైనది. మాయామయమైన యీసంసారజాలమునుండి విడివడి, ముక్తిసాధనమగు శ్రీహరిభజన మొనరించుట కర్తవ్యము. నేను తమకు బోధచేయునంతటిదానను గాను. తపోనిధులై

10

యెందఱు మహానుభావులు శ్రీరామచంద్రునిఁ దమచక్షుస్సముఖమునఁ గాంచి, తరించలేదు ?" అని పలుక, తులసీదాసు నిశ్చేష్టుఁడై తన తప్పిదమును గుర్తించి, మిక్కిలిపశ్చాత్తాపము నొందెను. ఆమె దివ్యబోధ విద్యుల్లతవలె నజ్ఞానాంధకారమయమైయున్న తులసీదాసు చిత్తమున మెఱసెను. ఆతఁడు "సతీమణీ! నీకృపవలన జ్ఞానామృతముఁ గ్రోలితిని. కామాంధుఁడనై, యమూల్యమగు కాలమును దుర్వినియోగపఱచుకొంటిని. ఇపుడు నాహృదయము పశ్చాత్తాపానల తప్తమైనది. నేనిదే వెడలిపోవుచున్నాను. శ్రీరామచంద్ర చరణసరోజముల సేవించి, నాపాపపంకిలమును బాపుకొందు" నని, యాక్షణముననే యిలువీడి, యరణ్యమార్గమునఁ బోయిపోయి, వారణాసికిఁబోయి, గంగానదీతీరమున గూర్చుండి, తపోనియమబద్ధుఁడై, నిరంతరము రామనామసంకీర్తన మొనరింపసాగెను. జపముఁ బూర్తియొనర్చినపిదపఁ బూజకు వినియుక్తమైన జలము నాతఁ డొకవృక్షమూలమునఁ బోయసాగెను. ద్వాదశవర్షము లిట్లుగడచెను.

ఒకనాఁడు తులసీదాసు యథావిధిగ జపమొనరించి, జలమును వృక్షమూలమునఁ బోయఁగనే బ్రహ్మాండమగు శబ్దమయ్యెను. అంత నొకరాక్షసుఁడు ప్రత్యక్షమై "ఓపుణ్యపురుషా! పరమపవిత్రములైన నదీజలంబుల స్నానపానముల కవకాశములేక, మిక్కిలిచింతనొంది యుంటిని. నీవనుదినము నిచటపోయు జలమువలన నాక్షుత్పిపాసలు తీఱినవి. నేను సంతుష్టాంతరంగుఁడనైతిని. నీకువలయునది కోరుకొను" మనెను.

తులసీదాసాశ్చర్యముగ నాతనిఁజూచి "ఓయీ! ఇంతకాలమునుండి, శ్రీరామనామసంకీర్తన మొనరించుచున్నాను. ఆ భక్తజనపరిపాలున దివ్యసందర్శన మొనరింప, నాచిత్తము కుతూహలయుక్తమైయున్నది. నీకు శక్తికలదేని, నాయీకోరిక సఫలమొనరించు" మనెను.

ఆ రక్కసుఁడంత "నో భక్తశిఖామణీ! అదినాకు సాధ్యపడనికార్యము. ఐనను నీకుఁదగిన యుపాయము నెఱిఁగింతును. నీ వనుదినము శ్రీరామ నామసంకీర్తన మొనరించుచుండుతఱి నొకభూసురుఁడు శ్రద్ధాళువై, కూర్చుండి, వినుచుండుట గమనించియుండవచ్చును. ఆ భూసురుఁడు శ్రీరామచంద్ర భక్తాగ్రణియైన హనుమంతుఁడుగాని ఆద్విజుఁడు మఱొక్కరుఁడుగాఁడు. ఆ బ్రాహ్మణశ్రేష్ఠు నడిగినచో నీకోరిక తీర్చ గలఁడు." అనిచెప్పఁగా తులసీదాసు ప్రముదితాత్ముఁడై మఱుచటి దినమున బ్రాహ్మణుఁడు నామసంకీర్తనము వినుటకురాగా "ఓమహా త్మా! మారుతీ! నీవు ప్రచ్ఛన్నవేషుఁడవై యిటకు చనుదెంచుచున్న నిషయము నెఱుంగక మహాఘమొనర్చినాను. నాకు శ్రీరామచంద్రుని దివ్యరూపము దర్శించుభాగ్యము కలిగింపుము". అని ప్రార్థించెను.

వాయునందనుఁడు తులసీదాసు భక్తికెంతయుసలరి, "భక్తా గ్రణీ! అట్లే రేపు శ్రీరామమూర్తి నీకు కాన్పించు" ననెను. మఱు నాఁడు తులసీదాసు శ్రీరామనామసంకీర్తన మొనరించుచున్నతఱి నొక మహమ్మదీయుఁడు నచ్చి, యాసంకీర్తనమును గొంతసేపు విని, వెడలి పోయెను. సంకీర్తనానంతరము తులసీదాసు "హనుమంతా! రామచం ద్రుఁడు నాపై నలుకవహించెనా యేమి? నాకు దర్శనమను గ్రహించ డేదే" యనెను. "అయ్యో! రఘురాముఁడు నీయెడ కృపాళుఁడై తురుష్కవేషమున నిచ్చటికి వచ్చియుండుట గమనించలేదా?" అని, యంజనాతనయుఁడు బదులుపలికెను.

"అయ్యో? నేనెంతపాపిని. ఆతురుష్కుఁ డెవరోయనుకొంటిని గాని, పరమపావనుఁడైన శ్రీరామచంద్రుఁడని తలంపలేదు. శ్రీసీతా రామలక్ష్మణుల నిజరూపముల నాకుఁజూపి, నాజన్మ చరితార్థమొన రింపు" మని, తులసీదా సంజనాత్మజుని పలువిధముల ప్రార్థించెను.

శ్రీరామచంద్రుఁడు జానకీలక్ష్మణసమేతముగ భక్తాగ్రగణ్యుఁడగు తులసీదాసునకు సాక్షాత్కరించెను. తులసీదాసు కృతార్థుడాయెను. అతఁడు నిరంతరము శ్రీరామనామ సంకీర్తన మొనరించుచుండెను. అనేకులు నిత్యమువచ్చి, రామకథాసుధాపానముఁ జేయుచుండిరి. ఇట్లుండఁగా నొకనాఁడు తులసీదాసు నాశ్రమములో చోరులు ప్రవేశించిరి. ఆచోరులు శ్రీరామచంద్రుల విగ్రహముపైనున్న యాభరణముల నపహరించి, కొనిపోవుచుండ, తులసీదాసుమొఁద దయఁగలిగియున్న శ్రీరామచంద్రమూర్తి వారలకు మార్గము నిరోధించెను. ఆ చోరులు తెల్లవాఱినంతనే రాజభటులచే బంధింపఁబడిరి. మహామహిమోపేతుఁడగు తులసీదాసు ఖ్యాతి నలుగడల వ్యాపించెను. ఈ మహామహుఁడు శ్రీమద్రామాయణము విరచించి, యాచంద్రతారకయశఃకాముఁ డాయెను. ఈతఁ డనేకాద్భుతకార్యములఁ జేసెను. మృతులయినవారిని సజీవులుగ నొనర్చెను.

తులసీదాసు మహాత్మ్యమునుగూర్చి వినియున్న యక్బరు పాదుషా యొకప్పుడు తులసీదాసులఁ బిలిపించి, "స్వామీ! మీరీ మహాద్భుతకార్యములను శ్రీరామచంద్రుని యనుగ్రహముననే గదా చేయుచున్నారు. ఆ రామచంద్రుఁ డెట్టివాఁడో, నాకుఁ జూపుఁడు. లేనిచో మీభక్తియంతయుఁ బూటకమని, లోకమునకుఁ జాటెద" ననెను. తులసీదాసు మారుతినిఁ దలఁచుకొని, పాదుషా భాషణముల తెలఁగెఱిఁగించి, "మహాత్మా! నీమహిమఁజూపు" మనెను.

ఆ యుత్తరక్షణమున లెక్కలేనందఱు వానరులుద్భవించి, ఢిల్లీ పట్టణములోఁ బ్రవేశించి, హాహాకారము లొనరించుచు, ధనికుల యిండ్లలోఁ బ్రవేశించి, విలువైనవస్తువులను, ధనమును యీవలఁ బాఱవైచుచు, ఫలవృక్షములఁ బెకలించి, పారవైచుచు చెప్పరాట

కలవిగానంత నష్టముకలిగించిరి. ప్రజలందఱును బరుగుపరుగునవచ్చి, యక్బరుసార్వభౌమునితో జరిగినదంతయుఁ జెప్పిరి.

అదియంతయుఁ దులసీదాసు మాహాత్మ్యమేయని గ్రహించి, యక్బరు సార్వభౌముఁడు తులసీదాసును మన్నింపుమని వేఁడెను. మారుతి తన యనుచరుల నంతర్థాన మొందఁజేసెను. అక్బరుకోరికపై తులసీదాసు కొలఁదిమాసము లటనుండి, మధురాపురము, బృందా వనము మున్నగు పుణ్యక్షేత్రముల సందర్శించి, వచ్చి చిరకాలము శ్రీరామనామ సంకీర్తనము బ్రజాహృదయములనాఁటి యత్యంతా నంద నిలయమగు వైకుంఠమును జేరెను.



# 6 జయదేవుఁడు.

——:o:——

పుణ్యస్థలంబులకెల్ల మిన్నయని చెప్పఁదగిన శ్రీజగన్నాధ క్షేత్రమునకు సమీపమున తిందుబిల్వమను గ్రామముకలదు. ఆ గ్రామంబున జయదేవులొక నిఱుపేద బ్రాహ్మణకుటుంబమున జన్మించిరి. తలిదండ్రులు జయదేవుని విద్యావిషయమై యశ్రద్ధవహించి, యూరకుండినను, ఆతఁ డూరకొనక మిక్కిలికష్టపడి, సకలశాస్త్ర పారంగతుఁడై, గీతగోవింద నామాంకితమైన దివ్యప్రబంధము నొండురచించి, శ్రీజగన్నాధస్వామి కంకితమొసంగెను. ఆ దేశపురాజైన సాత్త్వికరాజు జయదేవవిరచిత గీతగోవింద ప్రబంధమును బోలిన మఱొక గ్రంథమునుల్లేఖించి, ప్రజలందఱును దానిని చదువవలెనని శాసించెను. నవరసభరితమైయున్న జయదేవుల గ్రంథమును శిరంబుననుంచికొని పఠించుచున్న జనానీకము సాత్త్వికరాజు గ్రంథము నిరాదరించిరి. రెండు గ్రంథములలో నేదియుత్తమమైనదో నిర్ణయింపనెంచి, సాత్త్వికరాజు జయదేవుల గ్రంథమును తన గ్రంథమును స్వామి సమీపముననుంచి, మఱుచటి దినముదయమున పండితసమేతముగ నాలయమునకుఁ బోయి చూచెను.

జయదేవుల గీతగోవిందము స్వామిసమీపమున నుండెను. సాత్త్వికరాజు గ్రంథము దూరముగఁ ద్రోసివేయఁబడి యుండెను. సాత్త్వికరాజు దుఃఖితాత్ముఁడై "ప్రభూ! నేఁజేసిన పాపమేమి? అందఱును నీదృష్టిలో సమానులేగదా. ఐనపుడు జయదేవుల గ్రంథము నాదరించిఁ నా గ్రంథమునేల నిరాదరింపవలయు" నని, పలురీతుల వేఁడుకొనెను. జగన్నాథస్వామి సాత్త్వికరాజు గ్రంథములో నిరువదినాల్గు శ్లోకముల జయదేవుల గ్రంథమునఁ జేర్చెను.

ఇట్లుండఁగా జగన్నాధమున నొక బ్రాహ్మణునకుఁ బద్మావతి యనుకుమార్తె కలదు. ఆ సద్గుణసంశోభిత_సుందరాంగి విద్యావతియై విలసిల్లుచుండెను. ఆపె వివాహోచితమగు ప్రాయమునొందెను. అపుడు శ్రీజగన్నాధస్వామి యాభూసురునకు స్వప్నమున సాక్షాత్కరించి "ఓభక్తుఁడా ! నీకుమార్తెను మత్ప్రియభక్తుఁడగు జయదేవునికిచ్చి, వివాహముఁ జేయు" మనెను. ఆభూసురోత్తముఁడు శుభదినంబునఁ దన తనూభవయగు పద్మావతిని జయదేవునికొసంగి, వివాహముఁ గావించెను.

ఒకప్పు డొకవణిజుఁడు జయదేవులకు శిష్యుఁడై, యాయన నింటికిఁ గొంపోయి పూజింపసాగెను. కొన్నాళ్లయిన పిదప నానరత్న శ్రేష్ఠుఁ డమూల్యరత్నాభరణాదులను, ధనమును యిచ్చి, యిరువురు సేవకులను సాహాయ్యముగ నియమించి, జగన్నాధమున కంపెను. మార్గమధ్యమున నా సేవకులకు జయదేవునిఁజంపి, యా ధనమును దామనుభవింప దుర్బుద్ధిపొడమెను. వెంటనేవారు జయదేవుల కరచరణముల నఱికి యొకనూతిలోఁ బాఱవైచి, వెడలిపోయిరి. మహాత్ముఁడగు జయదేవుఁడా బావిలోనుండియుఁ దపము సల్పుచునేయుండెను. ఆతఁ డందుండుటవలన దివ్యతేజమీనవలికి రాసాగెను.

ఆ మార్గమున నపుడువేఁటకు మద్రదేశాధీశుఁడు వెడలి, యాదివ్యతేజమునుగని, భటులచే జయదేవుల నీవలికిఁదీయించి, తన రాజ్యమునకుఁ గొంపోయి సకలోపచారములఁ జేయుచుండెను. జయదేవుని ధనము నపహరించి, కాళ్లేతులు నఱికినసేవకులు సన్యాసివేషముల ధరించి, యా మద్రదేశాధీశు నాస్థానమునకు వచ్చిరి. ఆ కపట సన్యాసులు జయదేవులఁ గాంచిరి. జయదేవుఁడు వారిని గుర్తించి, వివిధముల సత్కరించి, వీడ్కొలిపెను. ఆ కపటసన్యాసులు వెడలి పోవుచుండ రాజసేవకులు కొందఱు వెంబడించిరి. కొంతదూర మేఁగుసరికి,

భూమి చీల్చుకొని, ఆ సేవకులఁ తనగర్భమునకుఁ గొంపోయెను. అది చూచి, దిగ్భ్రమజెంది మిగిలినవారు రాజుతోఁజెప్పఁగా జయదేవులు "హే జగన్నాధా! దీనదయాళో! వారికి మోక్షమిమ్ము" అని వేఁడెను. వెంటనే భూమిచీల్చుకొని వారీవలికివచ్చి, స్వర్గమునకుఁ బోయిరి. జగన్నాధు ననుగ్రహమున జయదేవుఁడు తిరిగి కరచరణములు కలవాఁడాయెను. ఈ మహాద్భుతము జయదేవుల ప్రఖ్యాతి నినుమడింపఁజేసెను. ఆయన భార్యనుగూడ రప్పించుకొనెను. రాజు భార్యతో "పద్మావతీదేవిని నీవు పూజించుచుండుము. నేను శ్రీజయదేవులఁ గొల్చుచుందును. ఆమె కేలోపమును గలుగకుండ చూచుచుండుము". అనిచెప్పెను. పద్మావతీదేవి సహచర్యమున నారాణియుఁ దదితరులగు నంతఃపుర నారీమణులును భగవద్భక్తి యుక్తులై యుండిరి.

ఒకనాఁడు రాణియుఁ బద్మావతీదేవియు భగవద్గోష్ఠినుండఁగా పద్మావతి "భర్త మృత్యువుపాలైనదో భార్య సహగమనముచేయుట బలవన్మరణ మగును. అట్టివార్త వినినంతనే యప్రయత్నముగఁ జనిపోవుటయే గొప్పతనము" మనెను. ఆమె యట్లుపలుకుటచే రాణి "ఎప్పుడైన నీమెను పరీక్షింపవలయు" నని, తగిన యదనుకై వేచి యుండెను. ఒకనాఁడు యధావిధిగ గోష్ఠిలోనుండఁగా రాణిచే నిమంత్రింపఁబడిన భటుఁడువచ్చి "అమ్మా! రాజుగారితో వేఁటకేగిన జయదేవకవీంద్రులు పులివాతఁ బడినా" రనెను. పతివ్రతామణి యగు పద్మావతీదేవి వెనువెంటనే మూర్ఛనొంది, యసువులఁబాసెను.

రాణి చేయునదిలేక, రాజునకుఁగబురంపి, తనయవివేక కృత్యము నెఱింగింపఁ రాజు భార్యనేమియు ననఁజాలక, తాను మృతినొందుటకు సంసిద్ధుడై జయదేవకవిని రావించి, యదార్థమునెఱింగింప, నా కవీంద్రులు కొన్ని యష్టపదులఁజదివి, శ్రీజగన్నాధస్వామిని సంస్తుతించిరి. పద్మావతీదేవి సజీవయై కూర్చుండెను. ఎల్లరును పద్మావతీ జయదేవుల మెచ్చుకొనిరి.

---

# 7 నామదేవు.



పండరిపురంబున దామాజీయను పరమభాగవతోత్తముఁడు నివసించుచుండెను. అతనిభార్య గుణాబాయి భక్తియుక్తురాలును, సద్గుణసుశీలయునై యుండెను. ఆ యిరువురును పవిత్రజీవనము గడపుచుండిరి. ఆ దంపతులు సంతానహీనులై యుండిరి. పాండురంగని నమ్మినవారి సకలాభీష్టములును సిద్ధించునని, గుణాబాయి విశ్వసించి, సంతానముకొఱకు వివిధములఁ బూజలసేయుచుండెను. దామాజీయు సంతానముకొఱకు పాండురంగని మనసారస్మరించుకొని, పండరినాధుని యాలయమంటపమున నిద్రింపఁగా, పాండురంగ విఠలుఁడు స్వప్నసాక్షాత్కార మొసంగి, "ఓభక్తశిఖామణీ! నీయభీష్టము సిద్ధించును. వేకువనే భీమానదికిఁ బొమ్ము. ముత్యపుఁజిప్పలో నొకచిన్ని శిశువుతేలుచు వచ్చును. ఆ శిశువును జాగ్రతగా, బెంచుకొను" మని పలికి, యంతర్ధానము నొందెను.

దామాజీ మహదానంద భరితాత్ముఁడై, స్వప్నోదంతమును భార్యకెఱిఁగించి, వేకువఝామున భీమానదికేగి, స్నానముచేసి, పాండురంగపవిత్రనామ సంస్మరణంబొనరించుచు భగవదాజ్ఞకై వేచియుండెను ఇంతలో ముత్యపుఁజిప్పలో నొకశిశువు తేలుచువచ్చెను. ఆశిశువును కనులకద్దుకొని దామాజీ యింటికిఁ గొంపోయి, యల్లారుముద్దుగఁ బెంచుకొనసాగిరి. ఆశిశువున కాదంపతులు నామదేవు అని నామకరణముఁ జేసిరి.

నామదేవు దినదిన ప్రవర్ధమానుఁడై, విద్యాభ్యాసమొనరించెను. తండ్రి యొకనాఁడేదో గ్రామాంతరమున కేగుచు, పాండురంగవిఠలునకు నామదేవుచే నివేదనమంపుమని చెప్పెను. నామదేవు నివేదనమును

గొని, దేవాలయమునకుఁబోయి "పండరీనాథా !. నేనేమిపాపము చేసి తిని. ఈనైవేద్యమీవు భుజింపనియెడల నేను నిందాపాత్రుఁడనగుదును గదా !" యని పలువిధములఁ బ్రార్థించి, యెంతో ప్రొద్దుపోయినను యచ్చటనే కూర్చుండుటచే పాండురంగఁడా నివేదనము భుజించెను. నామదేవు జరిగినదంతయుఁ దలిదండ్రులకెఱిఁగించి, సంతుష్టాంతరంగులఁ జేసెను.

నామదేవునకు రాధాభాయియనుకన్య వివాహము చేయఁబడి యెను. రాధాభాయి గర్భవతియై, యొకచక్కని శిశువును గనెను. ఆ శిశువునకు నారాయణుఁడని నామకరణముఁ జేయఁబడెను. భక్తిపర వశుఁడై నామదేవు నిరంతరము పాండురంగభజనము చేయుచుండెను. కుటుంబము దారిద్ర్యావస్థలో మునిగియుండెను. తలిదండ్రులు రెండు మూడుసార్లు నామదేవు నుద్దేశించి, "నాయనా ! మనము దారిద్ర్యా నలముననిట్లు దగ్ధులమైపోవుచుండ నీవిట్లు పాండురంగభజననిమగ్ను డవై యున్నచోనెట్లు ?" అనిరి. నామదేవు వ్యథితహృదయుఁడై, పండరినాథునకుఁ దన యావేదనము నెఱిఁగించెను. అపుడు పరమా త్ముఁడగు పాండురంగఁడు వర్తకవేషధారియై, నామదేవులయింటికివెళ్లి పిలిచెను. రాధాభాయి యీవలికివచ్చి "తామెవరు ? వారింటిలోలే" రని చెప్పఁగా, నావణిగ్వేషధారి "అమ్మా ! నామదేవులు నామిత్రు లగుటచే వచ్చితిని. నాకుఁ బనియున్నది. ఈధనమును వారికిండు". అనిచెప్పి వెడలిపోయెను.

పరమప్రమోదభరితాత్మయై గుణాబాయి యదియంతయు పాండురంగని కృపావిశేషముననే తటస్థించెనని గ్రహించి, యంగడి నుండి యెట్టికొదువయు లేకుండ సకలపదార్థములను గొనివచ్చెను. నామ దేవింటికేతెంచి, జరిగినదంతయుఁ దెలిసికొన, "హే పరమాత్మా ! నన్ను మఱల సంసారవ్యామోహమునఁ ద్రోయుటకా యిట్టి మాయా వ్యూహముఁబన్నితి ?" వని, మిగిలిన ధనమును బేదలకుఁ బంచిపెట్టి, పాండురంగభజనాసక్తుఁడై కాలముగడపసాగెను.

---

# 8 విప్రనారాయణుఁడు.

——: 0 ——

చోళరాజ్యమున మండంగుడియను గ్రామముకలదు. ఆయూర సచ్చరిత్రులగు బ్రాహ్మణదంపతులు నివసించుచుండిరి. ఆదంపతులు చాలకాలము సంతానహీనులై, యనేకదానధర్మములఁ గావించిరి. ఇట్లుండగా దైవానుగ్రహంబున నాదంపతులకొక కుమారుఁడు జన్మించెను. ఆబాలునకు వారు విప్రనారాయణుఁడని నామకరణమొనరించిరి. విప్రనారాయణుఁడు బాల్యమునుండియు భక్తియుక్తుఁడై, యెల్లరిచే సంస్తుతినొందుచుండెను.

విప్రనారాయణుఁడు దినదినప్రవర్ధమానుఁడై, దారపుత్రాదులు కేవలము దుఃఖమునకు హేతుభూతులనియు, నిస్సారమగు సంసారమున సుఖంబణుమాత్రంబైన లేదనియు, నశాశ్వతమగు నీసంసారము నెఱపుటకంటె విరాగమునొంది, మోక్షమార్గము నన్వేషించుట సర్వోత్తమమని, నిరంతరము శ్రీరంగచరణధ్యానమే యొనరించుచుండెను.

ఆ మహామహునకు రంగపాదధ్యానమే శరణ్యమయ్యెను. రంగని పూజించుటకు వలయుసుమములకొఱకై, యాతఁడొక తోటనిర్మించెను. అందు పెక్కు తులసిమొక్కలనాటెను. ఆ తులసీవనమున నొకపర్ణకుటీరము నిర్మించుకొని, విప్రనారాయణుఁడందే నివసింప సాగెను. ఆతులసీవనమునంటియే పెక్కుయుద్యానవనము లుండెను. అచ్చటికి పెక్కురు వాహ్యాళిగ ననుదినము వెడలుచుందురు.

ఆయూర దేవదేవి, మంజరియనువేశ్యలు యిరువురు కలరు. ఆ వెలయాండ్రు మహాసౌందర్యవతులు. ఇతరపణ్యాంగనలవలెనే, ఆ యిర్వురువేశ్యలునుగూడ శ్రీరంగేశ్వరుసేవకు నియోజితలై యుండిరి.

ఆసుందరీమణులు విప్రనారాయణుని తులసీవనము ప్రక్కనున్న యుద్యానవనమున కొకనాఁడువచ్చిరి. ఆయుద్యానముననుండఁగా, తులసిమాలలు కంఠమునలంకరింప, సాక్షాత్ శ్రీరంగని యపరావతారమో యనఁదగిన విప్రనారాయణుఁ డీవలికివచ్చెను. మంజరి, చెల్లెలగు దేవదేవినుద్దేశించి, "సోదరీ! చూచితివా? ఆమహానుభావుఁడగు విప్రనారాయణుని, ఆపుణ్యశీలునిభక్తి యపారముగదా! అట్టిభక్తు నాశ్రయించి, తత్త్వోపదేశమునొందుట నాయభిలాషము" అనెను.

దేవదేవి "అక్కా! మంజరీ! నీవు నిక్కముగాఁ బ్రపంచస్వభావము తెలియని యమాయికురాలవు. ఆసుగంధపుష్పమాలాధారణము, ఆకాషివసనములు భక్తిసూచకములు కావు. రక్తిసూచకములు. ఆ కపటభక్తుని శృంగారరసపట్టభద్రు నొనర్చుటతిసులభము. వలయునేని పంతమూని, విప్రనారాయణుని మూఁడుమాసములలో వేశ్యాదాసునిగఁజేసి, తులసీవనమునుండి, వేశ్యవాటికకుఁ గొనివత్తును. చూడుము నామహిమ" యనిపలికి, యక్కయగుమంజరియనుమతిఁ గొని యింటికిఁబోయెను.

మఱుచటిదినమున దేవదేవి యాభరణవిహీనయై, యెనలేనిభక్తి నటించుచు, విషాదము మోమునఁ బ్రస్ఫుటముకాఁగా, విప్రనారాయణుని తులసీవనమునఁ బ్రవేశించి, నమస్కరించి, "మహాత్మా! భక్తాగ్రణీ! దీనాతిదీనను. అగతికను. ననురక్షించుభారము నీయది. నీశరణువేఁడు నాకాశాభంగముఁగల్గించి, నాచిత్తమును వ్యథితమొనరింపకుము" అని ప్రార్థించెను.

దేవదేవినిఁ జూచి, విప్రనారాయణుఁడు "ఓ రమణీమణీ! నీ వెనరు? నీచిత్తమును వ్యస్తమొనరింపఁజాలిన విషయమేది?" యని ప్రశ్నింప, నామె విచారముట్టిపడ, గద్గదకంఠియై "మహాత్మా! నేను

జాతిచే వేశ్యను. నాతల్లియు, సోదరియు నన్ను పలుతెఱంగుల బాధించుచున్నారు. బాల్యమునుండియు భక్తియు క్తనై యుండు నాయభిలాషము నట్టేటఁ గలియుచున్నది. వారిబాధ భరింపఁజాలనిదాననై, నేఁడిట్లు వెడలివచ్చితిని. నాయందనుగ్రహముంచి, నిగూఢవేదాంత రహస్యములను బోధించి, నాచిత్తము నావరించియున్న యజ్ఞానాంధ కారముఁ బాపుఁడు" యని ప్రార్థించెను. ఆమె విప్రనారాయణుని శిష్యురాలై, యనుదినము సేవఁ జేయుచుండెను. ఆమె యెంత త్వరితముగ నాతనిచిత్తమున మార్పుఁ గలిగింపనగునా యనియోచన సల్పుచుండెను. ఒకనాఁటిరాత్రి గగనమండలము వినీలమేఘావృతమయ్యెను. వర్ష మురుములతో మెఱపులతోఁగలిసి, మిక్కిలి భీతావహముగ నుండెను. ఆభయంకర సమయమున దేవదేవి, యింటినుండి బయలుదేఱి, తడిసిముద్దయై యాశ్రమమును జేరెను. విప్రనారాయణుఁ డదియంతయు భక్తియేయని విశ్వసించి, యామెను లోనికాహ్వానించి, తన వస్త్రము నొండొసంగెను.

పాపము, దేవదేవి తడిసివచ్చుటఁ గాంచిన విప్రనారాయణుని చిత్తము కరఁగిపోయెను. ఆమె యంతట శృంగారరసభరితములైన ఘట్టములఁ జదివి, "స్వామీ! తమ రాయాసఖిన్నులై యుండినట్లు తోఁచుచున్నది. నేను తమపాదముల నొత్తుదునా?" యని, ప్రణయ రసభరితములగు భాషణముల నాతనిసలరించి, సంపూర్ణముగా వశము చేసికొని "మహాభాగా! తమసౌందర్యము నన్నాకర్షించినది. మన్మథునిబాణముల బాధకేను తాళఁజాలకున్నాను" అని, యాలింగన మొనరించుకొనెను. ఆమె సౌందర్యపాశముచే బంధింపఁబడి, విప్రనారాయణుఁడు పతితుఁడై పోయెను.

శ్రీరంగచరణధ్యానమున కాతఁడు స్వస్తిచెప్పి, దేవదేవితో శృంగారసామ్రాజ్య పరిపాలన మొనరింపసాగెను. దేవదేవి సహోదరి

మంజరిహృదయము దుఃఖాకులమయ్యెను. మహాభక్తుని వేశ్యాలంపటునిఁ గావించినదిగదా యని, యామెమిక్కిలి జాలినొందినది. దేవదేవి "నేనిఁక పుట్టినింటికిఁ బోయెద" నని బయలుదేఱఁగా, విప్రనారాయణుఁడు "హా దేవదేవీ! నీవియోగమున కేనెటులోర్తును? నేనెట్లు నిన్నువిడనాడి యుందును?" అనిపలుకగా, దేవదేవి "ప్రియా! నాపై నీకునిజముగఁ బ్రేమకలదేని, నావెంట మాయూరురమ్ము." అనెను.

విప్రనారాయణుఁడు దేవదేవిమొఱల, బద్ధానురాగుఁడై యుండుట, నామెవెంట మండంగుడికిఁ బోయెను. దేవదేవితల్లి, విప్రనారాయణుఁడు శ్రీమంతుఁడని భ్రమించి మొదటఁ గొన్నినాళ్లాదరించెను. తరువాత నొకనాఁడతఁడు తనకుఁ దులసివనముతక్క, మఱేద్దియులేదని తెలుపఁగా, నామె మహాకోపమునొంది, యాతని నిష్ఠురవాక్యంబుల చింతాక్రాంతస్వాంతుఁ గావించి, యింటినుండి వెడలనడిచెను. విప్రనారాయణుఁడు ప్రణయవంచితుఁడై, యీవలకువచ్చి, పూర్వస్మృతి నొంది, పశ్చాత్తాపానలతప్తుఁడై రంగా, రంగాయని గొంతెత్తికేకలిడి, చైతన్యముఁ గోల్పోయెను. శ్రీరంగేశ్వరుఁడు చోళరాజ్యాధిపతికి కలలోఁగనుపించి, విప్రనారాయణు నాలయమునకు రప్పింపుమని చెప్పెను. ఆ రాజన్యుఁడు మహావైభవముగ విప్రనారాయణుని శ్రీరంగదేవాలయమునకుఁ గొంపోయెను. విప్రనారాయణుఁ డెప్పటి యట్ల పరమభక్తియుక్తుఁడై మెలఁగసాగెను. దేవదేవియుఁ బశ్చాత్తాపానలతప్తయై, విరాగిణియై, సన్యాసాశ్రమ స్వీకారమొనరించెను.

---

# 9 చోకామేళుఁడు.

———:0:———

పండరీపురక్షేత్రము సమీపమున ననగడయను గ్రామముం డెను. ఆ గ్రామమున సుదాముఁడను పంచమకులోద్భవుడు ముక్తాబాయి యను సుగుణరాశియగు సతీమణితోఁ గాలక్షేపము చేయుచుండెను. ఆదంపతులు సంతానముకొఱకు మిగులఁ బరితపించుచుండిరి. అందు లకై వారు పలువిధములఁ బండరినాథుఁడగు పాండురంగని వేఁడు కొనిరి. చాలసార్లు పండరీపురమునకరిగిరి. ఆమె యొకప్పుడొకనవాబు నకు గంపతో మామిడిపండ్లు కొనిపోవుచుండఁగా క్షుత్పీడితుఁడగు నొక బ్రాహ్మణుఁడెదురై రెండుపండ్లిమ్మని యడిగెను. ఆమె యట్లే యీ యఁగా, నాభూసురుఁడు సంతృప్తుఁడై “నీకుఁ గొంతకాలమునకొక మగశిశువు జన్మించును. అతఁడు మహాభక్తుఁడై దేశమున నగణ్య మగుఖ్యాతినొందును. అతని తరువాత నీకింకను నల్వురు పుత్రులు జన్మింతురు. మొదటజన్మించినవానికి చోకామేళుఁడని పేరుపెట్టు” మని చెప్పి, వెడలిపోయెను. ఆద్విజుని యాశీర్వచనానుసారముగ ముక్తా బాయి గర్భముఁదాల్చి, నవమాసములు నిండినపిదప తేజోరాశియగు మగశిశువునుగాంచెను. ఆశిశువునకు చోకామేళుఁడని నామకరణ మొన రించి, తలిదండ్రు లత్యధికగారాబముతోఁ బెంచుకొనసాగిరి. బాల్యము నుండియు నాబాలుఁడు పాండురంగనామసంస్మరణమునకే తత్పరుఁడై యుండెను.

గొడ్లమృతకళేబరముల మోయుటతోనే చోకామేళుని బాల్యా వస్థ గడచిపోయెను. తలిదండ్రులాతనికి వివాహము చేయఁబోయిరి. ఆతలఁపు విడనాడుఁడని వారలకు నచ్చఁజెప్పి, తనజీవితపరమావధి పాండురంగవిఠలుని సేవయేయనితలంచి, పండరీరపుమునకుఁబోయెను.

పాండురంగనియాలయముచుట్టును బరిభ్రమొనరించుచు, స్వామిసందర్శనమొనరించుటకుఁ దనకవకాశము లేకపోయెనుగదాయని యహర్నిశములు విలపించుచుండెను. అతఁడు "హేకృపానిధే! పండరినాథా! నేనస్పృశ్యుఁడనై జన్మించుటచేతనేగదా, నీదివ్యమంగళవిగ్రహము దర్శించుటకు వీలైనదికాదు. నన్ను కరుణింపు" మని, నిరంతరము పండరీపురేశ్వరునిఁ బ్రార్థింపసాగెను. ఆలయమునకేగు బ్రాహ్మణులు చోకామేళునిఁజూచి, "ఓరీ! చోకామేళుఁడా! అస్పృశ్యుఁడవై జన్మించి, స్వామిసందర్శనము నభిలషింపఁదగునా? వేయిజన్మములెత్తినను నీకాయదృష్టము లభింపఁజాలదు" అనిరి. అంతనాతఁడు "ద్విజన్ములారా! అస్పృశ్యుఁడనైనంతమాత్రమున పాండురంగని భజించుటకూడ తప్పేయగునా? పరమాత్ముఁడెందు లేఁడు? మీలోనతఁడు లేఁడా? నాహృదయమునలేఁడా? మకరి ప్రార్థించినంత, నేవేగఁబోయి రక్షింపలేదా? ప్రహ్లాదుని బ్రోవలేదా? అతఁడు సర్వాంతర్యామి. సర్వవ్యాపకుఁడు. నావిలాపమా కరుణామయున కెట్లుటికేని వినఁబడదా?" యని బదులుపలికి, తనకుటీరమునకుఁబోయి "పాండురంగప్రభూ! పండరినాథా! దీనుఁడను. నన్ను రక్షింపవా? నాకు దర్శన మనుగ్రహింపనిచో, నేను చనిపోవుదునుసుమా!" యని, చిన్నపిల్లవానివలె నేడ్చియేడ్చి నిద్రాముద్రితుఁడాయెను.

చోకామేళుఁడట్లు నిద్రాపరవశుఁడై యుండి, యొకస్వప్నముఁ గాంచెను. పాండురంగవిఠలుఁడు తనకుటీరము వెలుపలనుండి, తలుపు తట్టుచున్నట్లాతఁడు కలఁగని, యులిక్కపడి లేచి, తలుపు తెఱచిచూచునరికిఁ బీతాంబరధారియు, శంఖచక్రగదాధరుండునునగు పండరినాథుడు కాన్పించెను. చోకామేళుఁడు నిర్భరానందవివశుఁడాయెను. అతఁడు పాండురంగనికి సాష్టాంగదండప్రణామమొనరించి, "ప్రభూ! అనుగ్రహింపఁబడితిని. నాజన్మపావనమైనది. నాపాతకములు పటాపంచలైనవి" అని, నానందాశ్రుపూరితనేత్రుఁడాయెను.

పాండురంగవిఠలుఁడు భక్తుఁడగు చోకామేళునిఁ దనయాలయములోనికిఁగొంపోయి, "చోకామేళా! నీభక్తి నిరుపమానము నిన్ను నేనుమెచ్చుకొంటి" ననెను. ఆనందపరవశుఁడై యున్న చోకామేళుఁడు పరమాత్మునిఁ బలురీతుల స్తుతింపసాగెను. ఆలయముయొక్క యరుగులపైఁ బండుకొనియున్న ధర్మకర్తలగు బ్రాహ్మణులు, లోపలనెవరో సంభాషించుకొనుటవిని, తలుపుతెఱచి, చోకామేళోనిఁజూచి "ఇది యేమి? ద్వారములన్నియు బంధింపఁబడియుండగా, చోకామేళుఁడెట్లు స్వామిసన్నిధికేగినాఁడు? అయ్యో! చండాలప్రవేశమున యాలయమపవిత్రమైపోయినది" అని, చోకామేళు నీవలకుఁగొనివచ్చి "ఓరీ ఛండాల! పరమపవిత్రమైన యాలయములో నెవరునుచూడకుండ రహస్యముగ నెట్లు ప్రవేశించితివి? ఎప్పుడు ప్రవేశించితివి? నిజము చెప్పు" మని నిరోధించిరి.

చోకామేళుఁడు "భూసురోత్తములారా! ఆలయద్వారము లన్నియు బంధింపఁబడియుండఁగా, నేనెట్లు లోనఁబ్రవేశింతును? కృపామయుఁడగు పాండురంగప్రభువే నన్ను లోనికిఁగొంపోయెను. నేనిదే యావలకుఁ బోవుదు" ననెను. బ్రాహ్మణులు "అట్లుకాదు. నీవిచ్చట నున్నచో నిట్టిసంఘటనలే సంప్రాప్తమగుచుండును. నీవు చంద్రభాగా నదినిదాఁటి, యావలకుఁ బోవలయును. లేనిచో నధికారులతోఁజెప్పి, నీకుఁ గ్రూరదండన విధింపఁజేయుదుము" అనిరి.

"అయ్యో! పాండురంగపరమాత్మ సకలలోకాధీశుఁడు. భక్తపరాధీనుఁడు. చూచినంతమాత్రమున, నాసర్వేశ్వరుఁడును, దేవాలయమునుగూడ నపవిత్రమై పోయెననుచున్నారు. అక్కటా! జ్ఞానులిట్లుపలుకఁదగునా? పావనగంగాస్రవంతీజలంబులనెందఱు క్రుంకులిడు

టలేదు ? అస్పృశ్యులు తాఁకుటవలనఁగాని, త్రాగుటవలనగాని, గంగా నదీసలిలము లపవిత్రములగునా ? ఆ రమానాథునిదృష్టిలో నెల్లెడల సమభావమే—జాతిమతభేదములులే" వని చోకామేళుఁడుపలుక, నాద్విజన్ములు రోషకషాయితనేత్రులై "ఇదియేమి ? అస్పృశ్యుఁడవగు నీవు మాకు విజ్ఞానోపదేశముఁ గావింపఁబూనితివా ? చాల్చాలు" నని వెంటనే నగరాధికారికవ్విషయముఁ దెలిపిరి. ఆతఁడుకూడ నిర్దయుఁడై చోకామేళుని జంద్రభాగానదినిదాఁటి పొమ్మని యాజ్ఞాపించెను.

చోకామేళుఁడు సతీసమేతముగఁ జంద్రభాగానదిని దాఁటి యావలకుఁబోయి, యొకపర్ణకుటీరమును నిర్మించుకొని, యందు వసింప సాగెను. ఆతఁ డొకనాఁడు భోజనముచేయఁ బోవుచుండఁగాఁ బీతాంబరధారియైన పాండురంగ విఠలేశ్వరుఁడు సాక్షాత్కరించి, "భక్తమణీ ! నీతోఁగలిసి, భోజనముచేయ నేతెంచితి" ననెను. చోకామేళుఁడు వర్ణనాతీతమగు సంతోషమునొంది, భార్యనుబిలిచి "సకల లోకాతీతుఁడు, నమేయప్రభావభావనాతీతుఁడు నగుపండరినాథుఁడు మనయింటికి భోజనమునకువచ్చెఁ ద్వరపడు" మనెను. ఆమె యిర్వురకును వడ్డించెను. భోజనసమయమునఁ జోకామేళునిభార్య చేతికిఁదగిలి, దధియొకింత పండరీశ్వరుని పట్టుబట్టపైఁబడెను. "అయ్యో ! జాగరూకతగలిగి వడ్డింపక, ప్రభువున కపచార మొనరించితివా ? పరమాత్ముఁడు మనతోఁగలిసి భుజించుచున్నపు డెంత జాగ్రతగ నుండవలయు" నని చోకామేళుఁడు మిక్కిలి నొచ్చుకొనెను. ఆ మార్గమునఁ బోవుచున్న బ్రాహ్మణుఁ డొకఁడామాటల నాలకించి, చోకామేళునిఁ బిలిచి, "ఏమిరాదుర్మతీ ! పరమాత్ముఁడు పాండురంగస్వామి నీతోఁగలిసి భుజించినాఁడా ? ఏమి యీ వదరుఁబోతు మాటలు ?" అని చెంపపై నొకటికొట్టెను. చోకామేళుని కనులనుండి దుఃఖాశ్రుకణములు జాలువాఱెను. స్వామి యాతని నూఱడించి, యంతర్ధానము

నొందెను. ఆలయధర్మకర్తలలో నొకఁడగు నా బ్రాహ్మణుఁడు దేవాలయమునకేగి చూచుసరికి, పాండురంగస్వామి వివర్ణవదనుఁడై కన్పట్టెను. స్వామినేత్రములు దుఃఖాశ్రుమయములై యుండెను.

ఆ బ్రాహ్మణుఁడు భయభ్రాంతుఁడై, తక్కుంగల బ్రాహ్మణులఁ బిలిచి, చూపెను. జరిగినదంతయు నెఱింగి, యా భూసురులు భయకంపితులై, చోకామేళునికడకుఁ బరుగెత్తి, యాతని పాదముల పైఁబడి "చోకామేళా! నీవు మహాభక్తుఁడవు. పండరినాథుని విగ్రహము కళావిహీనమైయున్నది. స్వామిలోచనము లశ్రుధారతో నిండియున్నది. నీవు వచ్చినఁగాని, స్వామివారి విగ్రహము తొల్లిఁటిస్థితి నందదు" అని ప్రార్థించిరి. చోకామేళుఁడు వారి ననుసరించి, యాలయములోనికిఁ బోయినంతనే, పాండురంగవిఠలుని వదన మెప్పటివలె మందహాసాంచితమై కాన్పించెను.

మంగళ్వేఢనగరము చుట్టును బెద్దప్రాకారము నిర్మించుటకై బీదరుప్రభువు పంచముల నెల్లరినిగమ్మనెను. ఆ కుడ్యము నిర్మించుచుండఁగా, నటఁబనిచేయుచుండిన చోకామేళుఁడు తదితరులమీఁద కూలి పడిపోయెను. చోకామేళుఁడు తదితరులు నటమృతినొందిరి. చాలకాలమైనపిదప భక్తాగ్రగణ్యుఁ డగునామదేవునకుఁ బండరిపురీశుఁడు స్వప్నమున సాక్షాత్కరించి, భక్తుఁడగు చోకామేళుని యస్థికలకు సంస్కృతిఁ గల్గించుమనెను.

నామదేవట్లేవెడలి, యాప్రదేశమునఁ జోకామేళుని యస్థికలఁ గన్గొనఁజాలక, భూమిపైఁ జెవియొగ్గివినెననియు, నొకచోట "జై జై విఠోబా! జై జై విఠోబా" యని వినిపించుటచే నటనున్న యస్థికలే చోకామేళుని వనిభావించి, వానింగొనితెచ్చి, పాండురంగాలయమున కెదుట సమాధనిర్మించెననియుఁ జెప్పుదురు. ఆ సమాధి యిప్పటికిని

తీర్థయాత్రికులకు నేత్రోత్సవముఁ జేయుచున్నది. ప్రతివత్సరము ననేకు లటకువచ్చి, భజనలుఁ జేయుచుందురు.

ఆహా! అస్పృశ్యుఁడై యుండియు, చోకామేళుఁడు మహా భక్తుఁడై యాచంద్రతారకమగు యశము నార్జించెఁగదా!

---

# 10 నివర్తిదేవ, జ్ఞానదేవ, సోపానదేవులు, ముక్తాబాయి.

గంగానదీతీరమున నున్నయొక కుగ్రామమున గోవిందపండితుఁడను భాగవతాగ్రేసరుఁడు నివసించుచుండెను. నిరాబాయి యాపండితునిభార్య. గోవిందపండితునకుఁ జిరకాల తపఃఫలంబోయన నొక పుత్రుఁ డుదయించెను. ఆ శిశువునకు వారు విఠోబాయని పేరుపెట్టిరి. విఠోబా సకలశాస్త్రపారంగతుఁడయ్యెను. ఉపనయనానంతరము విఠోబా తండ్రి యనుమతిఁగొని, తీర్థయాత్రలఁ జేయఁబోయెను. అనేకములగు దివ్యస్థలముల దర్శించి, విఠోబా యలకాపురమునకుఁ బోయెను. అచ్చట సిద్ధపండితుఁడను సచ్ఛీలుఁడగు ద్విజోత్తముఁడు విఠోబాను గలిసికొని, బాల్యముననే వివిధశాస్త్రములం దసమానపాండిత్యము సంపాదించిన ఘనుఁడని గ్రహించి, తనగృహంబున కతిథిగాఁ గొనిపోయి సకలోపచారములనుజేసెను. పండరినాథుఁ డారాత్రి సిద్ధపండితు

నకు స్వప్నమున సాక్షాత్కరించి, "సీతనయ నీపుణ్యస్వరూపుఁడగు విఠోబాకిచ్చి పెండ్లిసేయు" మని పలికెను. విఠోబాకుఁగూడ కలలోఁ గాన్పించి "సిద్ధపండితుని కొమరిత నీకన్నివిధముల ననురూపవతియై యున్న దామెను పండ్లియాడు" మనిచెప్పి, యంతర్ధానమునొందెను.

సిద్ధపండితుఁడు విఠోబాకుఁ దనస్వప్నోదంతముఁ దెలియఁజేసి, శుభముహూర్తము నిశ్చయించి, తన దుహితయగు రుక్మాబాయి నిచ్చి పెండ్లిచేసెను. వివాహానంతరము విఠోబా మఱికొన్ని పుణ్య క్షేత్రములఁజూచి వచ్చి, తన తలిదండ్రులకడకుఁ బోవసంకల్పించు కొంటినని సిద్ధపండితునితోఁ జెప్పెను. సిద్ధపండితుఁడు సకుటుంబముగ విఠోబా తలిదండ్రులున్న యప్పుగ్రామమునకుఁ బోయి, వివాహవృ త్తాంతమును గోవిందపండితునకుఁ దెలియఁజేసెను. విఠోబా తలిదం డ్రులు కోడలినిఁజూచి, యత్యధికానంద భరితాత్ములైరి.

కొంతకాలము గడచెను. విఠోబాతలిదండ్రులు పరమపదము నొందిరి. మాతాపితృవియోగము విఠోబాకు సంసారమునెడ విరక్తిగలి గించెను. జామాత వైరాగ్యశీలుఁడై, సంసారవిముఖుఁడై యున్నాఁ డని సిద్ధపండితుఁడెఱింగి, శోకాకుల స్వాంతుఁడై యల్లుని, కుమార్తెనుఁ దనతో నలకాపురికిఁ గొంపోయెను. అచ్చటఁగూడ విఠోబా సంసారము నెడ నొక్కింత యనురక్తియైన గలిగియుండక, యొకనాఁడు భార్యను బిలిచి, తాను సన్యసింపఁదలఁచినట్లు చెప్పెను. ఆమెకును, సిద్ధపండితు నకును నిదిమఱింత దుఃఖకారణమయ్యెను. విఠోబా యిట్లుండగా వార ణాసికిఁ బోయివత్తుననిపలికి వెడలెను.

కాశీనగరమున విఠోబా సాధుసాంగత్యముఁజేసి, యేకాంతా వాసము, శాంతత్వము, అహంకారమును వర్జించుట, మున్నగునవి

మోక్షమునకు మూలసాధనములని గ్రహించి, రామానంద సన్న్యాసుల కడకుఁబోయి, తనకుఁ దలిదండ్రులు లేరని చెప్పి, పుత్రులులేని విషయమును, భార్యతోఁ జెప్పకుండవచ్చితిననియుఁ, జెప్పకుండ సన్న్యాసము స్వీకరించెను. ఈవార్త తెలిసికొని రుక్మాబాయి మేరమీఱిన దుఃఖము నొందెను నాఁటనుండి యామె. యలకాపురిలోనున్న యొక యశ్వత్థ వృక్షమునకుఁ బూజచేయుచుండెను.

ఒకనాఁడు సేతుబంధరామేశ్వరమునకు యాత్రార్థ మరుగుచు రామానందయోగి యలకాపురిలోని యశ్వత్థవృక్షచ్ఛాయను విశ్రమించెను. రుక్మాబాయి యథాప్రకారముగ వృక్షమునకుఁ బూజ సేయవచ్చి, రామానందయోగిని జూచి, సాష్టాంగదండప్రణామ మొనరించెను. ఆయోగి "దీర్ఘసుమంగలీభవ? సత్సంతానసిద్ధిరస్తు" అని యాశీర్వదించెను. రుక్మాబాయి నవ్వి "మహాత్మా! నాభర్త సన్యసించియుండగా, సత్సంతాన మెట్లుకలుగు?" నని ప్రశ్నించెను.

"ఏమి సంతానహీనుఁడు సన్యసింపరాదను నిబంధన నతిక్రమించి, నీనాథుఁ డెట్లుసన్యసించెను? అట్లు సన్యసించినవాఁడును, యట్టి వానికి, సన్న్యాసమొసంగినవాఁడును నపరాధులే" యని, యామె తండ్రిని రావించి, "నాతో మీయిరువురును కాశికిరండు" అని, రామేశ్వరయాత్ర జేసి, తిరిగివెళ్లుచు నలకాపురికిఁ బోయి, సిద్ధపడితుని, రుక్మాబాయినిఁ దీసికొని కాశికిఁబోయెను.

విఠోబా భార్యను, మామగారినిఁజూచి, భయకంపితుఁడై తాను సన్న్యాసముమీఁది యాశచే సంసారమువిడిచి, యనృతమునచించితినని, క్షమింపుమని వేఁడెను. రామానందయోగి "ఇప్పుడైనను మించినది లేదు. గార్హస్థ్యము నెఱపుము. నీకుమోక్షముఁ గలుగు" నని పలికి, తిరిగి యలకాపురికిఁ బంపెను.

విఠోబా, సన్యాసమునువిడిచి, మఱల సంసారమున జిక్కుకొని భ్రష్టుఁడయ్యెనని జనులు పరిహరింపసాగిరి. ఎవరెట్లు గేలిచేసినను, అతఁడు లెక్కసేయలేదు. పదిసంవత్సరములు గడచెను. రుక్మాబాయి గర్భవతి యయ్యెను. ఆదంపతులకు, నివృత్తిదేవు, జ్ఞానదేవు, సోపానదేవు ననుకూమారులును, ముక్తాబాయి యనుకూఁతురును జన్మించెను. ఈ నల్వురును మహాభక్తాగ్రగణ్యులగుదురని యెవ్వరెఱుంగుదురు ?

---

## 11 జ్ఞానదేవుఁడు మహిషము వేదముల జదువుట.



నివృత్తిదేవ, జ్ఞానదేవ, సోపానదేవ, ముక్తాబాయిలు పెద్దవారైనను, సన్యాసికుమారులని, మతభ్రష్టులని హేళనసేయఁబడుచుండిరి. బ్రాహ్మణులలోవారికి స్థానములేకుండెను. మనశ్శాంతిలేక, పశ్చాత్తాపతప్తుఁడై దేశాంతరములకుఁబోయెను. రుక్మాబాయి పతివియోగముచే క్రుంగిపోయెను. నివృత్తిదేవాదులు బ్రాహ్మణులకడకుఁబోయి " మమ్ము మీలోఁ జేర్చుకొనుఁడు. మాతండ్రి యనుతాపానలమున కింధనమయ్యెగదా ! " యనిరి. ఆభూసురులు " మీరు బ్రహ్మపురమునందలి వేదాధ్యయన సంపన్నులగు ద్విజులకడకరిగి, వారువిధించు ప్రాయశ్చిత్తముపొంది, యొకలేఖను గొనివచ్చినచో మాలోఁగలుపుకొందు " మనిరి.

అంతట నానల్వురును బ్రహ్మపురమునకుఁబోయి, యచ్చటి బ్రాహ్మణులకుఁ బ్రణమిల్లి, తమవృత్తాంతము సాంతముగఁ దెలుపుకొని, 'మాగతియేమి?' యని ప్రశ్నించిరి. ఆబ్రాహ్మణులు "మీరు సన్యాసిసంతానమగుటచే నొక్కటే ప్రాయశ్చిత్తమున్నది. మీరునల్వురును భగవచ్చింతానిమగ్నులై యుండుడు. మీకు మాలోస్థానమేర్పడును". అని, జ్ఞానదేవునుద్దేశించి. "నీవు మహాజ్ఞానివని నీపేరు సూచించుచున్నది. అది లోకమును వంచించుటకా? వేదాధ్యయన సంపన్నుఁడవై యుందువేని యట్టినామ ముంచుకొనవచ్చును. నీకును మహిషమునకు భేదమే?" మనిరి.

జ్ఞానదేవుఁ "డార్యులారా! నాకును మహిషమునకు భేదము లేశమైన లేదు. ఆమహిషమునకుఁగూడ జ్ఞానదేవుఁడని పేరుపెట్టుఁడు. నేనన్యథా భావించను. మీరు విజ్ఞులు. పరమాత్మునిదృష్టిలో ప్రపంచములోనిమానవులు సమానులు. హెచ్చుతగ్గులులేవు. దైవమునకు భక్తియేకావలయుఁగాని జాతిమతములతో నిమిత్తములేదు. ఆపరంధాముఁడు మనయందఱిలోను, జంతుకోటిలోని, ప్రతివస్తువునందును నగోచరుఁడై యున్నాఁడని యెఱుంగరే" యనెను—

"ఈ వేదాంతము కేమి? మహిషమునకును నీకును భేదములేదని నిరూపింపుము". అని, యామార్గమున నొకఁడొకమహిషమును దోలుకొని వచ్చుచుండుటచూచి, "ఆ మహిషమునాతఁడు కొట్టినచో నీశరీరమున నాగాయము గాన్పించవలయు" ననిరి. ఆ మహిషమును బళులకాపరికొట్టెను. జ్ఞానదేవునివీపుపై నాదెబ్బ సుస్పష్టముగఁ గనఁబడియెను. రెండవనిరూపణ:—"ఈమహిషముచే వేదముఁబలికించినచో నీవు వేదమునేర్చినవాఁడవని సమ్మతింతు" మని యాబ్రాహ్మణులనఁగా, జ్ఞానదేవుఁ డెల్లరును దిగ్భ్రాంతులగునట్లా మహిషముచే వేదములఁ జెప్పించెను.

వారందఱును మహామహిమోపేతులని గ్రహించి, యా బ్రాహ్మణులు నివర్తిదేవాదులను దమలోఁ గలుపుకొనిరి. అటనుండి, వారు నల్వురును పైఠణపురంబున కరిగి, యొక బ్రాహ్మణ గృహమున నివసింపసాగిరి. ఆ బ్రాహ్మణుఁ డొకనాడు పితృశ్రాద్ధముఁ బెట్టవలసి వచ్చెను. ఆ యూరిలోని బ్రాహ్మణుల నాతఁడు బిలువ, "సన్యాసి పుత్రులైన జ్ఞానదేవాదులు నీయింట నున్నందున మేము భోజనమునకు రానొల్ల" మనిరి. ఆ భూసురుఁడు విషాదవేదనావిదళితమానసుఁడై, జ్ఞానదేవునితో నామాట చెప్పెను.

"అయ్యా! నీవు సంకోచింపక వంటలఁజేయింపుము. నీ పితరులే స్వయముగవచ్చి, యారగింతురుగాక" యని జ్ఞానదేవుఁడు పలికెను. ఆ బ్రాహ్మణుఁడు స్నానముచేసి వచ్చెను. పండరినాథుని జ్ఞానదేవుఁడు ప్రార్థించెను. ఆ ద్విజన్మునిపితరులు స్వస్వరూపములతో నరుదెంచి, షడ్రసోపేతమగు భోజనముల నారగించుచుండిరి. అదివిని, యా వింతనుజూడ నూరిలోని బ్రాహ్మణులువచ్చి "జ్ఞానదేవాదులప్రమేయప్రభావభావనాతీతులు. వారిని నిందించి, మనము పాపులమైతి" మని, పశ్చాత్తాపమునొందిరి. అటనుండి, నివర్తిదేవ, జ్ఞానదేవ, సోపానదేవులు, ముక్తాబాయితో స్వగ్రామమునకుఁ బోయిరి.

---

# 12 బోదలబావా.

—— 0 :——

భక్తులపాలిటి కల్పతరువనఁజెల్లిన పండరీపురమునకు సమీపమున ధామణయను గ్రామంబున మాణకోజి బోధలబావాయను శుద్రకులోద్భూతుఁడగు సజ్జనుఁడు నివసించుచుండెను. ఆతనిభార్య మమతాబాయి సకలసద్గుణసంశోభితయై, భర్తయెడ నధికమగు విధేయతగలిగి, మెలఁగుచుండెను. ఇట్లుండఁగా నాదంపతుల కొకపుత్త్రుఁడు కలిగెను. వారబ్బాలునకు యమాజియను పేరుపెట్టిరి. యమాజీ పెద్దవాఁడైనపిదప బోధలబావా భగీరథీబాయి యనుసుశీలను బెండ్లి చేసెను. ఆమెయు భక్తియుక్తయై భర్తృసేవాతత్పరమతియై యుండెను. ప్రతియేకాదశికి తప్పకుండగా బోధలబావా పండరికిఁబోయి, మఱుచటిదినమున తిరిగివచ్చి, బీదసాదల కన్నదానము చేయుచుండెను. ఇట్లుండగా దేశమున మహాక్షామము తటస్థించెను. వేలకొలఁదిగఁ బ్రజలన్నములేక, మలమల మాడిపోవుచుండిరి. బోధలబావా కఱవని యిసుమంతైన నెనుదీయక, యడిగినవారికెల్ల భోజనమిడుచుండెను. ఆతనికడ నున్నద్రవ్యమంతయుఁ గర్చయిపోయెను. అతఁడు దారిద్ర్యావస్థలోనుండియుఁ గూలిపనిచేసి, సంపాదించిన స్వల్పములోఁ గొంత యతిధిసత్కారమునకు వినియోగపఱచుచుండెను. ఏది యెట్లున్నను, బోధలబావా, ప్రతియేకాదశికిని బండరికిఁ బోవుటమానలేదు.

ఇట్లుండగా, ఏకాదశివచ్చెను. నాఁడు బోధలకడ నెట్టినియోగాణియైన లేనందున, నూరివెలుపలనున్న యరణ్యమునకుఁబోయి, కట్టెల నేఱితెచ్చి, వానిని విక్రయింపగా లభించిన స్వల్పద్రవ్యముతోఁ బండరికిఁబోయి, పరమపవిత్ర చంద్రభాగానదీ సలిలంబులఁ దానమాడి, పాండురంగని సేవించి, యా దినమంతయు భజనలందుఁ

బాల్గొని, మఱుచటి యుదయమున స్నానమొనరించి, తనకడమిగిలిన స్వల్ప ద్రవ్యముతోఁ బిండికొని, నదీతీరంబున నొకచో నుపవిష్టుండై యిట్లు తలపోసెను—

"అక్కటా! దురవస్థ! నేఁడొక్కయతిథినైన సత్కరించ కుండ నెట్లుభుజింతును? నాకడనున్న యీపిండి నెవరుభుజింతురు?" అతఁడీరీతిని యోచనసేయుచుండఁగా, భక్తజనమందారమగు రమా కాంతుఁడు పేదపాఱునివలె చద్మవేషముఁదాల్చి, బోధలబావాకడ కరిగి "అయ్యా! క్షుత్పీడితుఁడనై యున్న నాకేమైనఁ బెట్టెదవా?" యని యడిగెను.

బోధల యంతట "నో మహాత్మా! ఈ దీనునికడ కొంతపిండి యున్నది. వలయునేని గైకొనుఁడు. రొట్టెలఁ జేసికొనుటకైన నుప్పు కూడలేదే" యనెను. "ఫరవాలేదు. కొంచెము శ్రమపడి, పిడుకలఁ గాని, ఎండినకట్టెలఁగాని గొనిరమ్ము" అనెను. బోధల సంతోషభరి తాంతరంగుఁడై, "ఆహా! నాజన్మ సార్థకతగాంచినది. అఖిలలోకాధి నాథుఁడగు శ్రీపాండురంగ విఠలుఁడే, యీ రూపమున నన్ననుగ్ర హించినాఁ" డనితలంచి, వెళ్లెను. ఇంతలో భక్తాభీష్టప్రదాయిని యగు లక్ష్మీదేవి, పేదముత్తయిదువ వేషమునవచ్చి "నాథా! గ్రామ మునం దంతటను బ్రహ్మాండముగ సంతర్పణలు జరుగుచుండఁగా నిచ్చట నేకాంతముగఁ గూర్చుండినారా? మీకా శ్రమయేల? ఇట్లిండు. నేనేరొట్టెల కాల్చియిత్తు" ననెను.

ఇంతలో బోధలబావావచ్చి "అయ్యో! ఇదియేమి విపరి తము? ఆ బ్రాహ్మణుననే యీపిండి చాలదని భయపడుచుండగా నొక సాధ్వీమణికూడ వచ్చినదే. ఆమెకుఁగూడ నీపిండిచాలునా?" యని తలంచి, పిడుకల నచటనుండెను. లక్ష్మీదేవి యొకపెంకును దెచ్చి, మంట

చేసి, యాపిండిని దాకినంతనే యదిరొట్టెంపాయెను. ఆమె యంతట రొట్టెలఁగాల్చి తననాధునకుఁ గొన్ని పెట్టి, తాను గొన్నితీసికొని, మిగిలి నవి బోధలాబావా కొసంగి, పతితోఁగలిసి యంతర్థానమునొందెను. ఎన్నితిన్నను యా రొట్టెలు తఱుగకుండుటచే మహాద్భుతమంది, యాతఁ డదియంతయుఁ బాండురంగని కృపయేయని మనంబున నిశ్చ యించుకొని, తిన్నగా నాలయమునకుఁబోయి "హే పరమాత్మా! సర్వాంతర్యామీ! నీవు నిఱుపేదనగునాయెడ నిర్హేతుకమైనకరుణచూపు టకు నాయందేమిఘనతగలదు?" అనెను. పాండురంగఁడు "భక్తాగ్ర గణ్యా! నీవు నిశ్చలచిత్తుఁడవై యొసఁగిన యాపిండియే నాకుఁ బ్రీతి గొల్పునదికాని, యాడంబరముకొఱకు, భక్తిభావరహితులై పంచభక్ష్య పరమాన్నములతోఁ గూడినభోజనము నివేదనగా నిడినను నాకుఁదృప్తిఁ గూర్పఁజాలదు. ఇంతయెందులకు? రేపటిదిన ముదయమునజరుగు బ్రాహ్మణసమారాధన స్థలంబుదగ్గఱ నన్ను కలిసికొను" మనెను.

బోధలబావా యట్లే మఱునాఁడొక షాహుకారు సంతర్పణ చేయుచున్నాఁడని విని, యచటికేగెను. పాండురంగ విఠలుఁడు పేద ముదుసలి బ్రాహ్మణవేషమున నటకువచ్చెను. బోధలనుజూచి, యా చినిఁగినవస్త్రములఁ గట్టుకొనియున్న పేదపాఱుఁడు "ఓభక్తుఁడా! ఇచట జరుగునదంతయుఁ జూచుచుండు" మని పలికి, భోజనములు వడ్డించియున్న పందిరిలోనికిఁ బోయెను. పీటలపైఁ గూర్చుండిన యా బ్రాహ్మణు లందఱును నీవృద్ధపాఱునిఁగాంచి, యసహ్యించుకొని పొమ్ముపొమ్మని కసరికొట్టిరి. ఆ వర్తకుఁడువచ్చి "ఓయి బాపఁడా! పొమ్ము. పొమ్ము. నిర్ణయించుకొనిన ప్రకార మెనిమిదినూఱ్లమంది కేర్పాటుచేయఁబడినది. ఆరీతిగా నందఱును వచ్చినారు. నీకిట తావు లేదు." అని నిరసించెను.

“అయ్యో! ఆఁకటిబాధకుఁ దాళఁజాలకున్నాను. మూర్ఛ వచ్చుచున్నది. ప్రాణములు నిలుచునట్లు లేవే” యని, యావేద పాఠుఁడు పలుక, నాషాహుకారు “ఓహో! ఈతఁడిచ్చోటఁ బ్రాణ త్యాగ మొనరించి, సమారాధనకు భంగ మాపాదించునట్లున్నది. వీని నావలకుఁ గెంటివేయుఁ” డనెను. తోడనే కొందఱు బ్రాహ్మణు లరు దెంచి, ముసలిబ్రాహ్మణుని రూపముననున్న పండరినాథుని గెంటివైచిరి.

వెనువెంటనే పెనుగాలి బయలుదేఱి, విజృంభించి, యాపందిరిని సహస్రాంశములుగఁ జేసెను. బ్రాహ్మణులు ప్రాణములు దక్కించుకొన నెంచి, పరుగులిడిరి. ఆరీతిగా సంతర్పణచెడిపోయెను. బోధలబావా ధామణగ్రామమునకు వెడలిపోయెను. ఆతనికిఁ గొంతభూమి యుండెను. అందు జొన్నలుపండుచుండెను. దారినిపోవు మార్గస్థులెవరైన నడిగి నచో బోధలబావా జొన్నకంకెలఁ దినుమని యిచ్చుచుండెను. ప్రభు త్వమువారు పన్నుకొఱకాయూరు వచ్చిరి. గ్రామస్థులందఱును “బోధలబావా పన్నుచెల్లించినచో, మేమిచ్చెద” మనిరి. రాజ భటులు బోధలకడకు వచ్చి పన్నిమ్మనిరి. ఆతఁడు సవినయముగ “నయ్యా! నాయొద్ద కొన్నిరూకలేయున్నవి. వలయునెడల వాని నిపుడు కొనిపొండు. లేనిచో నాలుగుదినములు గడచినపిదప రండు” అనియెను. “అట్లు వలనుపడదు. ఇపుడే యిచ్చితీరవలయు” నని యా భటులు పలుకగా, బోధలబావా యొకయూరునకు బోయెను. ఆ సంగతి తెలిసి, భటులు బోధలాబావా భార్యాపుత్రులను “పన్ని చ్చువఱకును నింటిలోనుండి, మీరు కదలుటకు వీలులేదు” అనిరి.

ఇంతలో నొక భటుఁడువచ్చి “ఆర్యా! మీకు బోధలబావా యీధనము నిమ్మని నాచేఁ బంపినాఁడు. రసీదిటుతెండు” అని, రూకల నొసంగెను. భటులు రసీదిచ్చి వెడలిపోవుచుండఁగా, నూరినుండి తిరిగి

వచ్చుచున్న బోధలబావా కాన్పించెను. "అయ్యా ! నీవు భటునిచేఁ బంపిన ధనమందినది. రసీదు నింటికడనొసంగినార" మని వెడలిపోయిరి. "ఇదేమి ? భటుఁడెవఁడు ? నే ధనమంపుటయేమి" యని యాశ్చర్యమునొంది, యాతఁ డదియంతయు పాండురంగని యవ్యాజానురాగమే యనితలంచెను.

పాండురంగని యవిరళకృపావిశేషమున బోధలబావా గృహమంతయు ధాన్యరాసులచే నిండిపోయెను. తఱుగనిభాగ్యము సంప్రాప్తించెను. పొలము సమృద్ధిగఁబండెను. బోధలబావా యథాప్రకారముగ దీనులయెడ దయార్ద్రహృదయుఁడై, నిరతాన్నదాతయై, పాండురంగ సేవాతత్పరుఁడై కాలముగడపెను. నాఁటికిని, నేఁటికిని ధామణ గ్రామము తీర్థయాత్రాస్థలమై యొప్పుచున్నది.

---

# 13 రోహిదాసు.



గంగానదీతీరంబున నొక కుగ్రామముండెను. ఆ గ్రామంబున రోహిదాసను చాంభారుకులస్థుఁడగు భాగవతోత్తముఁడు నివసించు చుండెను. ఆతఁడు జీవహింసచేయక, నిరంతరము తనకున్నదానిలోనే దానధర్మములఁజేయుచు, గాలక్షేపము సేయుచుండెను. ఆతఁడు ప్రతి రోజును చెప్పులఁగుట్టుచు కొంత ద్రవ్యమునుదానధర్మములకై వినియో గించుచుండెను. భగవత్స్వరూపులగు భక్తులకు పాదరక్షల నుచితముగఁ గుట్టియిచ్చుచుండెను. నిరంతరము హరినామస్మరణ మొనరించుచు రోహిదాసు నిర్మలహృదయుఁడై, పాపకార్యములఁ జేయక, జీవదయా పరత్వము గలిగియుండెను. పాండురంగఁడు రోహిదాసు భక్తికి మిక్కిలి సంతసించి, సాలగ్రామమూర్తియై, యాతనియింట వెలసి, సపర్యల నందుచుండెను. అనుదినము నతఁడు పాండురంగ నామసంకీర్తన మొన రించుచు, నదికిఁబోయి స్నానమాచరించి, పూజసేయుచుండెను. రోహి దాసు తులసీవనమును నిర్మించి, యందుఁగూర్చుండి, పూజ కుపక్ర మించునంతలో నాతని కాఁకలివేసెను. ఆ యాఁకటిబాధకుఁ దాళఁ జాలక "ఏమిది? పాండురంగ నారాధించుటకుఁ బూర్వము నన్ను క్షుద్బాధ దహించుచున్నది? ఈ యాఁకటిబాధ నివృత్తిఁజేసికొనిన పిమ్మటనే నిర్మలమగు చిత్తముతో భగవదారాధనముఁ జేయుట యుక్త" మని తలంచి, భోజనము భగవంతునకు నివేదనగా నిడిన పిదప భుజించి, మఱల తులసీవనమునఁ బ్రవేశించి, పూజకుఁ గడంగు చుండెను.

ఇట్లుండఁగా నొకనాఁ డొక బ్రాహ్మణుఁ డామార్గమునఁ బోవుచు, రోహిదాసు గృహోపరిభాగమునఁ దులసివనముం జూచి, రోహిదాసును బిలిచి, "ఓరీ! నీవు చాంభారుఁడవు. నీవు తులసి

మొక్కలఁ బెంచనగునా? సాలగ్రామపూజ గావింపవచ్చునా? అదియుఁగాక, భోజన మారగించిన పిదపఁ బూజసేయుదునని చెప్పుచున్నావు? ఈ లోకంబున నెవ్వరైన నట్లుచేయుదురా? అదియునుంగాక, పరిశుద్ధమైన కాచపాత్రలతో జలముఁదెచ్చి, పూజింపనగుఁగాని, యీ విధముగాఁ జర్మవినిర్మితములైన పాత్రలతోఁ బూజసేయనగునా? పరమాత్మునికి వెట్టి యపచారము సేయుచున్నావు? నీవెంత పాప మార్జించుకొనుచున్నావు?" అని ప్రశ్నించెను.

రోహిదాసంతయు నాలకించి, "మహాత్మా! తాము పల్కిన దంతయు బాగుగనేయున్నది జాతిచే హీనుఁడైనంతమాత్రమునఁ దులసి మొక్కలతో వనము పెంచుకొనరాదని, యేశాస్త్రము లుద్ఘోషించుచున్నవి? నీచకులస్థులకు దైవారాధనము తగదా? భక్తికి జాతిమత భేదములు లేవు. గొప్పగా దానధర్మములుఁ జేసి, కీర్తి నార్జించుటకంటె కేవలము నిశ్చలహృదయముతోఁ బరమాత్మునకుఁ దులసిదళము నర్పించినఁ జాలదా?" యని ప్రత్యుత్తరమొసంగెను. ఆ భూసురుఁడు కోపమునొంది, చురచురఁ జూచెను.

అంతట పండరినాథుఁడు శంఖచక్రధారియై, రోహిదాసునకు సాక్షాత్కరించి, యాతని వదనమును బ్రహ్మతేజోద్దీపిత మొనరించెను. అదిచూచి, యాబ్రాహ్మణుఁడు విస్మయపరీతచేతస్కుఁడై, తన దప్పిదమును గ్రహించి, "రోహిదాసా! నేనాడిన మాటలకుఁ గినియకుము. నీవు మహాభక్తుఁడవని యెఱుంగక, నిష్ఠురాలాపంబుల నీమనంబును నొప్పించితిని. మన్నింపుము. నీసాన్నిధ్యమున నుండుటచే నజ్ఞానాంధకారావృతమైయున్న నాచిత్తము విజ్ఞానోద్భాసితమైన" దనిపలికి వెడలిపోయెను.

రోహిదాసు చిరకాలము భక్తియుక్తుఁడై గడపి, యనంతానందనిలయమగు వైకుంఠముం జేరెను.

---

# 14 గోరాకుంభార్.

తరడోకి యనుగ్రామమున కుమ్మరియొకఁడు కలఁడు. ఆతని నామధేయము గోరాకుంభార్. అతఁడు సచ్ఛీలయగు భార్యతోఁ గాపురము సేయుచుండెను. నిరంతరము నాతఁడు పండరినాథుఁడగు పాండురంగప్రభుని భజన మొనరించుచుఁ గాలము గడపుచుండెను. మహాభక్తుఁడని యాతనికీర్తి నలుగడలవ్యాపింపసాగెను.

ఒకనాఁ డాతఁడు కుండలఁజేయుటకై మన్నుత్రొక్కుచు, పాండురంగని పవిత్రనామసంస్మరణ మొనరించుచుండెను. ఆతనిభార్య చంటిబిడ్డను భర్తదగ్గఱగానుంచి, జలముఁ దీసుకొనివచ్చుటకై చంద్రభాగానదికిఁ జనెను. ఆమె వెడలునప్పుడు "నాథా! మనబిడ్డఁ డాడుకొనుచున్నాఁడు. జాగ్రతగఁ జూచుచుండుఁ" డని చెప్పియుండెను. గోరాకుంభార్ కన్నులు మూసికొని, పాండురంగధ్యాన నిమగ్నుఁడై, యాడుకొనుచున్న చంటిబిడ్డను మంటిలోఁ ద్రొక్కివైచెను. భార్య నదినుండివచ్చి, శిశువునుగానక యటునిటు కలయఁజూచెను. కుమారుని కళేబరము మంటిలోఁ ద్రొక్కివేయఁబడి యుండుటచూచి, ఆమె గుండెలు బాదుకొనుచు భూనభోంతరాళములు ప్రతిధ్వనించునట్లు విలపించుచు "అయ్యో! ఎంతదారుణకార్యము నాచరించితిరి. కన్న కొడుకును మంటిలోఁ ద్రొక్కివేసితిరి. అవిగో—రక్తమాంసములు—అయ్యో!" యనెను. గోరాకుంభారు దుఃఖితాత్ముఁడై, సతి నూఱడించుటకు మాఱు క్రోధవివశుఁడై "ఓసీ రక్కసీ! కుమారునికొఱకేడ్చుచు భగవద్ధ్యానపరాయణుఁడనై, పరవశుఁడనై యున్నవాఁడనని యెఱుంగక గోలచేసెదవేమి?" అని చక్రముతోఁ గొట్టబోయెను.

ఆ సాధ్వియంతఁ బతినుపలక్షించి "మీరు నన్ను తాఁకవలదు. తాఁకిన దేవునిపైనాన" అనెను. భార్యాభర్తలిరువురు నొకరితో నొకరు నెలరోజులు మాట్లాడుట మానివైచిరి. తదనంతర మొకనాఁ డామె భర్తపాదము లొత్తఁబోయెను. అతఁడు "నీవు నన్నుతాక వలదని ప్రమాణముచేసితివి. ఆమొట్టును మీఱఁజనదు దూరముగఁ బొమ్ము" అనెను. ఆమె విచారమునకుఁ బారములేదు. ఈ వృత్తాంతము నామె తలిదండ్రులకుఁ దెలియఁజేసి, తనచెల్లెలినిచ్చి వివాహము చేసి వంశము నిలుపఁగోరెను. తలిదండ్రులామె కోరిక నిరాకరింపనేరక, తమ రెండవకొమార్తెను గోరాకుంభారునకిచ్చి పరిణయ మొనరించి, "నాయనా! నీ యిరువురుభార్యలను సమభావమునఁ జూచుకొను" మని నొక్కిచెప్పిరి. రెండవకుమార్తె కాపురమునకువచ్చి, భర్తయెడ ననురాగవతియై యుండెను. వంశాభివృద్ధికొఱకే యీవివాహ మొనరింపఁబడినను గోరాకుంభారు రెండవభార్యనుగూడ తాకక దూరముగ నుండుచుండెను.

ఇదిచూచి పెద్దభార్య "ఆర్యా! వంశము లేకుండపోవునను భయముచేతనేగదా, నా దలిదండ్రులకు నచ్చఁజెప్పి నాసోదరిని వివాహము చేయించినది? మీరిపుడిట్లు నన్నేగాక ఆమెనుగూడ నిరాకరించి, యనాదరింపనగునా?" అనఁగా, నాతఁడు "వివాహకాలమున మీ యిరువురను సమదృష్టితోఁ జూడుమని నీ జననీజనకులు నాతోఁజెప్పిరి. అందుచేఁ మీచెల్లెలనుగూడ తాఁక నిచ్చగింపలేదు." అని బదులుచెప్పెను. సోదరీమణు లిర్వురునుగూడ విచారక్రాంత చిత్తలై, గోరాకుంభారును దమయెడ నెట్లయిన యనురక్తునిఁ గావించుకొనవలయునని వివిధయత్నములఁ జేయసాగిరి. రాత్రి అతఁడు శయనించియున్నపుడు ప్రక్కనేపరుండి, అతనికరముల స్పృశింపసాగిరి. గోరాకుంభా రొకనాఁటి రాత్రి నిద్రనుండి మేల్కాంచి, "మీ యిరు

పురుని నా వ్రతమును భంగపఱచుటకే యిట్లు చేయుచున్నారు కావున నా చేతులను ఖండించుకొందు" నని పలికి, యొక నిశితకరవాల ముతోఁ దనచేతుల ఖండించుకొనెను. ఆతని భార్యల రోదనమునకిఁక మితిలేదు. "మీరు ఏడువవలదు. పాండురంగ దివ్యనామసంస్మరణము నకే మీ జీవితములు వినియోగించి తరింపుఁడు" అని గోరాకుం భారు వారి నోదార్చెను.

ఇట్లుండఁగా ముక్కోటి ఏకాదశి వచ్చెను. నాఁడు గోరాకుం భారు భార్యాసమేతముగఁ బండరికిఁబోయి, పవిత్ర చంద్రభాగానదీ తోయంబులఁ గ్రుంకులిడి, పాండురంగని సందర్శించి, నిరతిశయానంద భరితాత్ములై యాలయములో ధ్వజస్తంభముకడ భక్తులు భజన మొనరించుచుండగా నటకరిగిరి. నామదేవాది మహాభక్తులెల్లరును తన్మయులై తాళమువేయుచు నృత్యము సేయుచుండిరి. తానుగూడ తాళమువేయుటకుఁ జేతులు లేకపోయెనేయని గోరాకుంభారు దుఃఖము నొందెను. ఎల్లరు విస్మయపరీతచేతస్కులగునట్లు పాండురంగని కృపా విశేషమున గోరాకుంభారునకు రెండుకరములును వచ్చెను. ఆతనిని చూచి తక్కుంగల భక్తులందఱును నిరవధికానందము నొందిరి. భక్తుల కెల్లరకును బాండురంగవిఠలుఁడు ప్రత్యక్షమై, గోరాకుంభా రుని సమీపించి, "భక్తాగ్రణీ! నీభార్య లిరువురితోడను గార్హస్థ్యము నెఱపుచు, భక్తియుక్తుఁడవై యుండు" మనిచెప్పి, యదృశ్యుఁ డాయెను. గోరాకుంభారు తరవాత గ్రామమునకుఁ దిరిగివచ్చి, భగవ ద్భక్తియుక్తుఁడై కాలము గడపెను.

---

# 15 మత్స్యేంద్రనాథుఁడు.

———:0:———

మత్స్యేంద్రనాథుఁడు మహాభక్తాగ్రగణ్యుఁడు ఆతనికిందఱో శిష్యులు. ప్రియశిష్యుఁడు గోరక్షనాథుఁడు. గోరక్షనాథుఁడును, తదితరశిష్యులును ఆశ్రమమునఁ బురాణగ్రంథములఁ జదువుకొను చున్నతఱి నొకవారవనిత యటకరుదెంచి, సత్యదేవను శిష్యునిజూచి "ఏమి దూరయోగీ! ఇచ్చటనున్నావా? నన్ను మోసగించి, ఎందేగఁ దలఁచితి?" వని ప్రశ్నించెను. శిష్యులందఱును విస్మితులైరి. గోరక్ష నాథుఁడరుదెంచి "ఓనారీమణీ! నీవెవ్వతెవు?" అని ప్రశ్నింప, నామె సత్యదేవుతనను మోసగించెనని చెప్పెను. సత్యదేవుఁడు తానామె నెఱుఁగనని బొంకెను. గోరక్షనాథుఁడు దివ్యదృష్టిని జరిగినదంతయు గ్రహించి, సత్యదే వపరాధియని తెలిసికొని "అసత్యాలాపీ! గురు వరేణ్యునితోఁజెప్పి, నిన్నేమి చేయింతునోచూడు" మనెను. ఆవెల యాలిని మందలించి "బైరాగులనెవ్వఁడును నీయింటికి రానీయకు" మనిచెప్పెను. గోరక్షనాథునకు జరిగినదంతయు వింతగాఁగాన్పింప "నిదియే?" మని యొకనాడు సహపాఠినడుగ నాతఁడు "గోరక్ష నాథా! ఇదియేమాయ" యనెను. గోరక్షనాథున కర్థముకాలేదు. ఆతఁడు తిన్నగా గురునగు మత్స్యేంద్రనాథునికడకరిగి "మహాత్మా! మాయ యనగానేమి?" యనిప్రశ్నించెను. మత్స్యేంద్రనాథుఁడు "గోరక్షనాథా! మోహమేమాయ" అనెను. "మహాత్మా! నాకు మాయయనునట్టిదో చూపుఁడు" అని గోరక్షనాథుఁడు వేఁడు కొనఁగా, మత్స్యేంద్రుఁడు వల్లెయనెను.

మత్స్యేంద్రనాథుఁడు భిక్షాటనమునకై యాశ్రమమునుండి నగరములోనికిఁబోయి యొకయింటిముందునిలిచెను. ఆయింటిలోనుండి

సత్యదేవుమాటలు వినబడుచుండెను. 'సత్యదేవ్' అని మత్స్యేంద్ర నాథుఁడు పిలిచెను. సత్యదేవీవలకువచ్చెను. "ఇది యెవరిగృహము?" అని మత్స్యేంద్రనాథుఁడు ప్రశ్నింప నాతఁడు భయకంపితుఁడై వణకుచు "ఇది వారకాంతగృహ" మని బదులుచెప్పెను. మత్స్యేంద్ర నాథుఁడు "సత్యదేవ్! నీవింకను మాయావాగురయందే చిక్కియుంటివా?" అని వెడలిపోసాగెను. "స్వామీ! పాపిని. క్షమింపుము" అని సత్యదేవుపలికి, తానుగూడ నాతనిననుసరించెను. ఇరువురును జాల దూరమరిగిరి.

"ఇదియేదేశ?" మని మత్స్యేంద్రనాథుఁడు ప్రశ్నింప సత్యదేవు "స్వామీ! కామరూపదేశములో మనమిపుడు ప్రవేశించినారము. ఈదేశమును తిలోత్తలయనుసుందరి పరిపాలించుచున్నది" అని బదులుచెప్పెను. వారిరువురును ముందునకరిగిరి. తిలోత్తలరాణి పరిచారికలరుదెంచి "ఇదిస్త్రీలరాజ్యము. పురుషులకుఁ బ్రవేశింపరానిది. మీరు మారాణియనుమతిలేక ప్రవేశించినందున మిమ్ము బంధించుచున్నా" మని నిర్బంధముననుంచిరి. సత్యదేవును పంజరమువలె విచిత్రముగానిర్మింపఁబడిన యొకయాగారమున నాస్త్రీలుబంధించిరి. మత్స్యేంద్రనాథు నొకచోఁగూర్చుండనియమించి, యాతనికంతము చుట్టును బెద్దకొయ్యచక్రమునుంచిరి. ఈవృత్తాంతమంతయు రాణి తిలోత్తలకుఁదెలిసెను. "నగరములోఁ బురుషులు ప్రవేశించినపుడు వారినెందులకు వధింపక, నిర్బంధముననుంచినా?" రనిపలికి, యాగ్రహావేశవివశయై కరవారము నొరనుండితీసి, ఝుళిపించుచు "నాకేరీ?" యని గంభీరముగాఁ బ్రశ్నించెను.

పరిచారికలామెకు వారినిజూపిరి. దివ్యతేజస్వియై, సమాధినిష్ఠాగరిష్ఠుఁడై యున్న మత్స్యేంద్రనాథునామె సమీపించెను. చెలి

కత్తినుజూచి "చంపు" మని తిలోత్తమ యాజ్ఞాపించెను. చెలికత్తె మంజరి ఖడ్గమెత్తెను. వెనువెంటనేయది తుత్తునియలై పోయెను. "ఛీ! పౌరుషములేనిదానా!" యని మంజరినీసడించి, తిలోత్తమ తానేఖడ్గము నెత్తెను. అది పూలమాలయైపోయెను. సంభ్రమాశ్చర్య క్రోధములొక్కుమ్మడి పెనగొన, నామె మత్స్యేంద్రనాధునివంక చూచెను. ఆతఁడంతట "జై అలక్ రంజన్" అనెను. మఱుక్షణమున నాతని కంఠమునకుఁ దగిలింపఁబడియున్న చక్రము తుత్తునియలైపోయెను. తిలోత్తమ బొందినయాశ్చర్యమునకు మేరలేకుండెను. ఈ వింతచూచి, పంజరమువలెనున్న యాగారములో బంధితుఁడైయున్న సత్యదేవు "స్వామీ! గురుమహారాజ్! నన్ను బంధవిముక్తునిగఁ జేయరా!" యని కేకలిడజొచ్చెను. మత్స్యేంద్రనాధుఁడు మఱల "జై అలక్ రంజన్" యను మంత్రాక్షరములఁ బఠించెను. ఆ పంజరము శతధా వ్రయ్యలయ్యెను. తిలోత్తమయు, నామె పరివారము సంభ్రమాశ్చర్యాన్వితస్వాంతలైరి. తిలోత్తమ మత్స్యేంద్రుని యసాధారణమహాత్మ్యమును, ననన్యసామాన్యసౌందర్యమును గాంచి చంచలచిత్తయాయెను. చూచుచుండఁగనే ఆమెచిత్తము ప్రణయవిహ్వలమయ్యెను. నయనములు ప్రణయోజ్వలము లయ్యెను. ఆమె మోకరించి "స్వామీ! మహాతేజసంపన్నమగు తమ వదనమండలమును వీక్షించినంతనే నాహృదయము భయాశ్చర్యమగ్నమైనది. నన్ను మన్నింపఁగోరెదను. అవివేకాంధనై చరించిన నాయవజ్ఞతను సైరింపుఁడు, నన్ననుగ్రహింపుఁడు. భవచ్ఛరణదాసిని." అనెను.

మత్స్యేంద్రనాధుని హృదయము దయార్ద్రమయ్యెను. ఆమె యద్వితీయ సౌందర్యావలోకనమున నామహర్షిచంద్రుని చిత్తము చపలతనొందెను. ఆమె సాహసించి, యతనిదగ్గఱకువచ్చి, నిలిచెను. ఇంతలో నొకపరిచారిక పరుగెత్తుకొనుచువచ్చి, "మన శత్రురాజగు

జయంతుఁడు బ్రహ్మాండమగు సైన్యమును గొనివచ్చుచున్నాఁడు. దుర్గమాతని వశము కానున్నది. ఏమిచేయుదుము ?" అనెను. రాణి తిలోత్తమ యావేగముతో "మహారాజ్ ! కర్తవ్యమేమి ?" అని ప్రశ్నింప మత్స్యేంద్రుఁడు "తిలోత్తమా ! అధైర్యము నొందకుము. సైనికులకొఱకాందోళన మొందకుము." అనిపలికి మఱల మంత్రాక్షరములగు "జై అలక్ రంజన్" అనుసరికి యా శత్రుసైనికులందఱు నిలువఁబడియున్నచోటుననే గిర్రున తిరుగసాగిరి. వారి నాయకుఁడగు జయంతుఁడు భయవిహ్వలుఁడై తిలోత్తమయున్నయెడ కరుదెంచి, ఆమె పాదములపైఁబడి క్షమింపుమని వేడెను. ఆమె మత్స్యేంద్రనాథుని వంకచూడఁగా నాతఁడు మఱలమత్స్యేంద్రుని పాదములపైఁబడి వేఁడుకొనెను. జై అలక్ రంజన్ అని మత్స్యేంద్రనాథుఁడు పలుకునరికా సైనికులను బాధించు మహిమ ఆగిపోయెను. అందఱును బాధారహితులైరి. జయంతుఁడు వెడలిపోయెను.

తిలోత్తమ మత్స్యేంద్రనాథు నంతఃపురములోనికిఁ గొంపోయి, పన్నీట నభ్యంగనము జేయించి, చీనిచీనాంబరముల ధరింపఁజేసి, ప్రేమసాగరతరంగముల నోలలాడించెను. సత్యదేవు మంజరిని పెండ్లియాడెను. ఇరువురు నట్లు సుఖసాగరతరంగమాలికల నూగులాడుచుండిరి. తిలోత్తమ గర్భవతియై, యపూర్వ రూపలావణ్యవిలసితుఁడగు పుత్రుని గాంచెను.

మత్స్యేంద్రనాథుఁడు పూర్వాశ్రమసంపర్కములిడిచి, గార్హస్థ్యము నెఱపుచుండ నెవరైన సన్యాసులరుదెంచినచో మఱల చిత్తము చలించి, తన్ను పరిత్యజించి పోవునేమో యనుభయమునఁ దిలోత్తమ సన్యాసుల నేరిని లోనికిరానీయవలదని కఠినముగ నాజ్ఞాపించెను. గోరక్షనాథుఁడు గురునిగానక గొందఱుశిష్యుల వెంటనిడుకొని వెదకికొనుచుఁ

దిన్నగాఁ గామరూపదేశమున కరుదెంచెను. రాజసౌధ ప్రాంగణమున భటుఁడు కావలియుండెను. గోరక్షనాధునిఁ గాంచి, యా భటుఁడు "ఏమి ? స్వామీ ! ఇట్లువేంచేసితిరి ? ఇది సన్యాసులకు దుర్గమము" అనెను. "మా గురువర్యుఁడు సద్గురు మత్స్యేంద్రనాధస్వామి యిట్లరు దెంచెనా ?" యని గోరక్షనాధుఁడు ప్రశ్నించెను. "లేదు లేదు" అని యాభటుఁ డసత్యము చెప్పెను.

"నేను లోనికిఁబోయి మీరాణిని దర్శింతు" నని గోరక్షనాధుఁడు వచించి, నాభటుఁడు నిరాకరించెను. తన మహిమచూపఁదలంచి, గోరక్షులు "జై అలక్ రంజన్" అనెను. ఆభటుని కాపాద మస్తకము నిశితశరపరంపర గ్రుచ్చుకొనినబాధ జనించెను. "మహాత్మా ! రక్షింపుము. ఈబాధ దుర్భరము. దుస్సహము" నని విలపింపసాగెను. గోరక్షులు మఱల మంత్రాక్షరముల నుచ్చరింపఁగనే యాబాధ యుపశమించెను. లోనికెట్లయినఁ బోవలయునని సంకల్పించి యున్న గోరక్షులకపుడే మంచియవకాశము లభించెను. అచ్చటికిఁ గొందఱు వేషధారు లరుదెంచిరి. వారు సంభాషణమునఁ దమ మార్దంగికుఁడు వ్యాధిగ్రస్తుఁడయ్యెను. ఏమిచేయుటకును దోఁచుట లేదు. వసంతోత్సవసందర్భమున మాకవకాశములేనిచో మఱల నొక వత్సరమువఱకును మాకు వీలుకాదు" అని చెప్పిరి. గోరక్షనాధుఁడు "ఓ వేషధారులారా ! మీరు శిరిగిపోనక్కఱలేదు. నేను మృదంగము చక్కఁగా వాయింతును" అనిచెప్పి, వారి ననుసరించి, సన్యాసవేషముఁ దొలఁగించి, వేషధారివలె నంతఃపురములోని కేగెను.

రాణి •తిలోత్తమయు, మత్స్యేంద్రనాధుఁడును నూయెలపైఁ గూర్చుండియుండిరి. వారి చుట్టును పెక్కుమంది నాట్యము సల్పుచుండిరి. ఒకెక్కడ కొందఱు నవమోహనాంగులగు సుందరీమణులు పాటలఁ

బాడుచుండిరి. మఱొకచో వసంతముఁ జల్లుకొనుచుండిరి. వేషధారులు రాణీముందుఁ దమకౌశలము చూపసాగిరి. గోరక్షులు వేషధారుల గానమునకుఁ దగినట్లు మృదంగము వాయించుచుఁ దనరాక గురువారే ణ్యునకుఁ దెలియునట్లు "దోషయుక్తం స్త్రీచిత్తం, రాగకందంతవ చిత్తం" అని ధ్వనించునట్లు వాయింపఁదొడఁగెను. ఆ వాద్యము సుపరి చితమైన దగుటచే మత్స్యేంద్రనాథుఁడు కలవరపడిలేచి, అటునిటు చూచి "ఏడీ! గోరక్షా! గోరక్షా!" అనెను. మత్స్యేంద్రుని పలు కుల నాలకించి, తిలోతల "నాథా! అదియేమి! ఇచ్చటికెవ్వరును రాలేదే? గోరక్షులెవ్వరు?" అని ఆవేగముతోఁ బ్రశ్నించెను.

గోరక్షనాథుఁడు నిజరూపమునుబొంది, మత్స్యేంద్రనాథులకు సాష్టాంగదండప్రణామ మాచరించెను. మత్స్యేంద్రనాథుఁడు, గోర క్షులఁగౌగిలించికొని "ప్రేయసీ! ఈతఁడు నాప్రియశిష్యుఁడు గోర క్షనాథుఁడు" అనిచెప్పెను. గోరక్షులు తిలోతలకుఁగూడ నమస్క రించెను. తిలోతలలేని సమయమునకు వేచియుండి గోరక్షనాథుఁడు "స్వామీ! తాము ఆశ్రమమువీడివచ్చి చాలకాలమైనది. రండు. ఇంకపోవుదము" అనఁగా, నాయోగీంద్రుఁడు "గోరక్షనాథా! నాకు తిలోతలయందు జన్మించినపుత్రునిపై గాటమగు మమకారమున్నది. నేనప్పుడే తిలోతలనువీడిరాజాలను. కొన్నిదినము లిచ్చటనేయుండుము" అనెను. గురునాథునికోరిక నిరాకరింపఁజాలక యచ్చటనే గోరక్షనాథు డుండిపోయెను.

దినములు గడచిపోవుచుండెను. మత్స్యేంద్రనాథునిచిత్తము విషయాసక్తమై యుండెనేగాని, పూర్వాశ్రమస్వీకారసూచనలెవ్వియుఁ గానరానందున గోరక్షులు దిగులొంది యొకనాఁడు "గురుమహారాజ్! మీరిట్లు మోహపాశబద్ధులై యుండుటన్యాయమా? అయ్యయో!

ఎంతవిచిత్రముగా మీరీ వలపనెడి మాయాజాలమునఁ జిక్కుకొన్నారు ? ” అనెను. మత్స్యేంద్రనాథుఁ డాలోచనాధీనుఁడై “ గోరక్షా! ఈమోహపాశమునుండి విడుదలయైవచ్చుటకుఁ బ్రబలమగు దుఃఖకారణముండవలెను. నాకుమారునిఁజంపుము. అప్పుడైన నాహృదయము విముఖతనొందునేమో ” యనెను.

గోరక్షనాథుఁడు మెల్లగా నాకుమారునిజేరఁదీసి, యుద్యానవనములోనికాసారమునఁ ద్రోసివైచెను. తిలోత్తల “ నాకుమారుడేఁడీ?” యని వెదకికొనుచుండఁగా, గోరక్షనాథుఁ డామెను, మత్స్యేంద్రనాథుని దీసికొనివెళ్లి “ అమ్మా ! నీకుమారుఁడిందు మునిఁగిపోయినాఁడు ” అని మృతకళేబరమును పైకిఁదీసిచూపెను. తిలోత్తల రోదనసీకుహరము మాఱ్ఱ్మోగునట్లు విలపింపసాగెను. మత్స్యేంద్రనాథుఁడుకూడ మేర మీరినదుఃఖమునొందెను. “ ఎట్లుమునిగిపోయె ? ” నని తిలోత్తల యడుగ, గోరక్షులు “ నేనే కాసారమునఁద్రోసివైచినా ” ననిబదులు చెప్పెను. “ అయ్యయో ! నాకుమారునిఁజంపుటధర్మమా ? ” యని తిలోత్తలదీనముగానేడ్చుచుపలుక గోరక్షనాథుఁడు “ అమ్మా ! ఇదుగో నీతనయు ” డని మంత్రాక్షరముల నుచ్చరించి, యాబాలుని సజీవునిగ నొనరించి, యామెకానందముఁగొలిపెను. గోరక్షులు “ మత్స్యేంద్రనాథా ! సద్గురువర్యా ! మీరిప్పుడైననాతో వచ్చెదరా లేదా ? ” యని ప్రశ్నింప, మత్స్యేంద్రుఁడు తిలోత్తలనుజూచి “ సతీమణీ ! నేనింకను నిచ్చటనున్నచో నెన్నియోని విపరీతములు సంభవింపవచ్చును. కావున, బోయివచ్చెదను ” అనెను. తిలోత్తలయు విచారముపొంది, విధిలేక యందులకుసమ్మతించి, కొంతబంగారమును మార్గవ్యయమునకై యొసంగెను.

ఇరువురునుగలిసి, యొకసాంద్రారణ్యమునుండి పోవుచుండగా నొకకొలనుగాన్పించెను. “ గోరక్షనాథా ! దాహముబాధ మిక్కుట

ముగనున్నది. ఆసరోవరముకడకరిగి, సలిలముల గ్రోలివత్తును" అని పలికి మత్స్యేంద్రనాథుఁ డటకరిగియున్నతఱిని గోరక్షులు గురువర్యుల జోలెయందున్న బంగారమునుజూచి, నదిలోబడునట్లు గిరవాటువైచెను. మత్స్యేంద్రనాథుడు తిరిగివచ్చి, జోలెలోబంగారము లేకుండుటచూచి, "ఇదియేమిగోరక్షా! ఇందలి కాంచనమేమిచేసితివి?" అని ప్రశ్నించెను.

"మహాత్మా! మనకు స్వర్ణమెందులకు? మీరింకను విభ్రాంతులై యున్నారేమిపాపము? నేనే ఆనదియందు పాఱవైచితిని. మీకు వలయునేని అటుచూడుడు. ఆపర్వతమంతయు కాంచనమయమె. వలయునంత గొనితెచ్చుకొనుఁడు". అని గోరక్షులుపలుక "ఆహా నేనింకను మాయలోనే మునిగియున్నానా?" అని మత్స్యేంద్రనాథుఁడుపచించి, యదృశ్యుడయ్యెను. గోరక్షనాథుఁడు దిగ్భ్రాంతుడై "అయ్యో! గురుపరేణ్యుఁడు మఱలతిలోత్తలకడకుఁ బోయెనేమో" యని సంశయించుచు, నాశ్రమముకడకరిగెను. శిష్యులనుజూచి "గురుమహారాజరుదెంచెనా?" యని గోరక్షులు ప్రశ్నింప, వారందఱు నవ్వి హేళనచేయసాగిరి. అతఁడు లోనికేగిచూడగా మత్స్యేంద్రనాథుఁడు సమాధిలోనుండెను. మత్స్యేంద్రుడు కనులుతెఱచి చూచినంతనే గోరక్షుఁడు "స్వామీ! తామిచ్చటికివచ్చి ఎంతసేపైన?" దని ప్రశ్నింప, మత్స్యేంద్రనాథుఁడు మందహాసముచేసి "గోరక్షా! నేనెచ్చటకునుబోలేదు. ఇచ్చటనేయున్నాను. మాయయనఁగా నేమి యని నీవడిగియుంటివికదా! నీవింతవఱకును జూచినదియేమాయ" అని బదులుచెప్పెను. గోరక్షనాథుఁ డాశ్చర్యాన్వితస్వాంతుఁడాయెను.

---

# 16 నీళోబా.

బాల్యమునుండియు భక్తియే పరిమావధిగాఁగల నీళోబా 'భీమ' నగరమున నివసించుచుండెను. ఆతఁడు నిరంతరము పాండురంగ చరణారవిందములఁ గొల్చుచు, దానధర్మములఁ జేయుచు, సత్కార్యాచరణ పరతంత్రుఁడై, పవిత్రహృదయుఁడై కాలము గడపుచుండెను. ఇట్లుండఁగా, నాతని దుహితవివాహోచిత మగు ప్రాయమునొందెను. ఆతఁడు వరునన్వేషించి, వివాహముహూర్తము నిర్ణయించి, బంధుమిత్రుల నెల్లర నాహ్వానించెను. ఆతనిభార్య "నాథా ! మీరు మన బంధువులందఱను, మిత్రులనుగూడ నాహ్వానించుచున్నారే. మనము దారిద్ర్యపీడితులమైయుండి, యిందఱనెట్లు సత్కరింపఁగలము ? మీరు సంపాదించియుంచిన సంభారములు కొలఁదిమందిని మాత్రమే సత్కరింపఁజాలినవై యున్నవిగదా" యనెను.

నీళోబా "సతీమణీ ! ఏల బేలవలె మాట్లాడెదవు ? సకల లోకాధినాథుఁడు, సకలమునీంద్ర వందితుఁడునగు పాండురంగఁడు మన యిలవేల్పై యుండఁగా, మనకులోపమేమి ? మనము మన తనయ వివాహమున నొకరి నాహ్వానించి, మఱియొకరి నాహ్వానింపనిచో నెట్లుండును ? అదిగాక వచ్చినవారికి భోజనమిడుటకు సంశయించినచో నెంత నగుబాటు ? మనము ప్రయత్నించినను, సంభారములు విశేషముగ లభించునా ? ప్రయత్నముఁ జేయకయే భగవత్కృపావిశేషమున సఫలీకృతమనోరథులగు వారెంతమందిని మనము చూచుటలేదు. పాండురంగఁడు భక్తపరాధీనుఁడు. ఆ పరంధాముడే తమ సర్వస్వము నని విశ్వసించిన వారలనందఱ నాతఁడు రక్షించియే యున్నాఁడు. తొల్లి ద్రౌపదిని క్రూరుఁడగు దుశ్శాసనుఁడు వలువలనొలిచి మానహాని కలి

గింపఁబోయిన యవసరమున నా యఖిలలోకాధారుఁడగు రాధాకాం తుఁడు రక్షింపలేదా? మన భారమంతయు నా దయామూర్తియే వహించియున్నాఁడు” యని పలికెను.

వివాహము రేపు జరుగుననఁగా నొక బీద బ్రాహ్మణుఁడు నీళోబా గృహమునకువచ్చి, తన యుత్తరీయపు కొంగున ముడివైచు కొనియున్న బియ్యము, పప్పు, నుప్పు మున్నగువాని నటనుంచి “ఆర్యా! నీళోబా! వీనినిఁగైకొని, క్షుధాతురుఁడనై యున్న నాకీ పూట భోజనమిడ కోరెద” ననెను. నీళోబా “ఓ బ్రాహ్మణోత్తమా! రేపే మాయింట వివాహమహోత్సవము జరుగనైయున్నది. అనేకులీ రాత్రి వత్తురు. వారితోఁబాటు నీవును భోజనము చేయవచ్చును. నీవు తెచ్చిన పదార్థములు నీకడనే యుంచుకొను” మనెను—

“అయ్యా! నామాటవిని, యివి స్వీకరించిననే మీయింట భుజింతును. అదియుఁగాక మీయింట వివాహమనుచున్నారు. నేను పాకశాస్త్ర ప్రవీణుఁడను. మీకు సాహాయ్యముఁ జేయఁదలంచినా” నని యా బ్రాహ్మణుఁడుపలికి, నీళోబా భార్యచేతికిఁ దానుగొనివచ్చిన పదార్థములొసంగి, “మీయింటిలోని బియ్యములో నీ బియ్యము, నుప్పులో నీయుప్పు, పప్పులో నీపప్పు కలుపు” మనెను.

మఱునాఁడు సలక్షణముగ వివాహము జరిగెను. అనుకొన్న సంఖ్యకంటె పెక్కుమంది భోజనమునకు వచ్చిరి. దారిద్ర్యము నిరంతరము ననుభవించు నీ నీళోబా యెట్టులిందఱకు భోజనముఁ బెట్టి తప్పులఁ జేయునో చూడదలంచి, కొందఱువచ్చిరి. బ్రాహ్మణుఁడు పంచభక్ష్య పరమాన్నసహితమైన భోజనముచే వచ్చినవారినెల్లర సంతృప్తచిత్తులఁ గావించెను. తాను సేకరించిన పదార్థములు నిజముగా నానాఁడు

భోజనమునకై వచ్చినవారిలోఁ బదవవంతునకైన సరిపడియుండవని యెఱింగిన సీబోబా "ఇన్ని పదార్థము లెటనుండి లభ్యమైన ?" వని యాశ్చర్యము నొందుచుండెను. ఆ బ్రాహ్మణుఁడు సీబోబాబంధుగుల కమూల్యవస్త్రముల నిచ్చెను. కుమార్తెకు దివ్యాభరణముల నొసంగెను. వివాహానంతరము బంధుజనులను సీబోబా వీడ్కొలిపి, "ఆహా ! ఈ బ్రాహ్మణుని ప్రవర్తన మతివిచిత్రముగనున్నది. ఈతనిని నెట్లయిన బహూకరించి పంపవలయు" నని తలంచుచు నింటికినచ్చి "ఆ బ్రాహ్మణుఁడేఁడీ ?" యనెను.

ఆ బ్రాహ్మణుఁడు కాన్పించలేదు. "అతఁడు నిజముగా పండరి నాథుఁడే. నిజము. తదన్యులేరును గారు. ముమ్మాటికిని సత్య" మని, పాండురంగని పలువిధముల సీబోబాస్తుతించెను. ఇప్పటికిని యా నగరమున ఫాల్గుణమున పాండురంగ విఠలునకు మహావైభవముగ నుత్సవములఁ జేయుదురు.



# 17 హరిదాసు.



వంగదేశమునం దంతటను తనకీర్తిచంద్రికల బహుళవ్యాప్త మొనరించిన శ్రీకృష్ణచైతన్యుని శిష్యుఁడీహరిదాసు. ఈతఁ డస్పృశ్య జాతియం దుద్భవించెను. ఇప్పటికిని వంగదేశమున నీతనిని బ్రహ్మ చారి హరిదాసనిగూడ ననుచుందురు. 15 వ శతాబ్దారంభమున నీ హరి దాసు జెస్సూరుజిల్లాలోని బరాను అనుగ్రామమున జన్మించెను. చిన్న తనమునుండియు నాతఁ డేకాంతముననే నివసింప నభిలషించుచుండెను. ఆతఁడు తానునివసించు కుటీరముచుట్టును తులసిమొక్కల నెన్నింటినో నాఁటెను. పరాత్పరు నాతఁ డెన్నోవిధములఁ బూజించి, యేకాగ్ర చిత్తము నలవఱచుకొనెను. భక్తిచే నాతఁ డనేకులరోగముల నివృత్తిఁ జేసెను. కొంతకాలము గడచెను. హరిదాసు తన గ్రామమునుండి, ఫూలియాగ్రామమున నివసింపసాగెను.

హరిదాసు మహాభక్తుఁడగు శ్రీకృష్ణచైతన్యుని ఖ్యాతిని ఫూలియగ్రామమున నుండఁగనే యాకర్ణించెను. చైతన్యునిఁ గలిసి కొను తలంపుతో నాతఁడు నాడియాకు బయలుదేఱెను. అంతకు మున్నే చైతన్యుఁడుకూడ హరిదాసునుగూర్చి వినియుండెను. తా నస్పృశ్య కులోద్భూతుఁడగుటచే హరిదాసు దూరమునుండియే, చైత న్యుని భక్తిమూర్తినిఁగాంచి, సాష్టాంగదండప్రణామ మొనరించెను. హరిదాసును శ్రీకృష్ణచైతన్యుఁడు ప్రేమమీఱ నాలింగన మొనరించు కొనెను. "భక్తికి జాతిమతభేదము లేదు. పరమాత్ముని దృష్టిలో మన మందఱమును సమానములే" యని, చైతన్యుఁడు హరిదాసును గూడ తన శిష్యవర్గమునఁ జేర్చుకొనెను.

చైతన్యస్వామి పూరిలోనే నివసించుటకు నిశ్చయించిన పిదప, హరిదా సచటికేగెను. ఆతని రాకనుగూర్చివిని, చైతన్యుఁ డీవలికివచ్చి, జగన్నాథ సంస్మరణమునఁ దన్మయుఁడై యున్న హరిదాసును గాంచి, యానందాతిరేకమున నాలింగన మొనరించుకొనియెను. హరిదా సులికి పడి "స్వామీ ! నే నస్పృశ్యుఁడనని మఱచితిరా ?" యనెను.

"నాకు అస్పృశ్యుఁడను భేదభావములేదు. నీవు నిర్మలహృద యుఁడవై యా లక్ష్మీకాంతుని భజించి, భక్తాగ్రగణ్యుఁడవైతివి. దివ్య స్థలసందర్శనమున, పరమపవిత్రములగు నదులందు గ్రుంకులిడుటవలన, దానధర్మములఁ జేయుటవలనఁ గలుగుపుణ్యము నీ వతిసులభముగ భక్తిసూత్రముచేఁ బొందినావు. ధన్యుఁడవు. పరమపవిత్ర చరిత్రుఁ డవు. కావుననే నిన్ను స్పృశించుచున్నాను." అని పలికి, తాను వసించు తోఁటలోని యొకకుటీరమున నివసించుమని చెప్పెను. చైత న్యుని శిష్యులు భగవన్నివేదితమగు ప్రసాదమును దెచ్చియిచ్చిరి.

హరిదాసు జగన్నాథు నెట్లు పూజించుచుండెనో, తన గురు వరేణ్యుఁడగు చైతన్యునిగూడ నట్లే పూజసేయుచుండెను. హరిదాసు ప్రజలచే నేవిధముగను బాధింపఁబడలేదు. చైతన్యుని సిద్ధాంతముల నాతఁడు ప్రచారము సేయుచుండెను. ఆతని యుపదేశముల ననుస రించి, ప్రవర్తించుచుండెను. తా నస్పృశ్యకుల సంజాతుఁడనను మాట మఱువక హరిదాసు, వినయవిధేయతలు గలిగి మెలఁగుచుండెను. చైతన్యుని శిష్యులందఱును బ్రసాదమును స్వీకరించిన పిదపనే యాతఁడు ప్రసాదము స్వీకరించుచుండెను.

ఈ విధముగా నతిపవిత్రమైన జీవితముగడపి హరిదాసు క్రీ.శ. ౧౫౩౩ సం॥రమునఁ గాలధర్మము నొందెను. ఆ సంవత్సరముననే శ్రీకృష్ణచైతన్యుఁడు కూడ బ్రహ్మైక్యము నొందెను.

# 18 గోమాబాయి.

——0:——

గోమాబాయి నిరుపేదయగు వితంతువు. ఆమె సుశీలయై నిరంతర హరిభజనాసక్తయై కాలముగడపుచుండెను. పాపమామె భిక్షమెత్తుకొని జీవించుచుండెను. ఇట్లుండఁగా పండరిపురమునఁ బాండురంగనికి ఉత్సవములఁజేయు దినములు తటస్థమయ్యెను. ఆమె యా యుత్సవములఁ జూచుతలంపుతో పండరిపురమునకు బయలుదేఱి, సాయంసమయ మగుసరికి భీమానది యావలితీరమునకు వచ్చెను. నావవానిం జూచి, యామె నదిదాఁటించుమని కోరెను. అతఁడు "డబ్బిచ్చినచో దాఁటింతు" ననెను. "అయ్యా! నాకడ నెట్టినియేగాణియైన లేదు. కొంచెము పిండియున్నది. అదియిచ్చెద" నని యామెపలికెను. "ధనమిచ్చినఁగాని, నదినిదాటింపఁజాల" నని కచ్చితముగ యా నావికుఁడు పలికెను. ఆ నావికుఁడు నావను ద్రోసికొనిపోయెను. చీఁకటిపడెను. ఆమె యేకాకియై భయకంపితయై యుండెను. విచారభరితాంతరంగయై యామె "హే కృపానిధే! పాండురంగా! శబ్దస్పర్శరూపరసగంధాదుల కాశ్రయుఁడవై యుండు నీ కనేకవందనములఁ జేయుదును. నన్నుఁ గరుణింపుము. గజేంద్రుని సంరక్షింపఁ జక్రమంపిన దయానిధివిగావా? భవార్ణవమునుండి నేను తరించునట్లు చేయుము." అని వివిధములఁ బ్రార్థించెను.

పండరినాథుఁడు నావికునివలె నౌకను ద్రోసికొనివచ్చి "అమ్మా! పండరికిఁబోవనెంచిన ట్లగుపడుచున్నది. నా నావనెక్కుము. అవ్వలితీరమును జేర్చెద" ననినాఁడు ఆపె "అయ్యా! నాకడ నొక్కకాసైనలేదు. ఈ పిండిమాత్ర మున్నది. దీనినిగైకొని, నన్నావలియొడ్డు చేర్చుము. ఇదియే నాకోరిక" యనెను—సర్వేశ్వరుఁ

" దమ్మా ! ఆ పిండి నాకువలదు. నిఱుపేదలకు సేవఁజేయుటయే నాపని. ఆపిండి నేయతిథికైన నీయనగునుగాదా ? " యని, యామెను నావపై నెక్కించుకొని యవ్వలియొడ్డు చేర్చెను.

ఆమె పండరీపురముఁజేరి, పాండురంగని మహోత్సవమునందుఁ బాల్గొని మఱునాఁడాపిండి నే యతిథికైన నిచ్చుట కుద్దేశించి, యాల యమునసే కూర్చుండెను. మిట్టమధ్యాహ్నమ్మయెను. 'ఎవ్వరును యీాపిండిని గైకొనుటకు రారే ' యని యామె విచారభరితాంత రంగయై కూర్చుండెను. పాండురంగవిఠ లంతట బ్రాహ్మణ రూపమున నచ్చి, యాపిండినిగైకొని, రొట్టెలుగాఁ గాల్చి తయారుచేసి, కొన్నిఁ టిని భుజించి " గోమాబాయీా ! నీవు ధన్యవైతి " వనిపలికి, యంత ర్థానము నొందెను. భూసురరూపమున నేతెంచినది పండరినాథుఁడే యని తెలిసికొని, మహదానందమునొంది తన గ్రామమునకుఁ బోయెను.



# 19 వీసోబా.

—:o:—

పండరీపురమున వీసోబాయను వణిజుఁడు నివసించుచుండెను. ఆతఁ డనవరతము పండరీనాథునిఁ గొల్చుచు, భక్తాగ్రగణ్యుఁడను ఖ్యాతివహించెను. ఆ వణిక్శ్రేష్ఠుని భార్యయు సుగుణాలవాలయై, పతి చెప్పినచొప్పున వర్తించుచు, పతిభక్తిలో నగ్రగణ్యయని కీర్తిగాంచెను. భగవత్కారుణావిశేషమున నీ దంపతులకు సకలసద్గుణసంశోభితులగు నల్వురు కుమారులు జన్మించిరి. ఇట్లుండఁగా దేశమున మహాక్షామము సంభవించెను. వీసోబా క్షుత్పీడితులై యరుదెంచువారికి భోజన మిడుచుండెను. అనేకు లీవార్తవిని వీసోబా గృహంబున కేగుచుండిరి. వారి నందఱను బూజించుచు వీసోబా నిరతాన్నదానము సేయుచుండెను. కొంతకాల మిట్లుగడచెను. వీసోబా దారిద్ర్యానలమున భస్మీభూతుఁ డాయెను. అంతకుమున్నాతఁ డొక వడ్డీవ్యాపారస్థునికడ కొంతధనము ఋణముఁ గొనియుండెను. ఆ ఋణముఁ దీర్చుమని యా వ్యాపారస్థుఁడు తొందరచేయక యూరకుండెను. విసోబా యైశ్వర్యముఁ గోల్పోయినాఁడని, దారిద్ర్యానలమున కింధనమైనాఁడని విని, తొందరపడి పండరిపురమునకు వచ్చి "వీసోబా! నాకు ధన మత్యవసరమైయున్నది. కావున నెట్లయినా నా ఋణద్రవ్యము నిపుడీయఁ గోరెద" నని పలికెను.

వీసోబా "అయ్యా! నాకడ నిపుడు దమ్మిడీయైనను లేదు. నా భాగ్యమంతయు నిఱుపేదలగు దీనులకై వెచ్చించితిని. నీధనము నీకుఁ దప్పకయిచ్చెదను. ఋణ మెగబెట్టినవానికి గతులు లేవందురు. వారము దినములలో నీబాకీ తీర్చెదను. నామాటనమ్ము" మని నచ్చబలికెను. ఆ వ్యాపారస్థుఁడు "వీసోబా! నీవు సత్యవాక్పరిపాలకుఁడవని యెఱుం

గుదును. అయినను, నిర్ధనుఁడవై యుండుటచే నీవాక్యముల విశ్వసింపఁ జాలకున్నాను. అయినను, నీవుకోరిన గడువిచ్చితిని. అన్నప్రకారము వారము దినములలో ఋణధన మంతయుఁ జెల్లింపు" మని వెడలిపోయి, యాయూరిలోని యితరవర్తకులను సమీపించి, "ఆర్యులారా! వీసోబా నా కయిదునూర్లు రూప్యములు బాకీయున్నాఁడు. చూడఁ జూడ నాతఁడు పేదవాఁడై యున్నాఁడు. వారముదినములు దాఁటకుండ ఋణముఁ దీర్చెదననుచున్నాఁడు. ఈ మాటలు విశ్వసింపఁదగిన వేనా?" యని యడిగెను.

ఆ వర్తకు "లయ్యా! ఆతఁడు సత్యసంధుఁడు. మహాభక్తుఁడు. ఆతఁ డాడినమాట నెన్నఁడును దప్పువాఁడుకాఁడు. నీవు నిశ్చింతుఁడవై మీ గ్రామమున కేగనగు" ననిరి. ఆఱు దినములు గడచిపోయెను. మఱుచటిదినముతో గడువు చెల్లిపోవును. వీసోబావ్యధితాత్ముఁడయ్యెను. "అయ్యో! ఆ వడ్డీవ్యాపారస్థునితో నట్లుచెప్పి, ఱేపటిలోపుగాఁ బంపకున్నచో నన్నృతవాది నగుదునుగదా, ఏమిచేయుదును? నా కేదిదారి?" యని పలువిధములఁ బరితపించెను.

పాండురంగేశుఁడు భక్తుఁడగు వీసోబా యావేదనముఁ గాంచుచునేయుండెను. వీసోబా మిత్రునివలె నాతఁడు వేసముదాల్చి, యావడ్డీవ్యాపారస్థునికడ కరగి, "అయ్యా! నామిత్రుఁడగు వీసోబా నీకీయవలసిన యైదునూర్లు రూప్యములును నివిగో స్వీకరించి, యాతఁడు నీకు వ్రాసియిచ్చిన ఋణపత్రము ని" మ్మనెను. ఆ ధనముఁ దీసికొని యా వ్యాపారస్థుఁడు వీసోబా ఋణపత్రము నొసంగెను. ఆపత్రమును దీసికొని పాండురంగఁడు వెడలిపోయెను.

వీసోబా విషాదవేదనావిదళితమానసుఁడై మఱునాఁటి యుదయమున స్నానాంతరము భాగవతగ్రంథమును బారాయణము చేయు

టకై యీవలికిఁదీసెను. అందులోఁ దానా వడ్డీవ్యాపారస్థునకు వ్రాసి యిచ్చిన ఋణపత్రముండెను. అదియంతయు పండరినాథుని కటాక్ష మహిమమేయని గ్రహించి "హే ప్రభూ! నాయెడ నిర్హేతుక కటాక్షముఁ గలిగియున్నందుల కెంతయుఁ గృతజ్ఞుఁడ" నని యానంద బాష్పపూరితలోచనుఁ డయ్యెను. జీవితశేషమంతయుఁ బాండురంగ పదధ్యానముననే గడపి; వీసోబా శాశ్వతానందప్రదమగు వైకుంఠమును జేరెను.

---

# 20 కబీర్ దాసు.

గంగానదీతీరమున నొక కుగ్రామములో తమాల్ మోఖీం అను మహమ్మదీయకులస్థుఁడు నివసించుచుండెను. ఆతఁడు బట్టలనేసి, విక్రయించుకొను వృత్తిలోనుండెను. ఆతఁ డొకనాఁడు నదిలో స్నానముఁ జేయుచుండెను. ఒక ముత్యపుఁజిప్ప మెల్లగా కొట్టుకొని వచ్చుచుండెను. ఆ ముత్యపుఁజిప్పలో నత్యంతసుందరమగు శిశువునాతఁడు కాంచి, "సంతానహీనుఁడనగు నానోములు నేఁటికి ఫలించినవి. పరమాత్ముఁడు నన్నుకటాక్షించినాఁడు" అని తలపోసి మహదానందభరితాంతఃకరణుఁడై, యింటికేగి భార్యకొసంగెను. ఆ దంపతు లాశిశువునకుఁ గబీరని పేరుపెట్టి, మిక్కిలి గారాబముతోఁ బెంచుకొనసాగిరి. శుక్లపక్ష క్షపాకరునిమాడ్కి కబీరు పెద్దవాఁడయ్యెను. సజ్జనసాంగత్యము, భక్తి, సత్యవాక్పరిపాలనము, భూతదయాపరత్వము కబీరు

లోని గుణములయ్యెను. ఆతఁడు తురుష్కునిచేఁ బెంచఁబడినను, శ్రీరామచంద్రునే నిరంతరము సేవించుచుండెను. కబీరు జననీజనకులు వృద్ధులైరి. కబీరే వారలఁ బోషింపవలసినవాఁ డాయెను. ఆతఁడు వస్త్రములనేయుచు, శ్రీ రామచంద్ర నామసంస్మరణ మొనరించుచుం డెను. ఆతఁ డొకొక్కపుడు తన్మయుఁ డగుచుండెను.

అట్లు తన్మయుఁ డగునపుడు తల్లి "ఏమిరా నాయనా! వస్త్రములు నేయక యూరక కూర్చుండినచోఁ దిండియెట్లు లభ్యమగునురా?" అని హెచ్చరించుచుండెను. అప్పుడాతఁడు మఱల నేత కుపక్రమించుచుండెను. ఒకనాఁటి యుదయమున నతఁ డావస్త్రమును నేఁత పూర్తిచేసినపిదప యంగడివీధికిఁ గొంపోయెను. అంగడి వీధిలో నొకచోట కూర్చుండి, యాతఁడు శ్రీరామపదధ్యాన మగ్నుఁడై యుండెను. ఈతని భక్తిని పరీక్షింపనెంచి, శ్రీరామచంద్రుఁ డొక పేదపాఱుని వేసమునవచ్చి "మహాశయా! నేను జలిచే మిక్కిలి బాధ పడుచున్నాను. నాకేదైన వస్త్రమిమ్ము" అనెను. కబీరు, ఆ బ్రాహ్మణుని దుస్థితికి జాలినొంది, తనకడనున్న వస్త్రములో సగము చింపి యిచ్చెను. శ్రీరామచంద్రుఁ డాసగమును గొంపోయి, మఱొక వేస మునవచ్చి, తక్కిన యర్థభాగమును గూడ దానపూర్వకముగఁ గొంపోయెను. శ్రీరాముఁ డంత కబీరుదాసు తల్లికడకుఁ బ్రచ్ఛన్నరూపమునఁబోయి "అమ్మా! నీకుమారుఁడు కబీరుదాసు నేసినవస్త్రము నేరికిని విక్రయింపక దానముగ నిర్వ్వరకొసంగి, ధ్యాస నిమగ్నుఁడై యొకచోఁ గూర్చుండియున్నాఁ" డని చెప్పెను. ఆమె కోపోద్రిక్తయై, బయలుదేఱి, తన కుమారుఁ డున్నయెడకేగి, క్రోధావేశపరవశయై యొక కఱ్ఱతో మోదెను.

భక్తిచేఁ దన్మయుఁడై యుండిన కబీరుదాసా దెబ్బ తగిలినట్లు గాని, బాధ కలిగినట్లుగాని, సూచింపఁడాయెను. మాఱువేషమున

నున్న శ్రీరామచంద్రునకే యాదెబ్బ తగిలెను. రాఘవుఁ డంత సీతా సమేతముగ కబీరునకు సాక్షాత్కరించి, యాతనిని ధన్యునిఁగావించెను. కబీ రాతని తల్లినిఁజూచి "అమ్మా! నీజన్మ చరితార్థతఁగాంచినది. మహాభక్తశిఖామణి యగు పుత్రునిఁ గాంచితివి" అని, దాశరథి పలుకగా నామె కుమారునితోఁ గలిసి, యానందపరవశయై, నిజ గృహోన్ముఖ యాయెను.

---

# 21 కమాల్ దాసు.

కబీరుదాసు భార్యకూడ భర్త యభిప్రాయానుసారముగ మెలంగుచుండెను. దైవానుగ్రహమున నామె గర్భవతియై, నవమా సములు గడచినపిమ్మట శుభదినంబున నొక మగశిశువును గాంచెను. ఆ శిశువునకు కబీరు, కమాల్ అని పేరిడెను. కమాల్ దినదినప్రవర్ధ మానుఁడై, తండ్రివలెనే భక్తియుక్తుఁడై కాలముఁ గడపసాగెను. పది సంవత్సరముల ప్రాయముగలవాఁడై నపుడు తీర్థయాత్రలు సేయ నిశ్చయించి, తండ్రితోఁ జెప్పెను. కుమారుని భక్తితాత్పర్యముల కెంతయు సంతసించి, "నాయనా! అట్లే పోయిరమ్ము. నీకు శుభం బగుఁగాక" యని దీవించెను.

శ్రీరామనామ సంకీర్తన మొనరించుచు కమాల్ వెడలుచుండ ప్రతిగ్రామములోను జనులందఱును విశేషముగ గౌరవించుచుండిరి. అనేక పుణ్యస్థలముల సందర్శించి, కమాల్ దాసు హరిద్వారమునకుఁ

బోయెను. అటనొక భాగ్యశాలి, కమాల్ నాదరించి, యాతనికి ధనము నిచ్చెను. కమాల్ వలదని నిరాకరించెను. ఆ ధనాఢ్యుఁడు కమాల్ దాసునకుఁ దెలియకుండ యాధనము నాతని కొంగునఁగట్టెను. కమాల్ దాసు చేయునదిలేక యింటికివెడలెను. తండ్రితో నతఁడా వృత్తాంతముఁ జెప్పెను. వెంటనే యాతఁడు మూర్ఛాక్రాంతుఁ డాయెను. కబీరు భార్య కూడ కంగారుపడియెను. ఆతఁడు మూర్ఛనుండి తేరుకొని "నాయనా! కమాల్! ఆధనమును వెంటనే యెవరిచ్చిరో, వారి కిచ్చిరమ్ము". అని పంపెను. కమాల్ వెంటనే బయలుదేఱి, యా ధనము తన కెవరొసంగిరో, ఆతని కొసఁగి, తిరిగివచ్చెను.

తండ్రికుమారు లిరువురు ననుదినము రామభజనసేయుచుండిరి. ఒకనాఁడు వారిగృహమున కతిథులు వచ్చిరి. ఆ సమయమున కబీరు దా సింటిలో నేమియు లేకుండెను. కమాల్ దాసు "తండ్రీ! వచ్చిన యతిథులను సత్కరింపకుండుట మహాపాతకము. అతిథి సత్కారము సందర్భమున ద్రవ్యాపహారణ మొనరించినను పాపము సంభవింపదు. కావున నెచటనైన చౌర్యముఁజేసియైన యీ యతిథులకు భోజన మిడవలయు" ననెను.

చేయునదిలేక కబీరందులకు సమ్మతించి, యొక ధనికుఁడగు వణిజు నింటికేఁజనెను. కబీరు కన్నముఁ ద్రవ్వెను. కమాల్ లోనఁ బ్రవేశించి, కొంతధనమును, యితర సంబారములను గొనివచ్చి, తండ్రి కిచ్చెను. తా నట్లు తనదారి నేగినచో నింకను జోరులు లోనఁజొరఁ బడి, యావణిజుని భాగ్యము నపహరింతురని భయపడి కమాల్ మఱల లోనఁ బ్రవేశించి, యొక కేకపెట్టి మఱల నీవలికి వచ్చుటకై కన్నమునఁ జొచ్చెను. కమాల్ సగ మీవలికి వచ్చుసరి కా వర్తకుఁడు పరుగు పరుగునవచ్చి, కమాల్ పాదముఁబట్టికొని, లోని కీడ్వఁజొచ్చెను.

కబీరుదాసు నిర్విణ్ణుఁడయ్యెను. కమాల్‌లోనుండి "నాయనా! త్వరపడి, నేఁ జెప్పినట్లు చేయుము. లోకులు నన్నుఁజూచిన యెడల, భక్తులందఱును చోరులు, వంచకులునని నిందింతురు. కావున, నా శిరస్సును నఱికి గొనిపొమ్ము. అచట మనకొఱకై యతిథులు వేచియుందురు. వారిని సత్కరింపుము." అనెను. కబీరు యోచించెను. లోపలి నుండి వర్తకుఁడు కేక లిడుచుండెను. పదిమంది యచటికి వచ్చినచో నల్లరి యగునే యని సందేహించెను. వెనువెంటనే మనస్సున దృఢపఱచుకొని, కబీరు కుమారుని శిరమును ఖండించి, గొనిపోయెను. ఆతఁడు భార్యతో జరిగినదంతయుఁ జెప్పి, కన్నీరు విడిచెను. ఆమె కూడ ఖేదమొందియు, నతిథులకు వేళ మించిపోవుచుండుటచే, భర్త తీసికొని వచ్చిన పదార్థముల వండి, యా యతిథుల సత్కరించెను.

కమాల్ మొండెమే వర్తకునకుఁ జిక్కినది. ఆ మొండెమును గొని యాతఁడు రాజుసముఖమునకుఁ బోయి, ఫిర్యాదు చేసెను. రాజా మొండెమును దుర్గద్వారమునకుఁ గట్టించెను. కబీరుదాసు గృహమున భోజన మొనరించిన ఆ యతిథులు తిరిగి పోవుచుండగా, కమాల్‌దాసు మొండెముచేతులు నమస్కార మొనరించెను. ఆ యతిథు లావింతను జూచి, తమ్మనుసరించి వచ్చుచున్న కబీరుదాసు వలన నెట్టకేలకు జరిగిన యుదంతము నెఱింగి, యా శిరస్సును దెప్పించి, మొండెమునకుఁ జేర్చి "పరమాత్మా! ఈ బాలుఁడు నిరపరాధి. మా కొఱకే యాతఁ డిట్టి పనిచేసెను. ఈతనిని సజీవునిగాఁ జేయఁగోరెద" మని, మనస్ఫూర్తిగ నమస్కార మొనరించిరి. కమాల్‌దాసు పునర్జీవితుఁడాయెను. కబీరుదాసు నితాంతసంతోషతరంగింతాంతరంగుఁడై, కుమారునితో నింటికిఁ జని, భక్తియుక్తుఁడై కాలము గడపసాగెను.

---

# 22 సక్కుబాయి.

—— 0 :——

పండరీపురమున కనతిదూరమున నొకపల్లెలో నొక బ్రాహ్మణుఁడు నివసించుచుండెను ఆ బ్రాహ్మణునకు సద్గుణముల కాలవాలయగు భార్యకలదు. ఆ దంపతులు సంతానముకొఱకై పెక్కువ్రతము లొనరించిరి. తుదకువారి నోముల ఫలంబోయన యొకఁడు శిశువు జన్మించెను. ఆ యాఁడుబిడ్డకు వారు సక్కుబాయి యని నామకరణ మొనరించి, మిగుల గారాబముతోఁ బెంచుకొనసాగిరి. ఇట్లుండఁగా నామె శుక్లపక్షసుధాంశుని పగిది, దినదినప్రవర్ధమానయై వివాహోచితమగు ప్రాయము నొందెను.

ఒకనాఁడొక భూసురుఁడు వారిగృహమునకు వచ్చి "ఆర్యా! మాది పైఠనుపురము. మీయింట సుగుణముల దొంతియగు కన్య యున్నదని వినియుంటిని. ఆ బాలను మా కొమారునకొసంగి, వివాహము సేయఁగోరుటకై వచ్చియున్నా" ననియెను. తమ కుమార్తెయు యుక్తప్రాయయై యున్నందున నెట్లయిన వివాహముసేయుట కర్తవ్యంబని నిశ్చయించుకొని, ముహూర్తము నిశ్చయించి యా బ్రాహ్మణుని వీడ్కొలిపిరి.

శుభదినంబున సక్కుబాయికి వివాహమయ్యెను. మఱికొంత కాలమునకు సక్కుబాయి కాపురమునకు వెళ్లెను. ఆమె బాల్యము నుండియు భక్తపరిపాలకుఁడు, నాశ్రితవత్సలుఁడు నగు శ్రీకృష్ణుని పూజించుచుండెను. ఆమె పూజావిధానము భర్తయగు విశ్వంభరున కిష్టమైనను, నత్తమామల కేమాత్రమును గిట్టకుండెను. వారు నిరంతరము "భక్తి సంసారముచేయు స్త్రీలకు సాధ్యపడునా? భక్తి యెందులకు? సన్యాసులకుఁగాని, యీభజనలు, పూజలు సంసారులకుఁ దగునా?" యని సాధించుచుండిరి.

అత్తమామల నిష్ఠురాలాపముల కోర్చియైనను దీక్షిక యగు నపుడెల్ల నామె శ్రీకృష్ణుని నిశ్చలచిత్తయై ధ్యానించుచునే యుండెను. ఆమె మామగారు గతించెను. అయినను అత్తగారు మాత్రము సాధింపు మానలేదు. అపుడపు డామె సక్కుబాయిని క్రోధావేశపర వశయై శిక్షించుచుండెను. భర్తయగు విశ్వంభరుని కద కష్టముఁ దోఁచి నను, తల్లి నేమియు ననఁజాలక భయపడి యూరకుండెను. ఇరుగుపొరుగు వార లిదిచూచి, సహింపఁజాలక, పెక్కుసారు లాపె యత్తగారితో నట్లు ప్రవర్తించుట చాల తప్పని చెప్పెడివారు. ఎవరెన్ని చెప్పినను, ఆమె విన్నఁగదా ?

ఒకనాడొక యోగి, శ్రీకృష్ణనామసంకీర్తన మొనరించు కొనుచుఁ బోవుచుండెను. ఆ సంకీర్తనము నాలకించి, భక్తిపరవశయై, యీావలికి వచ్చి " మహాత్మా ! తాము సర్వసంగపరిత్యాగులు, భక్తి మీా వదనమండలమునఁ దాండవించుచున్నది. భక్తియన నాకేమియుఁ దెలియని యజ్ఞానురాలను. నాకది యెఱింగించి, పుణ్యము కట్టుకొ " మ్మని ప్రార్థించెను. దయార్ద్రహృదయుఁ డగు నాతఁడు " అమ్మా ! పరమసాధ్వీమణివి. భక్తియన నేమియున్నది ? అవాఙ్మానసగోచరుం డగు నా శ్రీహరిని—ఆ పాండురంగని—పండరినాథుని నిశ్చలహృద యముతో భజించుటయే భక్తి. భక్తియే మోక్షసాధమునకుఁ బ్రథమసోపానము. భక్తిమాత్రముచేతనే విశ్వామిత్ర, వశిష్ఠాగస్త్యాది మహామునులు శ్రీమహావిష్ణు సాన్నిధ్యముఁ జేరగలిగిరి. భక్తియే ప్రహ్లాదునిఁ గాచినది. భక్తియే మకరినోటఁ జిక్కిన కరిని సంరక్షించి నది. నీవుకూడ భక్తియుక్తవై, క్షణకాలమేని యనవసరముగ నేమరి యుండక పాండురంగనిఁగొల్వుము. నీపాపములు పటాపంచలగు"ననెను.

" ధన్యనైతిని. మహాత్మా ! చరితార్థురాలనైతిని. పుణ్య పురుష సందర్శనమున నాచిత్తము సంతోషాయత్తమైన " దని సక్కు

బాయి పలికి, లోనికేగి ఫలములను గొనివచ్చి, యా సన్యాసి కొసంగెను. ఇంతలో నెటనుండియో నామె యత్తగారు శీఘ్రగమనమున వచ్చి "ఏమే? ఇది యేమిపని? నీవు సంసారివికావా? ఈ సన్యాసితో నీకుఁ బనియేమి" యని నాలుగు బుగ్గమీఁద పొడిచి, యాయోగినిఁ జూచి "ఏమిరా పొగరుఁబోతా? ఇది యొక కపటవేషమా? పొట్ట కొఱ కెన్ని వేషములు? అన్నా? ఇంకనుపోక నిలుచుండెదవే?" యని కసరికొట్టి వివిధదుర్భాషల నాడెను.

సక్కుబాయి యా నిందాలాపముల సహింపఁజాలక "అత్తగారూ! దోషము నాయది. ఆ పుణ్యాత్ముఁడు పరమాత్ముఁడగు శ్రీకృష్ణుని భజించుకొనుచుఁ బోవుచుండఁగా, పిలిచినది నేను. ఆయనకుఁ గపటనాటకముఁ బ్రదర్శించు కర్మమేమి? మహాభక్తుల నట్లు నిష్ఠురాలాపములాడి నొప్పించరాదు. మీయిష్టమువచ్చినట్లు నన్ను నుఁ" డనెను—

"ఆహా! అటులనా? దిక్కుమాలిన సన్యాసినేమియు ననరాదేమి? ఆతని నొక్కమాట యన్నచో నీకంతఁ గష్టముతోఁచినదే? ఇంటిలో నత్తగారి కుపచారములు చేయుటకు వీలులేదుగాని, సన్యాసుల సత్కరించుటకుఁ జేయివచ్చినదా? పెద్దదానను నేనుండగా స్వతంత్రురాల వైతివా? నీవు నాయింట నుండుటకుఁ బనికిరావు. పొ" మ్మని యావలకుఁ గెంటివైచెను. ఆ యోగి యేదో చెప్పఁబోవ, నామె లోపలినుండి కఱ్ఱతీసికొనివచ్చి కొట్టఁబోయెను.

భక్తులనేకు లా నాఁడు పండరిపురమునకుఁ బోవుచుండిరి. ఆ యోగికూడ భక్తులతోఁ గలిసి పోవుచుండెను. విచార భరితాక్రాంత స్వాంతయై సక్కుబాయి నడువలేక నడువలేక పోవుచు "పాండురంగా! ప్రభూ! పరమాత్మా! సగుణ నిర్గుణాతీతుండవు. సత్య

స్వరూపివి. సర్వాంతర్యామివి. దీనురాలనగు నన్ను రక్షించుట కఱ వయ్యెనా ? నే నేమి పాతకమొనర్చితిని ? స్వామీ ! ఆనాఁడు ద్రౌపదిని రక్షించిన భక్తశిఖామణివి నీవు కావా ! నామదేవు, తులసీదాసు, తుకారాము మున్నగు భక్తాగ్రగణ్యులకు మోక్షమొసంగిన కృపాంభోనిధివి కావా ? " యని పలుకీతులఁ బ్రార్థించెను.

పరమాత్ముఁడు విశ్వంభరుని రూపమునఁ బ్రత్యక్షమై " సతీ ! రేపు పండరీపురమున బ్రహ్మాండమగు నుత్సవము జరుగుచున్నది. నీ వచటి కేగుము. భక్తులనేకు లట కేగుచున్నా " రని, యంతర్ధానము నొందెను. భక్తులతోఁగలిసి సక్కుబాయి మహదానంద భరితాంతఃకరణయై పండరి కరిగెను.

పైఠనుపురమున విశ్వంభరుఁడు నాతని తల్లియు సక్కుబాయి నూతిలోఁ బడినదో, మఱెచ్చటికిఁ బోయినదోయని వెదకికొనుచుండఁగా, పాండురంగఁడు సక్కుబాయి రూపమునఁ బ్రత్యక్షమై, వారి కూడిగము సేయసాగెను. మాయా సక్కుబాయి రూపముననున్న శ్రీకృష్ణుని సాన్నిధ్యమున నుండుటంజేసియు, నాతని మాటల నాకర్ణించుటవలనను, విశ్వంభరుని హృదయమునను, ఆతని తల్లి చిత్తమునను గొప్పమార్పు సంభవించెను. వారి యిరివురి హృదయములును భక్తిభావ సమన్వితములాయెను. పండరిపురమునకుఁ బోవుతలంపు వారికిఁ గలిగించెను. మాయా సక్కుబాయియు పత్తగారును, విశ్వంభరుఁడును పండరీపురముఁ జేరుసరికి, మాయాసక్కుబాయి మాయమయ్యెను. విశ్వంభరుఁడును దల్లియును సక్కుబాయినిఁ గానక వెదకికొనుచుఁ బండరీపురమునకుఁ బోయి, దేవాలయమును జేరిరి.

దేవాలయములో వారికి సక్కుబాయి కాన్పించెను. అత్తగారు " అమ్మా ! మేము నీతో వచ్చుచుండగానే మాయమై యిచ్చటికి

వచ్చితివేమి ?" యని ప్రశ్నించెను. సక్కుబాయి "ఇది యేమి విచిత్రము ? నేను మీతోనుంటినా ? నే నిచ్చటికి నిన్ననే వచ్చితినే. ఆయనయే నన్నుఁబంపినారే." యనియెను.

"అట్లయినచో నింతవఱకుమాతోనుండి, మాకు పండరినాథుని లీల లన్నియు వర్ణించి, మాచిత్తములందు భక్తిజ్యోతి నెలకొల్పిన దెవ ?" రని యత్తగా రనఁగా, సక్కుబాయికి భక్తిబోధన మొన రించిన యోగి "అమ్మా ! సక్కుబాయి యిచ్చటికి నిన్ననే వచ్చినది మీతో సక్కుబాయి రూపమున నున్నది పాండురంగఁడే. తదన్యులు కాఁజాలరు. మీ యిరువురి జీవితములును ధన్యతఁగాంచినవి. రండు. పాండురంగేశుఁడు కరుణాసముద్రుఁడు. భక్తులపాలిటి కల్పవృక్షము. భజనచేయుదము రం" డని, భూమ్యాకాశములు ప్రతిధ్వనించునట్లు భజనలఁజేసిరి. పాండురంగఁ డందఱకు సాక్షాత్కరించెను. సక్కుబాయి, ఉత్సవానంతరము భర్తతోఁ గలిసి, పైఠనుపురమునకుఁ దిరిగిచనెను. చిరకాలము వారు భక్తియుక్తులై గడపి, పండరిపురమునకుఁ బ్రతి వత్సరము నాషాఢ శుద్ధైకాదశికిఁ బోవుచుండిరి.



# 23 మీ రా బా యి.

——: o :——

మేవాడు దేశమున నొక రాజకుటుంబములో మీరాబాయి జన్మించెను. ఆమె జగన్మోహన సౌందర్యవిభాసితయై వెలుగొందుచుండెను. తండ్రి యామెకు సకలశాస్త్రములు నేర్పించెను. ఆమె బాల్యమునుండియు భక్తియుక్తయై, శ్రీకృష్ణు నారాధించుచుండెను. కొంతకాలము గడచెను. ఆమెకు వివాహము సేయుటకై తలిదండ్రులు సంకల్పించుకొనిరి. తలిదండ్రుల యభిప్రాయముతో మీరాబాయి ఏకీభవించలేదు. ఆమె "నాకు పెండ్లివల" దనెను. తండ్రి మనస్సు ఖేదముతో నిండెను. ఒకనాఁ డామెకుఁ గబురంపి "అమ్మా! రాజపుత్ర వంగడమున జన్మించిన కన్యలేరును వివాహము వలదనలేదు. మానధనులు, శౌర్యధనులు నగు వారలను వివాహమాడి, యశస్సు గాంచిరి. అట్లే నీవును సనురూపవరునిఁ బరిణయంబై మాకు నేత్రోత్సవముఁ గల్గింపు" మనిరి.

"తండ్రీ! నాహృదయము నీవఱకే పరమాత్ముఁడగు రాధాకాంతునకు సమర్పించితిని. అతఁడే నాదైవము—నాపతి—నా సర్వస్వమును. అన్యుల నేనిఁక వివాహమాడ" నని మీరాబాయి సమాధానము చెప్పెను—

"అయ్యో! ఎంత వెఱ్ఱిదాన వమ్మా! ఎచ్చటనైనను కన్యను మనుజులఁ బెండ్లిచేసికొందురు గాని, దైవమును పెండ్లిచేసికొందురా? తప్పు" అని మందలించి, యెల్లవిధముల నామె నుదయపుర రాణా కుంభుఁ డనుకూలముగ నున్నాఁడని తలంచి, శుభదినంబున మహావైభవముగఁ బెండ్లిచేసెను.

అత్తవారింటఁ గూడ మీరాబాయి శ్రీకృష్ణునకొక స్వర్ణ మందిరము నిర్మింపించి, యనవరతము భజనయం దాసక్తయై యుం డెను. కుంభరాణా సుందరుఁడు. కవి. శృంగార రసాత్మకముగ నాతఁడు పద్యము లల్లుచుండెను. మీరాబాయి యెల్లవేళల భక్తి భావ సమన్వితములగు గేయముల రచించుచుండెను. అనుదినము నామె పెక్కుమంది భక్తులను, సాధువులను సత్కరించుచుండెను. ఇది కుంభరాణా తోఁబుట్టువున కేమాత్రమును గిట్టకుండెను. ఆమెరాణాతో నట్టివేమియు సాగనీయవలదని చెప్పుచుండెను. నగరములో నొక శుభ్ర ప్రదేశమున శ్రీకృష్ణ మందిరము నామెకోరిక ననుసరించి, నిర్మింపఁ బడెను. ప్రతిరోజున మీరాబాయి భర్త్రనాజ్ఞఁగొని, యచటికేగి పూజల సల్పుచుండెను. ఆమె రచించినగేయములు జనబాహుళ్యమున వ్యాపించెను. అనేకు లామెపాడెడి కీర్తనలఁ బాడుచుండిరి. ఆమె కీర్తి నల్గడలఁ బ్రాకెను. జనులు తండోపతండములుగ వచ్చి యామె భజన గాంచి, భక్తిప్రబోధితు లగుచుండిరి.

అక్బరు చక్రవర్తి మీరాబాయి ఖ్యాతి నాకర్ణించి, తన యాస్థానగాయకుఁ డగు తాన్సేనుతో ఛద్మవేషము ధరించి, ఉదయ పురమునకు వెళ్లెను. తాన్సేనును, అక్బరుచక్రవర్తియు మీరాబాయి గేయముల నాలకించి, హర్షపులకాంకితకాయులైరి. అక్బరు తనచేతి వ్రేలినున్న వజ్రపుటుంగరమును దీసి, "శ్రీకృష్ణున కలంకరింపు మమ్మా" యని మీరాబాయి కొసఁగి, తన రాజధానికి వెడలి పోయెను.

ధగద్ధగాయమానముగ మెఱసిపోవుచున్న యా యుంగరమును గుఱించి, పలువురు పలువిధములఁ జెప్పుకొనసాగిరి. కుంభరాణా కూడ యవ్వార్త నాలకించి, యా సువర్ణాంగుళీయమును దెప్పించిచూచెను.

రత్నపరీక్షకులది చూచి, తా మక్బరు చక్రవర్తికి సంవత్సరమునకుఁ బూర్వ మా యుంగరమును విక్రయించితిమని చెప్పిరి. రాణాహృదయమున ననేకానుమానభావము లుదయించెను. వెనువెంటనే యోచన సేయక "నీవు నా రాజ్యము నీక్షణమున విడచిపొమ్ము. నాకంటఁ బడవల" దని, రాణా మీరాబాయికిఁ గబురంపెను. రాణా కోప కారణము ప్రచ్ఛన్నవేషమున నక్బరు వచ్చియుండుటయే యని గ్రహించి, నిర్విణ్ణయయ్యెను. ఒక్కసారి దర్శన మనుగ్రహిఁపుమని యామె కోరెను. రాణా యంగీకరించలేదు. "భర్తచేఁ దిరస్కరింపఁ బడి నేను బ్రతుకఁజాలను." అని తలంచి, మీరాబాయి రాజ్యము విడిచి, చాలదూరము పోయి, యొకనదిలోఁ బడిపోయెను. పశులకాపరులు కొందఱు మీరాబాయిని రక్షించిరి. ఆమెకు "మరణమేలఁ గోరుకొందువు?" యని, ఆత్మ ప్రబోధ మొనరించునట్లు లయ్యెను.

ఆమె తిన్నగా బృందావనమునకుఁ బోయెను. అచట జీవ గోసాయి యను సన్యాసి శిష్యులతో నివసించుచుండెను. ఆతఁడు స్త్రీల నేవగించుకొనును. ప్రపంచములో నే వస్తువైన నాశనమగుటకు, చంచలచిత్తులగుట నెట్టిపనియైనఁ జేయుటకు వెనుదీయకుండుటకు స్త్రీలే ముఖ్యులను భావముతో నాతఁ డుండెను. ఆమె దర్శన మనుగ్రహించుమని యాతనిఁ గోరెను. జీవగోసాయి యామెకు దర్శనభాగ్య మనుగ్రహించలేదు. ఆమె "మహాత్మా! తమతల్లి స్త్రీగాదా? స్త్రీ లేక సృష్టి యెట్లు జరుగును? విజ్ఞులగు మీరే యిట్లు పలుకనగునా?" యని కబురంప, నా గోసాయి పశ్చాత్తాపానల తప్తుఁడై యామెకు దర్శనమొసంగి, తన యవజ్ఞత సైరింపుమని ప్రార్థించెను.

మీరాబాయి బృందావనములో నుండఁగా నక్బరు చక్రవర్తికీ వృత్తాంతము తెలిసెను. ఆతఁడు యదార్థవృత్తాంతమును రాణాకుఁ

గబురంపి, "ఆ సాధ్వీమణిని రాజ్యమునకుఁ గొనివచ్చి యాదరించనిచో దండెత్తి వత్తు" ననెను. రాణా సిగ్గుపడి, మీరాబాయి కడకువచ్చి, తన తప్పు మన్నించి, రాజ్యమునకు రమ్మనివేడెను. ఆమె యాఱుమాసములు రాజ్యములో నుండుటకు, నాఱునెలలు భక్తి ప్రచారమొనరించుటకును సమ్మతించుచో వత్తునని బాసచేసెను. రాణా యామె కోరినట్లు చేయుటకు సమ్మతించగా, మీరాబాయి రాణాతో నుదయపురమున కరిగెను. ఆమె చిరకాలము భక్తియుక్తయై, భర్తృసేవఁ జేయుచుఁ గడపి, పరమపదము నొందెను.

---

# 24 దామాజీ.



మంగళవటం బను గ్రామమున దామాజీయను భక్తశిఖామణి నివసించుచుండెను. అతఁడు, పరమ పతివ్రతాతిలకమగు భార్యతోఁ గాపురము సేయుచుండెను. ఇట్లుండఁగా నొకనాఁ డొక బ్రాహ్మణుఁడు వారి గృహంబున కతిథిగా వచ్చెను. ఆ భూసురోత్తముఁడు భోజనమునకుఁ గూర్చుండిన పిదప జలజలమని దుఃఖాశ్రువులు రాలెను. దామాజీ యది చూచి "అయ్యా! మీరిట్లు విచారించుటకుఁ గారణమేమి? మర్మము విడిచి మాతోఁ జెప్పుఁ" డనెను.

ఆ బ్రాహ్మణుఁ "డార్యా! భూతదయాపరుండవై, యతిథి సత్కారముఁ జేయుచున్న పుణ్యమూర్తివి. నీ వడిగినపుడు యడా

ర్థముఁ జెప్పకుండుట దోషము కావునఁ జెప్పెదను. నేను భోజన మొనరించి మూఁడుదినము లైనది. ఇంటివద్ద నా సతీసుతు లన్నము నకు మొగమువాచి యుండఁగా నే నిట్లు భుజించుచున్నానను విచారము జనింపఁగా, కన్నీరు విడిచితి" ననియెను.

దామాజీ "అయ్యా! నీవు దుఃఖింపకుము. నీ కెంతధాన్యము కావలయునో గొనిపొమ్ము" అనెను. భోజనానంతరము నాలుగు బండ్లపై ధాన్యము నా బ్రాహ్మణుఁడు గొనిపోయెను. మార్గమధ్య మున చోరు లా ధాన్యము దోఁచుకొనిపోయిరి. ఆ బ్రాహ్మణుఁ డేడ్చుచు నింటికిఁబోయి, జరిగినదంతయు భార్యాపుత్రుల కెఱిఁగించి, వారిని వెంట నిడుకొని మంగళవటమునకుఁ బోయెను. ఈ వార్త పలు తావుల వ్యాపించి, యనేకులు భోజనార్థమై దామాజీగృహమునకు వచ్చిరి. ఆతని కడనున్న ధనమంతయుఁ గర్చయిపోయెను. వేలకొలఁది గ జనము వచ్చుచుండిరి. "నా కడ నున్న దంతయు పాండురంగ స్వరూపు లగు భక్తులకే వినియోగించితిని. ఇంకను ననేకులు వచ్చుచున్నారు. ఇఁక నాకడ నవాబున కీయవలసిన ధాన్యమున్నది. దానితో నీ దైవస్వరూపులను సంతృప్తులఁ జేసెదను. వీ రిట్లు మలమల మాడి పోవుచుండుటఁ జూడఁజాలను. నవాబు శిక్షించినను సరే. ఆ భారమంతయు పరమాత్ముఁడు, కరుణాస్వరూపుఁడు నగు పాండురంగడే వహించును గాక" యనుకొని, నవాబునకుఁ జెందవలసిన ధాన్యము భక్తుల కొసంగి, పంపివైచెను.

నవాబున కిది తెలిసి, "రొఖమిచ్చుటయో, ధాన్య మిచ్చుటయో జరిగినసరే. లేకున్న దామాజీ నిటకుఁ గొనిరం" డని భటుల నంపెను. ఆ భటులువచ్చి దామాజీనిఁ దమవెంటఁ గొనిపోయిరి. మార్గమధ్యమున దామాజీ పండరీక్షేత్రము కడనాగి "హే పాండు

రంగప్రభూ! కృపానిధీ! నీ సేవకుఁడను. దీనుఁడను. భవత్స్వరూపు లగు భక్తులకే ధాన్యము నొసంగితిని. అనేకుల బ్రోచిన దయామూర్తి” వని పలువిధముల స్తుతించి, మఱల భటుల వెంట చనెను.

ఇంతలో నవాబుకడకు విఠోబా యనునతఁ డేగి “అయ్యా! దామాజీ నా యజమాని, ధాన్యము విక్రయించగా వచ్చినపైక మెనిమిది లక్షల వరాలును నాచేఁ బంనాఁడు ఇవిగో. నాకు వెంటనే రసీ దిప్పించుఁ” డని, యా యెన్మిది లక్షల వరాలను గ్రుమ్మరించెను. నవాబు రసీదిచ్చి, విఠోబాను వీడ్కొలిపెను. ఇంతలో భటులతో దామాజీ వచ్చెను. నవాబు “ఎనిమిదిలక్షల వరాలును బంపి మఱల నీ వేలవచ్చితి?” వని దామాజీని ప్రశ్నించెను. అతఁ డాశ్చర్యచకితుఁడై యదియంతయు రుక్మిణీకాంతుని యనుగ్రహ విశేషమని యెఱింగి, పలు తెఱంగులఁ బరమేశ్వరు సంస్తుతించి, పండరిపురమున కేగి, యచ్చటనే నివసింపసాగెను.

---

# 25 నాభాజీ.



కాశీనగరమున అనంతానందస్వాములను వేదాంతశాస్త్రపారంగతులగు యోగీంద్రులు గంగానదీతీరమున నాశ్రమమొండు నిర్మించుకొని నివసించుచుండిరి. ఆ స్వాములవారి శిష్యులలో అగ్రజీయను నాయన ముఖ్యుఁడు. అగ్రజీకూడ పెక్కుమంది శిష్యులతో మఱియొకయాశ్రమమున నివసించుచుండెను. దేశముమహాక్షామమునకు లోనగుటచే ననేకులన్నాతురులై ప్రాణత్యాగముసేయుచుండిరి. ఒకస్త్రీ తనపుత్రునితో నాఁకటిబాధకుఁ దాళఁజాలక గంగానదీతీరమునకుఁ బోయి తీరమునకుమారునుంచి, నదీజలంబులఁ దానుబడి మృతినొందెను. ఆబాలుఁడు తల్లియెంతసేపటికిని రాకుండుటచే నాందోళనము నొంది బిగ్గఱగా విలపింపసాగెను. ఆరోదనమును, స్నానార్థమచ్చటికి వచ్చియున్న యగ్రజీయాలకించి, దివ్యదృష్టినాతనితల్లి, నదిలోఁబడి, యసువులఁబాసెననియెఱింగి, జాలినొంది యాబాలునిఁ దనమఠమునకుఁ గొంపోయెను.

నాభాజీ, యగ్రజీసత్కరించెడిభక్తులు విడిచినపదార్థములే మహోత్కృష్టములనిభావించి భుజించుచు, భక్తులతోఁగలిసి శ్రీమన్నారాయణు నహర్నిశములు భజించుచు, భక్తుల వేదాంతసంభాషణల వినుచు భక్తియుక్తుఁడై యుండెను. కొలఁదికాలములో నాభాజీ యాగతానాగతములను, యితరులహృదయములందుండు తలంపులను దెల్పఁ జాలునంతటి వివేకముగల్గియుండెను.

ఒకనాఁడగ్రజి జపముచేసికొనుటకై పూజామందిరములోనికేగి “ నాభాజీ! ఎవరిని రానీయకు ” మని, యేకాగ్రచిత్తమున శ్రీమ

న్నారాయణుని సాక్షాత్కారమునొందుటకై జపమునారంభించెను. ఎంతసేపటికిని లక్ష్మీకాంతుఁ డాతనికిఁ బ్రత్యక్షముకాఁడయ్యెను. అగ్రజీకి మహావేదనముగలిగెను. నాభాజీయుదియంతయునెఱింగి "గురూజీ! అయిదునిమిషములు జపముచేయవలదు. నదిలో నొకనౌక మునిగి పోవుటకుసిద్ధముగానున్నది. ఆదినారాయణుఁడావర్తకుని రక్షించుటలో నిమగ్నుఁడైనాఁడు. ఆకార్యము సాంతముకాఁగానే తమకుదర్శనమొసంగును. ఆవణిజుఁడు మనమఠమునకువచ్చు" ననెను.

అయిదునిమిషములు గడచినపిమ్మట నగ్రజీమహాత్ముల జపమునకుఁ గడంగెను. లక్ష్మీరమణుఁడు దర్శనమనుగ్రహించెను. "తండ్రీ! నేఁడేల నాకింతయాలస్యముగ దర్శనమొసంగితివి? అదేమి నీపీతాంబరము లార్ద్రములైయున్న?" వని యగ్రజీ ప్రశ్నింప, నా దేవ దేవుఁడు "భక్తాగ్రణీ! నదిలో నొకవణిజుఁడు నౌకతోమునిగిపోవుటకు సిద్ధముగానుండి, రక్షింపుమని వేడినందున నచటికేగితిని. అందు చేతనే నావస్త్రములు తడిసిపోయినవి. ఆవణిజుఁడిచ్చటికివచ్చి, నీమఠమునకు ద్రవ్యమిచ్చు" నని, యంతర్ధానమునొందెను.

వణిజుఁడువచ్చి మఠమునకుఁ జాలద్రవ్యమునొసఁగి వెడలిపోయెను. అగ్రజీ నాభాజీనిపిలిచి "వత్సా! నాకంటె ముందుగనే యీవృత్తాంతము నెట్లుచెప్పితి" వని ప్రశ్నించెను. నాభాజీ "గురువరేణ్యా! తమసేవవలననే నేను శ్రీమన్నారాయణ పాదారవిందసందర్శనభాగ్యము నొందితిని. తమశిష్యుఁడనగుటచేతనే, యనాగతానాగతములఁ జెప్పఁగలుగుచున్నాను. అంతేనే" యని బదులుపలికెను.

నాభాజీ భక్తులచరిత్రలవ్రాసి ధన్యతఁగాంచెను.

---

# 26 రామాబాయి.

వారణాసీనగరమును బరిపాలించుచుండిన రాజునకుఁ జిరకాలమునకు రామాబాయియను కుమార్తె జన్మించెను. రామాబాయి సుందరియేగాక సుగుణఖనియునై, యందఱిచేఁ బ్రశంసింపఁబడుచుండెను. ఆమె బాల్యమునుండియు శ్రీరామచంద్రుని భజించుచుండెను. ఆరాజపుత్త్రి వివాహోచితమగు ప్రాయము నొందెను. ఆమె గురువద్దనుండి పతివ్రతాలక్షణములన్నియు నెఱింగి, ఖ్యాతి గాంచసాగెను. ఆమెను, తండ్రి యొకరాజపుత్త్రునకిచ్చి, మహావైభవముగఁ బెండ్లిచేసెను. ఆ రాజపుత్త్రుఁడు భక్తియనుపదమున కర్థమేయెఱుఁగని మూఢుఁడై యుండెను. రామాబాయి యనవరతము శ్రీరామచరణధ్యాన మొనరించుచుండుట యాతనికి రుచింపదాయెను. తనకట్టిమూర్ఖుఁడగుభర్త సంప్రాప్తించినందులకు మిక్కిలి విచారించియు రామాబాయి పతివ్రతాతిలకమగుటచే భర్తయడుగులకు మడుగులొత్తుచుఁ గాలముఁ బుచ్చుచుండెను.

ఇట్లుండఁగా భీష్మైకాదశివచ్చెను. ఆయేకాదశినాఁడామె స్నానముఁజేసి, భర్తకుభోజనమిడి తానుపవాసముచేయ నిశ్చయించెను. ఆనాఁడాతఁడు పలలాశనాసక్తుఁడై యొకమేకనుజంప నుద్యుక్తుఁడాయెను. "అయ్యో! నాథా! అయ్యది పాతకహేతువుకాదా? నామాట వినుఁడు. నేఁడు మహాపర్వదినముగదా!" యనెను. అనేకవిధముల నామె ప్రతిమాలినను యాతఁడువినలేదు. మేకనువధించెను. రామాబాయిమనస్సు దుఃఖభరితమైపోయెను. తననాథునిచిత్తమున భక్తి యుదయింపఁజేయుటకుఁ దగునుపాయమునామె యన్వేషింపఁగడంగెను.

ఆమెకుమారుఁడానాఁడేసర్పదష్టుఁడయ్యెను. పుత్త్రునిపైఁ దనకుఁగల ప్రేమపెంపునఁ దండ్రి విలపింపసాగెను. రామాబాయికంటెఁ

దడివెట్టలేదు. అదిచూచి యందఱును విస్మయపరీతచేతస్కులైరి. ఆమె "జీవులకు సుఖదుఃఖములు సమానములు. 'జాతస్యమరణం ధ్రువ' మ్మనుసూక్తి ననుసరించి, యందఱును యెప్పుడో యొకప్పుడు మరణింపవలసినదే" యని, యత్యంతదీనముగ నేడ్చుచున్న భర్తను గాంచి, "ఇచ్చటికనతిదూరముననున్న దశాశ్వమేధఘట్టముకడ నొక మఠమున్నది. అందు మహాభక్తులగు సాధువులుందురు. వారిపాదములకుఁ బ్రణమిల్లి, యెట్లయిన నిచ్చటికిఁ గొనిరండు. ఆమహాత్ములు తీర్థమిచ్చిన-చోఁ బుత్త్రుఁడు జీవించు" ననెను.

రామాబాయి చెప్పినచొప్పున యారాజేంద్రుఁడు తిన్నగాఁ బాదచారియై యామఠమునకుఁబోయి, యచ్చటనున్న సాధువులకు నమస్కరించి, తనకుసంభవించిన యాపదను వారికెఱింగించి, యంతఃపురమునకుఁ గొంపోయెను. ఆసాధువులమంత్రబలమున సర్పదష్టుఁడైన బాలుఁడు జీవించెను. భార్యాభర్తలిద్దరును నాఁటి నుండియు భగవద్భక్తియుక్తులై కాలముగడపసాగిరి.

---

# 27 చాంగదేవుఁడు.

పరమపావనమైన భీమానదీతీరమునఁ గన్నులవైకుంఠమైయొప్పు పండరీపురమునకు సమీపమున నున్న యొకగ్రామమున నొకబ్రాహ్మణుఁడు సుగుణముల దొంతియగు భార్యతోఁ గాపురముసేయుచుండెను. వారికొక కుమారుఁడు జన్మించెను. ఆ బాలుఁడు చాంగదేవుఁడనుపేరఁ బరఁగుచుండెను. చాంగదేవుఁడు పూర్వజన్మార్జితసుకృతవిశేషమున నత్యద్భుతములు, నమానుషములునగు పనులఁజేయుచుండెను. గగనమార్గమున సంచరించుట, జలమునఁదేలుట మున్నగు మహిమ్మ

తములగు లీలలఁ జేయుచుండెను. అనుదినము చాంగదేవుఁడు పండరికిఁ బోయి, పాండురంగ సందర్శనముఁ జేయుచుండెను. ఈతనికడ చాల మంది శిష్యులుచేరిరి. ఎందఱు శిష్యులుచేరినను, యెన్నిశాస్త్రములం దాతఁడు ప్రావీణ్యము సంపాదించినను, గురుముఖంబున నేర్చినదేదియు లేదుగదా యని తల్లడమందుచుండెను. "గురువులేక యేవిద్యయు రాణింపదుగదా! సద్గురుసంబంధములేని జన్మనిరర్థకముగదా!" యని చింతించి, జ్ఞానదేవునకు లేఖ వ్రాయఁబూనెను. ఆతని నెట్లు సంబోధించుటకును దోఁచక వట్టి కాటియాకును శిష్యునికిచ్చి, యలకాపురిలోనుండు జ్ఞానదేవున కిచ్చిరమ్మని పంపెను. ఆ పత్రికనుజూచి, జ్ఞానదేవుఁడు నిట్టూర్పువిడిచి "చాంగదేవుఁ డిన్నిశాస్త్రముల నేర్చినవాఁ డయ్యును, నాతనిచిత్తము పరిణతి నందకుండుట విపరీతము. సద్గురుసంబంధము లేక యాతఁడు జీవన్ముక్తుఁడు కానేరఁడుగదా!" యని విచారించెను.

"ఆత్మయొక్క స్వస్వరూపము నెవ్వఁడు నెఱుంగఁడు చైతన్యము రూపరహితము. సర్వప్రాణులకు సమానము. గురుశుశ్రూష లేక విద్య ప్రకాశింపఁజాలదు. హృదయము పరిపక్వము కాఁజాలదు" అని జ్ఞానదేవుఁడు పత్త్రికపై వ్రాసి పంపెను. అది చూచుకొని చాంగదేవుఁ డొకవ్యాఘ్రము నెక్కి యలకాపురికిఁ బోయెను. శిష్యులవ్విషయమును జ్ఞానదేవునికిఁ దెలిపిరి. ఆతఁడొక మంటిగోడపైఁ గూర్చుండి, యాగోడను ముందునకు నడిపించెను. అది చూచినవారెల్లరును దిగ్భ్రమచెందిరి. జ్ఞానదేవుఁడు చాంగదేవు నొకవటవృక్షము కడకుఁ గొంపోయి. యచ్చట నాతని కుపదేశమొనరించి, ముక్తాబాయి కడకుఁ గొంపోయెను. ఆమె దిగంబరయై కన్పట్టుటచే నాతఁడు సంశయించి, వెనుకకుఁ దగ్గెను. అదిచూచి యామె "ఓ చాంగదేవా?

ఇంకను నీ వజ్ఞానాంధకారమగ్నుఁడవై యుండుట యాశ్చర్యకరము. శ్రీ శుకమహర్షికి స్త్రీపురుషభేద మున్నదా? నీ ప్రజ్ఞావిశేషముఁ గాంచుటకై నేను నీకట్లు కాన్పించితి" ననెను.

చాంగదేవుఁడు సిగ్గుపడి "తల్లీ! ఇన్ని తెలిసియు నే నజ్ఞుఁడనే" యని పలికెను. జ్ఞానదేవుఁడు తనహస్తమును చాంగదేవుని శిరమున నుంచెను. చాంగదేవునకు జ్ఞానోదయము కాఁగా, నాతఁడు కృతజ్ఞతా పూర్వకముగ వారలకు నమస్కరించి, పండరీపురమునకుఁ బోయి పాండురంగ చరణసరోజముల సేవించుచు గడపి, యనంతానందనిలయ మగు శ్రీమహావిష్ణుసాన్నిధ్యము జేరెను.

---

# 28 నరసింహ మెహతా.



నరసింహమెహతా యను మాతాపితృవిహీనుఁడగు బాలుఁ డుండెను. ఆతఁ డాటపాటలయందే కాలముఁ గడపుచుండుట చూచి, బంధువులు "నాయనా! ఈరీతిగా నెల్లపుడు నాటపాటలయందే కాలముఁ బుచ్చుచుండిన యెడల నెట్లుజరుగును? ఆయేడున కాయేడు వచ్చుచున్న కొలఁది చదువులేనిచో సంపాదన యెట్లుజరుగును? పెండ్లి యెట్లగును? సంసారములేక సన్న్యాసివగుదువా యేమి?" యని నిష్ఠు రాలాపముల నాడిరి. ఆ మాటలు నరసింహమెహతా చిత్తమున కశాంతి కల్గించెను. ఆతఁడు వెంటనే నగరము వెలుపలనున్న యరణ్య మునకుఁ బోయెను.

ఆకాననమధ్యమున నొకజీర్ణశివాలయముండెను. నిర్జనమైయున్న యా యాలయములోఁ బ్రవేశించి, శంకరసాక్షాత్కారముకొఱకు

ఏడుదినములు నిద్రాహారములుమాని ప్రార్థింపఁగా, నాసాంబశివుఁడు ప్రత్యక్షమై "ఏమికావలయు?" నని యడిగెను. "శ్రీకృష్ణుని దర్శనముఁ జేయుట నాకోరిక. నీదర్శనభాగ్యముచేఁ దరించితినిగదా" యని నరసింహమెహతా పలికెను. శంకరుఁడాబాలుని యమునానదీ తీరమునకుఁ గొంపోయి, రాసక్రీడాలోలుఁడై యుండిన శ్రీకృష్ణుని జూపెను. శ్రీకృష్ణుఁడు "ఈబాలుఁడెవ్వ?" రని యడిగెను. "ఆబాలుఁడు నిన్నుఁ జూడఁదలఁచిన భక్తుఁడు" అని కైలాసాధీశుఁడు ప్రత్యుత్తరమిచ్చెను.

"ఈతఁడు లోకవిఖ్యాతినందఁగల భక్తాగ్రగణ్యుఁడగును. సందియములే" దని యదుకులోత్తముఁడు వచించి, యంతర్ధానము నొందెను. శివుఁడాబాలుని మఱల నాలయమునకుఁ గొనివచ్చి, నీకు శుభములు గల్గుఁగాక" యని దీవించి, మాయమయ్యెను. అదిమొద లుగ బాలుఁడైన నృసింహమెహతా దృఢమనోనిశ్చయముఁ గలిగిన వాఁడై, సకలలోకాధీశుఁడగు రాధామనోవల్లభుని—శ్రీకృష్ణభగవానుని సంస్తుతించుచు నా యాలయముననే యుండసాగెను.

ఆతనికొఱకు బంధుగులు వెదకివెదకి, శివాలయమున నున్నాడని తెలిసికొని, యింటికిఁ బిలుచుకొనిపోయిరి. ఆతనిసద్గుణములకలరి, బాల్యావస్థలోనే భగవద్దర్శనలాభమందినందున మహత్తరమహిమాన్వితుఁడు కాఁగలఁడని గ్రహించి, యొకద్విజోత్తముఁడు తన తనయను నరసింహమెహతాకిచ్చి వివాహముగావించెను. నరసింహమెహతాకొక పుత్త్రుఁడును, బుత్త్రికయు నుద్భవించిరి. ఆబాలబాలికలు తుదలేని యందముఁ గల్గియుండిరి. నృసింహమెహతా గార్హస్థ్యము నెఱపుచున్నను, పాండురంగనామసంస్మరణము నేమఱియుండలేదు.

ఇట్లుండఁగా నిరువురును పెద్దవారైరి. పురాతననటమునకు సమీపమున శ్యామలాపురమను గ్రామమున్నది. అందు త్రిపురాంత

కుఁడను భాగ్యశాలియగు బ్రాహ్మణుఁడుకలఁడు. అతనికొక్కకొమరిత కలదు. ఆకన్యకుఁ దగినవరునన్వేషింప, త్రిపురాంతకుఁడు పౌరోహిత బ్రాహ్మణునంపెను. ఆబ్రాహ్మణు డనేకగ్రామములకేగి, తుదకునరి సింహమెహతాకుమారుఁడే యనురూపవరుఁడని తెలిపెను. మెహతా దారిద్ర్యము ననుభవించుచుఁ దనమైశ్వర్యమునకుఁ దగినట్లాడంబరముగఁ బెండ్లిసేయఁగలఁడో లేఁడో యని సంశయించి. యెట్లైన మెహతాతో వియ్యమందుట కిష్టములేనివాఁడై శుభముహూర్తము నిశ్చయించి, తనవైభవమునకుఁ దగినవిధమున శీఘ్రముగానచ్చిననే పెండ్లిచేయుదునని కబురంపెను.

నరసింహమెహతా పండరినాథుఁడే, తనగౌరవము కాపాడఁగలఁడని స్వామిననేకవిధముల సంస్తుతించి యారాత్రి నిద్రించెను. మఱుచటిదినముననే వారు బయలుదేఱవలసియుండిరి. ఉదయమున నృసింహమెహతాబంధుమిత్రులతోఁ బయనమగుసరికి, పాండురంగేశునియాజ్ఞానుసారముగ దేవతలు, దిక్పాలురు, మహర్షులు నాతనిననుసరించిరి. మహావైభవముగ నరసింహమెహతా శ్యామలాపురముఁజేరెను. త్రిపురాంతకుఁడు మెహతాకీ వైభవమంతయు నెట్లువచ్చెనో యని, సిగ్గుపడెను. వివాహము మహావైభవముగ జరిగెను. మెహతాతిరిగి బంధుసమేతముగ బురాతనవటమునకు వచ్చెను.

ద్వారకకుఁబోవుచున్న కొందఱుయాత్రికులు మార్గము చోరులచే నపాయకరమైయున్నదని తెలిసికొని, ద్వారకలోనివర్తకులలోనెవరికైన హుండీనీయఁగలవారీ యూరనున్నారాయని పురాతనవటమునఁ గొందఱినడిగిరి. మహావైభవముగ వివాహముచేయుటచే నసూయనొంది, మెహతాకెట్లైన పరాభవము గలిగింపఁగృతనిశ్చయులై యాయాత్రికులనుద్దేశించి " అయ్యా ! ఈగ్రామమున నరసింహమెహతా

యనుభక్తుఁ డున్నాఁడు. ఆతఁడు విశ్వాసపాత్రుఁడు. ఆతనికడ మీధన
ముంచి, హుండీని గొనిపొం" డనిరి.

యాత్రికులు నరసింహమెహతాకడకుఁ బోయి హుండీనిమ్మ
నిరి. ఆతఁ డిదియేమి చిత్రమని యాలోచించి, దయాసముద్రుఁడగు
పాండురంగని లీలయేయని తలంచి, యా యాత్రికు లిచ్చిన వేయి
వరాలును దీసికొని, ద్వారకలోని శ్రీకృష్ణునిపేర హుండీనొసంగెను.
వర్తకులు హుండీనిగొని ద్వారకకుఁబోయిరి. ద్వారకలో నొకవర్త
కుఁడు యీ యాత్రికులు బసచేసియున్న సత్రముకడకు వచ్చి "పురా
తనపటము నందలి నరసింహమెహతానుండి హుండీని గొనివచ్చినవారు
మీరేనా? ఆహుండీ నిటు తెం" డని, తీసికొని, వేయివరాలను
యిచ్చి, మాయమయ్యెను. ఆ వరాలను గైకొని, వారు నరసింహ
మెహతా పలుకుబడికెంతయు సంతసించిరి. పాపము! పరమకృపాళుం
డగు పాండురంగేశుఁడే యట్లొనరించెనని యెఱుంగరు కదా!

మెహతా కొమరిత పుష్పవతియయ్యెను. ఆమెకు సారెయిచ్చి
యత్తవారింటికిఁ బంపఁదలఁచి. తనతంబురను, చిఱుతలను గొనిపో
యెను. "మహా గొప్పసారెయే తెచ్చితివి నాయనా! నీకొమరిత
కేఁకేమిలోపము? తంబురను, చిఱుతలను చేతఁబూని, నృత్యగానముల
సేయఁగల?" దని యత్తగా రాక్షేపించెను. మెహతా కూఁతురిది
విని దుఃఖితాత్మయయ్యెను.

వారలనందఱను నట్లు హేళనచేయవలదని హెచ్చరించి, నర
సింహమెహతా యెవరికేది కావలయునో యొక కాగితముపై వ్రాసి
యిమ్మనెను. అందఱును, చీరలని, రూకలని, నగలని, యెన్నో చెప్పిరి.
అంత నొకఁడు మెహతా ప్రక్క నిలువఁబడెను. "కృష్ణానందా!
ఈ కాగితములోని వస్తువులనుదెచ్చి వీరికిమ్ము" అనెను. కృష్ణానం

దుని రూపమున నున్న పండరీప్రభుఁడు వెనువెంటనే యాకాగితము నందలి వస్తువులను దెచ్చియిచ్చుటయేగాక, విలువైనచీరలను, వస్తు వాహనములను సారెగా మెహతాకుమార్తె కిచ్చెను.

మెహతా పండరినాథుని భజించునపుడు మాత్రమే యొక తులసిమాల యందఱకుఁ గాన్పించుచు, నితరవేళల నదృశ్యమగుచుం డెను. నగరాధికారి మెహతా భక్తియంతయుఁ గపటనాటకమను దురూహతో నొకనాఁడు వచ్చి "నీభక్తి నిజమేని మఱియొక తులసి మాలను దెప్పింపు" మనెను. మెహతా పాండురంగనిఁ బ్రార్థించెను. లాభము లేకపోయెను — "ప్రభూ! నామాటఁ దక్కించవా? నీ నామము కళంకితముకాదా? నా మొఱాలకించవా?" యని పలు తెఱఁగులఁ బ్రార్థింప, మఱియొక హారముఁ గాన్పించెను. పాండురంగ విఠలుఁడు మెహతాకుఁ బ్రత్యక్షమై యంతర్థానము నొందెను.

---

# 29 రవిదాసు.

అస్పృశ్యకులమున నుద్భవించిన యీరవిదాసు జన్మస్థల ముత్తర హిందూస్థానమునందలి యొక కుగ్రామము. ఈతని కులస్థులాకాలమున చమరులని పిలువఁబడుచుండిరి. తోళ్లవ్యాపారమే వీరివృత్తియై యుం డెను. బాల్యమునుండియు రవిదాసు భక్తుఁడై రమాకాంతుని స్మరించు చుండెను. ఆతని కున్నస్వల్పముతోఁ గొంత బీదలకు దానపూర్వకముగ నిచ్చుచుండెడివాఁడు. ఇట్లుండగా దేశము మహాదుర్భిక్షమునకు లోన య్యెను. ప్రజలు మలమల మాడిపోవుచుండిరి. రవిదాసుకూడ దుర్భర మగు నీదారిద్ర్యాసలమున మ్రగ్గిపోనాగెను. పరమాత్ముఁడు వైష్ణవుని రూపమున నేతెంచి, విలువగల వజ్రముల నీయఁబోయెను. రవిదాసు

"మహాత్మా! నాకట్టి యమూల్యములైన వజ్రము లక్కఱలేదు. నాకు పరమాత్ముఁడగు శ్రీహరి భజనమే మహాభాగ్యము. రమాకాంతుని నామామృతమునే నేను తనివితీఱఁ గ్రోలుచుందును. అద్దానినే నా హృదయపాత్రమున జాగ్రతగ నిక్షిప్తమొనరించి, త్రావుచుందును. నా కన్యమేమియు వల" దనెను. పరమాత్ముఁడంతఁ గొంత ధనమొసంగి, "భక్తమణీ! ఈ ధనముతో నొక దేవాలయము నిర్మించి, యశస్విలకుఁడవుక" మ్మని పలికి యంతర్ధానము నొందెను.

రవిదాసా ధనమును, ప్రజలసాహాయ్యమును తోడఁతగాఁగొని విష్ణాలయము నచిరకాలమున నిర్మించి, తానే పూజారిగనుండి, పుణ్యశీలుఁడై కాలము గడుపుకొనసాగెను. ఇది యా యూరనున్న బ్రాహ్మణులకుఁ గ్రోధకారణమయ్యెను. వారు ఆ దేశమునేలు మహారాజుకడకేగి "ఓ మహారాజా! పవిత్రములైన వస్తువు లపవిత్రము చేయఁబడినపుడే దేశమున మృత్యువు, కాటకము, భయము తాండవించును. అస్పృశ్యుఁడగు రవిదాసు విష్ణ్వాలయము నిర్మించి, తానే జనమునకుఁ బ్రసాదముల నిచ్చుచున్నాఁడు. అతని తప్పు సైరింపరానిది. నీ ప్రజల గౌరవమును, మతమును భ్రష్టముగాకుండ కాపాడుట నీవిధి" అని పలికి, వెడలిపోయిరి.

మహారాజు రవిదాసును రావించి, ఆ యాలయమును బ్రాహ్మణుల స్వాధీనము చేయవలయునని యాజ్ఞాపించెను. అతఁ డట్లే యొనరించి, యింటికిపోయి వలవలయేడ్చెను. మహారాజు చిత్తమున నేదో చెప్పరాని యావేదనముదయించెను. మఱునాఁ డాతఁడువచ్చి, రవిదాసు పాదములపైఁబడి, "భక్తాగ్రణీ! నాహృదయ మశాంతికి లోనైనది. నీయాలయము నీవేగైకొను" మనెను. చిత్తూరు రాణియగు జ్వాలాదేవి యీతని శిష్యురాలాయెను. బ్రాహ్మణులు కోపో

ద్రిక్తులై రని తెలిసికొని, యామె యొక్క నిందో నరించెను. ఆవిందులో నెటఁ జూచినను రవిదాసే ప్రత్యక్షమాయెను. ఎల్లరును దిగ్భ్రాంతు లైరి. ఈతనిచే రచింపఁబడిన శ్లోకము లాదిగ్రంథమున నున్నవట. కొన్ని యిప్పటికిని వారణాసీక్షేత్రమునఁ బలువురిచేఁ బాడబడుచున్న వట. రవిదాసు చిరకాలమా దేవాలయముననే గడపి, వైకుంఠము నొందెను.

---

# 30 రామదాసు.

:o:

పరమపావనమైన భద్రాచలపుణ్యక్షేత్రమున కనతిదూరమున నున్న యొకకుగ్రామంబున తుమ్మలదమ్మకయను సుశీల నివసించుచుం డెను. ఆభక్తురాలి కొకనాఁటిరాత్రి స్వప్నమున శ్రీరామచంద్ర మూర్తి సాక్షాత్కరించి "భద్రాచలశిఖరముపై నావిగ్రహము లున్నవి. వానినిఁదీసి, యాలయము నిర్మించుము. ముక్తినీకు కరతలా మలకమగు" నని పలికి, యంతర్థానమునొందెను. తెల్లవాఱినపిదప నాతుమ్మలదమ్మక్క, కొండజీసాహాయ్యమున భద్రగిరిశిఖరముమీఁది కేగి, యచ్చటనున్న లతాగుల్మలములఁ దొలఁగించి, శ్రీసీతారామ లక్ష్మణుల విగ్రహములఁగాంచెను. ఆవిగ్రహములనామె యాలయ మునఁ బ్రతిష్ఠింపించి, నిత్యము యథావిధిగఁ బూజలఁజేయుచుండెను. ఇటనిట్లుండగా, నేలకొండపల్లెయను గ్రామంబున కంచర్ల లింగన్నయను బ్రాహ్మణుఁడు నివసించుచుండెను. ఆభూసురోత్తమునకు కామాంబ యనుభార్యకలదు. ఆపుణ్యశీలురగుదంపతులు చిరకాలము సంతాన హీనులై యుండిరి. ఆదంపతులు సంతానముకొఱ కనేకములైన దాన ములఁజేసిరి. వ్రతముల నాచరించిరి. ఏతద్వ్రతఫలమోయన,

కామాంబగర్భవతియై, నవమాసములు గడచినపిదప నొకమగశిశువును గాంచెను. ఆశిశువునకువారు గోపన్నయనిపేరుపెట్టిరి. గోపన్న శుక్ల పక్షచంద్రుని భంగి దినదినప్రవర్ధమానుఁడగుచుండెను. బాల్యము నుండియు నాబాలుఁడు భక్తియుక్తుఁడై యుండెను. యుక్తప్రాయమున గోపన్న కుపనయనవివాహములు చేయఁబడియెను. ఆతనిభార్యపేరు కమలాంబ. సుశీలయగుకమలాంబ సుతునొక్కనిఁగాంచెను.

ఇట్లుండఁగా, కబీరుదాసను మహాభక్తుఁడొకనాఁడు రామదాసు గృహమునకువచ్చెను. భక్తుఁడగు రామదాసు కబీరునకుఁ బ్రేమపూర్వకముగ నాతిథ్యమొసంగి, గౌరవించెను. ఆతనిగౌరవాదరణములకు సంప్రీతినొంది, కబీరుదాసు పరమపవిత్రమును, మోక్షసాధనమునైన తారకమంత్రము నుపదేశించెను. రామదాసు నిత్యము తారకమంత్రముఁ బఠించుచుఁ గాలముగడపసాగెను.

నాఁటఁగోలె గోపన్న రామదాసని పిలువఁబడసాగెను. శ్రీరామకైంకర్యమునకుఁ దనకడ ధనములేనందున రామదాసొకనాఁడు తనమేనమామలగు అక్కన్నమాదన్నగార్లను గలిసికొనుటకై హైదరాబాదున కరిగెను. నిజామునవాబుకడ మంత్రులుగనున్న ఆయక్కన్న మాదన్నగార్లు మేనల్లునిరాక కత్యధికానందభరితాత్ములై నైజాము ప్రభునితోఁజెప్పి, భద్రాచలముతాలూకా తహసీలుదారుద్యోగము నిప్పించిరి. రామదాసు తిన్నగా భద్రాచలమునకుఁ దిరిగివచ్చి, ప్రభుభక్తియుక్తుఁడై తనయుద్యోగధర్మములఁ జక్కగా నిర్వహించుకొనుచుండెను. ప్రజలాతని భక్తిసౌజన్యములఁగాంచి, మిక్కిలి యానంద మొందిరి. తఱచుగా నాతఁడు శ్రీరామచంద్రమూర్తి కుత్సవసమారాధనములఁ జేయుచుండెను.

30

తుమ్మలదమ్మక్క నిర్మించిన శ్రీరామాలయము శిథిలావస్థ నుండుటచే రామదాసు చిత్తమున దేవాలయము నిర్మించుతలంపుజనించెను. అప్పుడాతనికడ వసూలైన పన్నుధన మాఱులక్షలరూపాయలుండెను. ఆధనమునువ్యయపఱచినచోఁ దానీషాకుఁ దనపై నాగ్రహము కలుగునని భయపడెనుగాని, గత్యంతరములేనందునఁ దుదకాధనమును వ్యయపఱుప సంకల్పించి, "నేనీకార్యమును శ్రీరామచంద్రుని నిమిత్తమేగదా చేయుచున్నాను. నన్నుతానీషాయేమిచేసినను సరే. రామచంద్రుఁడేనన్ను రక్షించుగాక" యని శుభదినమున నారంభించి విశాలమగు ప్రాకారములతో, సుందరములగు గోపురములతో, రమణీయములగు మంటపాదులతో దేవాలయనిర్మాణము సంపూర్తిఁగావించెను. రామదాసు క్రిందియుద్యోగులు తానీషాతప్పక శిస్తు నట్లువ్యయపఱచి నందులకు శిక్షించునని మిక్కిలి భయపడిరి. రామదాసు "ఓభక్తులారా! తానీషానన్ను సర్కారుపైకము వాడినందులకు శిక్షించునని భీతినొందవలదు.

"ఉ॥ తాళినిదాటకం దునిమి, యాగముగాచి, యహల్యబ్రోచి, సీ
తాలలనన్వరించి, రణదర్పితరావణకుంభకర్ణము
ఖ్యాళివధించి, రాజ్యమునయంబుగ నేలినరామచంద్రభూ
పాలుఁడు రంగశాయిమన పాలగలండు విచారమేటికిన్".

రామదాసు సర్కారుపైకమును శ్రీరామాలయమునకై వినియోగపఱచెనను వార్త ప్రథమంబున నక్కన్నమాదన్నగార్లకుఁ దెలిసెను. పిదపఁ దానీషాకుఁగూడ తెలిసి, సొమ్ము వెంటనే పంపవలసినదని రామదాసునకు హుకుముసంపెను. రామదాసు తానాపైకముతో భద్రాద్రి రఘురాముని కాలయము నిర్మించితిననియుఁ గోపింపక, క్షమింపు మనియు, భగవత్కార్యంబగుట క్షమార్హమనియుఁ దన వాక్యములుగఁ దెలుపుమని మొకనిచే వార్తనంపెను. తానీషా మేర

మీఱిన యాగ్రహమునొంది, రామదాసును వెంటనే కారాగృహ మున బంధింపవలసినదని, యాజ్ఞాపించెను. భటులువచ్చి, రామదాసు నకుఁ దానీషా హుకుముచూపిరి. ధైర్యమునువీడక రామదాసు—

ఉ. పోకన్మానదు దేహమేవిధమునన్ పోషించి రక్షించినన్
రాకన్మానవు హానివృద్ధులు మహారణ్యంబులోదాగినన్
కాకన్మానవు పూర్వజన్మసుకృతముల్ కాగల్గు నర్థంబులున్
లేకన్మానునె యెంత జాలిపడినన్ లేముల్ సిరుల్ రాఘవా!

అని తలంచి, విచారవారాశినిమగ్నులై యున్న సతీసుతుల నూఱడించి, భటుల వెంబడించెను.

రామదాసు హైద్రాబాదుచేరి, తానీషా సముఖమున కరిగెను. క్రోధోద్దీపితుఁడై యున్న తానీషా రామదాసును జూచి, మండిపడి "ఏమి గోపన్నా! సర్కారుపైకమేది?" యని ప్రశ్నించెను. రామదాసు "ప్రభూ! శ్రీరామచంద్రుని దేవాలయము శిథిలముగ నున్నందున, శిస్తుపైకము వ్యయపఱచి, ఆలయ మంటప ప్రాకారాదుల నిర్మించినాను. నన్ను క్షమింపఁగోరెదను" అనగా, తానీషా యుగ్రుఁడై "మాపైకము వసూలగువఱకును కారాగారమున నుండ వలయు" ననెను. రామదాసు కారాగృహమునకుఁ గొంపోఁబడెను.

నిబిడాంధకార బంధురమైయున్న కారాగృహమున రామదాసు పడియుండెను. ఆతని చిత్తము వ్యాకులితమైయుండెను. తానీషా రామదాసును బెక్కుతీరుల బాధించెను. తానీషా యాపైకము వసూలగుట కేదుదినములు గడువిచ్చియుండెను. ఆ గడువుముగిసెను. రామదాసు "హే రామచంద్రా! దయానిధే! నన్నేల రక్షింపవు? నీవంత కఠినుఁడవైతివేల? నీ భక్తుఁడను కానా? నాయవస్థ నీకు జాలిగొలుపుట

లేదా ? లేపటిదినమున తానీషా నన్నెట్టి శిక్షవిధించునో, నేను వినను త్రాగి, మరణింతును " అని వివిధములఁ విలపించెను

ఆ రాత్రి శ్రీరామలక్ష్మణులు తానీషాకు స్వప్నమున సాక్షాత్కరించిరి. అంతతానీషా చిత్తమున మహాపరివర్తనము ఘటిల్లెను. రామలక్ష్మణులు భటులవలె వేషము వైచికొని, తానీషా యంతఃపురమునఁ బ్రత్యక్షమై " అయ్యా ! ఇదిగో ! రామదాసు మీకీయవలసిన యాఱులక్షల రూపాయలును స్వీకరించి, రసీది " మ్మనిరి.

తానీషా విస్మితుఁడాయెను. రసీదిచ్చెను. రామోజీ లక్ష్మోజీ లంతర్హితులైరి. అంతఃపుర ద్వారములన్నియు బంధింపఁబడి యుండెను. అట్టి యసమయమున వచ్చి, యంత ధనమిచ్చి, రసీదుల నందినవారు తప్పక శ్రీరామలక్ష్మణులే యైయుందురని యూహించి, మఱుచటి దిన ముదయమున రామదాసుకడ కేగి, " రామదాసూ ! నీవు మహాభక్తుఁడవు. మహామునులు ఘోరకాంతారములందు కఠిననియమబంధితులై తపంబొనరించినను లభించని దర్శనభాగ్యము నాకు లభించినది. కాని వారే రామలక్ష్మణులని గుర్తింపజాలని మందబుద్ధినైతిని. ఇదిగో నీ యాఱులక్షల పైకమును, శ్రీరామచంద్రుని కైంకర్యార్థమే వినియోగింపుము " అని వేఁడుకొనెను.

రామదాసు భద్రాద్రికరిగి, చిరకాలమా శ్రీ రామచంద్ర చరణారవింద సేవాతత్పరుఁడై గడపి, వైకుంఠముఁ జేరెను.

---

# 31 గోపీచంద్.

కాంచనపుర రాజ్యమునకుఁ త్రిలోకచంద్రుఁడను తేఁడధిపతియై, ప్రజానందకరముగ రాజ్యమేలుచుండెను. ఆతని సతి మైనావతి. ఆ దంపతులకు గోపీచం దను కుమారుఁడు కలఁడు. త్రిలోకచంద్రుఁడు చిరకాలము రాజ్యపాలనముఁ జేసి, పరమపదించెను. గోపీచందు రాజయ్యెను. అహర్నిశము లాతఁడు విషయలాలసుఁడై, వారాంగనాలోలుఁడై, రాజ్యపరిపాలనమునెడ నించుకైన శ్రద్ధలేకయుండెను. ఆతని జనని మైనావతి కుమారుని యవినీతిప్రవర్తనమునకెంతయుఁ జింతించుచుండెను.

ఒకనాఁడు జాలంధరుఁడను యోగి, యడవినుండి కట్టెలమోపును గొని యాశ్రమమునకు రాజవీథినుండి నడచిపోవుచుండెను. కట్టెలమోపు యోగి శిరస్సుపై నొకమూర యెడముగానుండెను. ఆ యద్భుతము నెల్లరునుగాంచి, యాశ్చర్యసాగర నిర్మగ్నులగుచుండిరి. రాజసౌధముపైనుండి మైనావతి జాలంధరయోగినిఁజూచి, యాతఁడు మహాత్ముఁడై యుండనోపుననియెంచి, ఫలపుష్పాదులఁగొని, యాసంయమీంద్రునకు సమర్పించి, "మహాత్మా! ఒక్కక్షణము సౌధములోనికివచ్చి విశ్రాంతినొందఁగోరెద" ననివేడెను. జాలంధరయోగి యామెకోరికననుసరించి, యంతఃపురములోనికేగి, మైనావతికి జ్ఞానోపదేశముఁజేసి, తీఱికయైనపుడు తనమఠమునకువచ్చి, యుపదేశమునొందనగుననిపలికి వెడలెను.

మైనావతి భగవద్ధ్యానాసక్తయై, యపుడపుడు జాలంధరయోగి మఠమున కేగుచుండుటయు, నప్పుడపుడాయోగి యంతఃపురమునకు

వచ్చుటయు జరుగుచుండెను. గోపీచంద్ రాజుభార్య యొకనాఁడు "నాథా! మీజనని యనుదినము జాలంధరయోగిమఠమున కేగుచున్న విషయమునుగుఱించి, పౌరులు వివిధములఁ జెప్పుకొనుచున్నారు" అనెను. ఆమాట గోపీచందుని హృదయాంబరమున ననుమానమేఘములవ్యాపింపఁజేసెను. మఱునాఁడాతఁడు తానుయోగీంద్రులకు విందు చేయ సంకల్పించితిననిచెప్పి, యంతఃపురమునకు రప్పించెను. రాత్రి వేళ జగమంతయు నంధకారబంధురమై యుండుటచే నచ్చటనే విశ్రమించెను. గోపీచంద్రునిచే నియోగింపఁ బడినభటులు యోగీంద్రుని నగరమువెలుపలనున్న యొకపాడునూతిలోఁ ద్రోసివేసిరి. జాలంధర యోగి, యోగవిద్యావిశేషముచే జలమునమునిగిపోక తేలియుండిరి. మైనావతి గురువర్యునిగానక మిక్కిలి పరితపించుచు, నాందోళనాయత్త చిత్తయైయుండెను. కొలఁదివత్సరములుగడచెను. కానీఫ్‌నాథుఁడను జాలంధరయోగిశిష్యుఁడు పెక్కుమందిశిష్యులతో గురువర్యునివెదకుచు తిన్నగాఁ గాఁచనపురికివచ్చెను.

నాఁడు గోపీచందు శిరస్నానము సేయుచుండెను. ఒకభార్య నలుగిడుచుండెను. మఱొకసతి జలముఁబోయుచుండెను. మేడపైఁ గూర్చుండి, మైనావతి కుమారుఁడారీతిగా నైహికసుఖలోలుఁడై మోక్ష మార్గమునుగానక యున్నాఁడని, మిక్కిలివిచారించుచు దుఃఖాశ్రువుల రాల్చెను. ఆ యశ్రుబిందువులురెండు గోపీచందుశిరముపైఁబడెను. ఆతఁడులికిపడి, సాశ్రుపూరితలోచనయైయున్న తల్లినిఁజూచి, స్నానానంతరమామెను సమీపించి, "తల్లీ! నీవిచారమునకు హేతువే" మని యడుగ, నామె "నాయనా! జీవితవ్యవధి కడుస్వల్పము. ఈ స్వల్పవ్యవధిని విజ్ఞులు పరమార్థతత్త్వవిచారమున కుపయోగించి, జన్మ రాహిత్యము నొందుటకే ప్రయత్నింతురు. నీవట్టిదేమియులేకుండ,

మూఢుఁడవై తుచ్ఛమగు కామప్రవృత్తితోఁ గాలము వ్యర్థపఱచు కొనుచున్నావే యని చింతించుచున్నా" ననెను.

"అమ్మా! నేనిపుడు పశ్చాత్తాపము నొందినాను. సజ్జనసహవాసమునఁగాని, సద్గురుశుశ్రూషచేఁగాని, నైహికసుఖములపై విరాగము జనింపదుగదా! నేనే సద్గురునాశ్రయించి, మోక్షగామినగుదు?" ననెను—

"తనయా! జాలంధరులను యోగిపుంగవు లస్మద్గురువర్యులు మహాజ్ఞానులు. వారిపుడుకాన్పించుటలేదు. ఏమైరో తెలియ" దని మైనావతిపలుక, విచారబాష్పాక్రాంతలోచనుఁడై గోపీచందు జాలంధరయోగికిఁ దానుజేసిన యపకృతినెఱింగించెను. మైనావతి మహావ్యధితాత్మయయ్యెను. కానీఫ్‌నాధునిరాకనుగూర్చివిని, యామె యచ్చటికేగి, కుమారుఁడొనరించిన యవివేకకృత్యమును దెలిపి, యాతప్పు సైరింపుమని వేడెను.

గోపీచందుకూడ కానీఫ్‌నాధునిదర్శించి, యామహామహునిపాదములపైఁబడి, తన్నురక్షింపుమని వేఁడుకొనెను. ఆతనివలన జాలంధరులేనూతిలోఁ బడియున్నారో యెఱింగి గోపీచందుని స్వర్ణ, రజిత, తామ్రాయః ప్రతిమలఁజేయించి, కానీఫ్‌నాధుఁడా నూతికడకుఁ బోయెను. స్వర్ణప్రతిమ నచటనుంచి, "గోపీచంద్! గురువర్యుని క్షమార్పణకోరుకొను" మనెను. గోపీచంద్ "మహాత్మా! నేను గోపీచందు" ననెను. "భస్మీభూతుఁడవుక" మ్మని లోనుండి వినవచ్చెను. అట్లే నాల్గు ప్రతిమలును దగ్ధమైపోయెను. జాలంధరయోగి యీవలికివచ్చి, యనుతాపానలతప్తుఁడై, దుఃఖాకులనయనుఁడై యున్న గోపీచందునుజూచి, క్షమించెను.

గోపీచందు "మహాత్మా ! నాకిఁక సంసారమువలదు. సన్యాసాశ్రమస్వీకారమొనరించుటయే నాకోరిక. నాకు జ్ఞానోపదేశముఁ జేయు" మనివేడెను. జాలంధరుఁడెంతగా వలదనిచెప్పినను విననందున జ్ఞానోపదేశముచేసెను. గోపీచందు తీర్థయాత్రలఁజేసి, యొకనాఁడు భిక్షార్థము సోదరియింటికేపోయెను. ఆమె యాతనినిగుర్తించి, దుఃఖాత్మయై "అన్నా ! ఇదియేమి విపరీతవేషము ? అలకాపురినిమించు నంతఃపురమును, యింద్రుఁడైన పొందలేని వైభవమును, హంసతూలి కాతల్పములను విడనాడి, సన్యాసము స్వీకరింపనేల ?" నని ప్రశ్నించెను—

"అమ్మాయీ ! సంసారము మాయ. అదియొకజాలము. ఆ వలలోఁజిక్కుకొనినవాఁడు మోక్షమునొందుననుమాట కల్ల. విషయజాలసుఁడై, భోగభాగ్యములఁ జాలకాలముగడపితిని. నాకీజీవితమే మహానందప్రదము. నేనిపుడు మోక్షగామి" నని పలికి, భిక్షాన్నముమాత్రమేగొని వెడలిపోయెను. గోపీచంద్రరాజు "భక్తగోపీచం" దను ఖ్యాతి దిగంతవిశ్రాంతమయ్యెను.



# 32 త్యాగరాజు.



దక్షిణదేశమున సంగీతమునకుఁ బుట్టినిల్లని చెప్పఁదగిన తంజావూరునకు సమీపముననున్న తిరువయూరను గ్రామంబున మహాభక్తుఁడైన త్యాగరాజు జన్మించెను. త్యాగరాజు, గిరిరాజకవి యను త్రిలింగవైదిక బ్రాహ్మణుని మనుమఁడు. గిరిరాజకవికి రామబ్రహ్మమను తనయుఁడు కలఁడు. ఆతనికి పంచాపకేశుఁడు, రామనాథుఁడు, త్యాగరాజు నను కుమారులుకలరు. ఆ త్యాగరాజే మన కథానాయకుఁడు. పెద్దకుటుంబ మగుటచే, జీవయాత్ర దుర్ఘటముకాఁగా, రామబ్రహ్మము సకుటుంబముగ కుంభకోణమునకుఁ బోయెను. పంచాపకేశరామనాథులు లౌక్యవ్యవహారముల సరిఁజూచుచు కాలక్షేపము చేయ నారంభింప, త్యాగరాజు సంగీతము నభ్యసించు తలంపుతో సకలశాస్త్రాధ్యయన మొనరింపసాగెను. ఆ కాలమునఁ బ్రసిద్ధిఁగాంచియున్న సొంఠి వెంకటరమణయ్యగారి కడ త్యాగరాజు సంగీత మభ్యసింపసాగెను. దినదినము నాయనకుఁ శ్రీరామచంద్రుని యెడలఁ గలభక్తి యనిర్వచనీయ మగుచుండెను. త్యాగరాజునకుఁ బదునాలు సంవత్సరముల ప్రాయము వచ్చునరికి, తలిదండ్రులు గతించిరి. త్యాగరాజు మహాభక్తుఁడై యహర్నిశములు శ్రీరామచంద్రునే భజించుచుండెను. ఇట్లుండఁగా, నొక యోగివచ్చి, శ్రీరామ మంత్రోపదేశముజేసి, వెడలెను.

ఆ యోగి యాదేశానుసార మయ్యవారు రామమంత్రము తొంబదియాఱుకోట్లు జపించి, మహామునిదుర్లభమైన శ్రీరామసాక్షాత్కారము నొందెను. శ్రీరామ మంత్రము తొంబదియాఱుకోట్లు

జపముసేయుటకుఁ బదునాలువర్షము లయ్యెను. శ్రీరామచంద్రుఁడు ప్రత్యక్షమైనంతనే త్యాగరాజు నిరవధికానంద భరితాత్ముఁడై కీర్తనల రూపమున స్తుతింపసాగెను. అపుడే "బాలకనకమయచేల" అను కీర్తనఁ బాడెను. అనేకులు త్యాగరాజు గృహమున కరుదెంచి, యా కీర్తనల నాలకించి, ప్రముదితాత్ము లగుచుండిరి. ఒకప్పుడు తంజావూరునేలు రాజేంద్రుఁడు తనయాస్థానమున గానమొనరింప రమ్మని యాహ్వానించెను. "కానిచ్చునదియె గొప్పయెనురా" యను కీర్తన పాడి, త్యాగరాజు యాహ్వానము నిరాకరించెను. అట్లు చేయుట తోడనే, అయ్యవారి యన్నల కాగ్రహము కలిగెను. ఆ రాజన్యుని కోరిక చెల్లించి, దారిద్ర్యముఁ బాపుకొనరాదా యని, యయ్యవారి సోదరులు కోపించి, రామువిగ్రహములఁ గావేరీ నదీజలంబులఁ బాఱవైచిరి. అపుడే యయ్యవారు "ఏమిసాపము చేసితిరా" యను కీర్తనఁ జెప్పెను. ఎన్నియో దినములు కష్టపడి వెదకగా త్యాగరాజులకు శ్రీరామువిగ్రహములు కాన్పించెను. అంతనాతఁడు 'రారా మా యింటిదాక రఘువీర సుకుమార మ్రొక్కెదరా' యను కీర్తన పాడెను.

త్యాగయ్య యొకప్పుడు తిరుపతికిఁబోయెను. వెంకటేశ్వరస్వామి ముందు తెఱ యున్నందున త్యాగరాజు భక్తిపరవశుఁడై "తెఱ తీయగరాదా" యని పాడెను. శివునకు, విష్ణువునకును భేదములేదని గ్రహించి, "ఎవరని నిర్ణయించేదిరా" యని పాడెను. ఇట్టివే యెన్నో సందర్భములందుఁ జాలకీర్తనల రచించి, పరాభవనామ సం॥ర పుష్య బహుళ పంచమినాఁడు పరమాత్మ సాయుజ్యము నొందెను. సంగీత ప్రపంచమున కాదిపురుషుఁడైన యీ మహనీయుఁడు పాంచభౌతిక శరీరమువీడి, వైకుంఠమున కేగినను, కీర్తిమాత్ర మాచంద్రతారకముగ నిలిచిపోయినది.

---

# 33 శ్రీ రామతీర్థస్వామి.



శ్రీరామతీర్థస్వామి పంజాబునందలి మురళీవాలా యను గ్రామంబున 1873 సం॥ రమున జన్మించెను. రామతీర్థుని తండ్రి హీరానందుఁడు. బాల్యముననే రామతీర్థుడు, తల్లినిగోల్పోయెను. అందుచే నాతని పెదతండ్రి గోస్వామి గురుదాసును, మేనత్తయును పెంచసాగిరి. మాతృస్తన్యభాగ్యము లభించని రామతీర్థుఁడు గోక్షీరమునే త్రాగుట కలవాటుపడెను. అసాధారణ మేధాసంపన్నుఁడగు శ్రీరామతీర్థులు పాఠశాలలో విద్యార్థులందఱిలో మేటియై ప్రకాశించుచుండెను. ఒక్కక్షణమైన వెచ్చింపక యాతఁడు సదా విద్యాభ్యాస మొనరించుచుండెను. గణితమునం దీతని ప్రజ్ఞ యసమానమైయుండెను. ఒక తరగతినుండి, మఱొక తరగతికీతఁ డుచితవిద్యార్థివేతనమునంది, వృద్ధిలోనికి వచ్చెను. రామతీర్థుఁడు ప్రవేశ పరీక్షయం దుత్తీర్ణుఁడై, కళాశాలా విద్యాభ్యాసమునకు దొరకొనెను. నానాఁటికి దారిద్ర్య మతిశయించెను. ఆతఁడు భోజనము మానినైనను, చదువున కాటంకముఁ గలుగకుండ చేసికొనుచుండెను. 1893 సం॥ రమున నతఁడు యం.యే. ప్యాసయ్యెను. గణితశాస్త్రమున, చిత్రలేఖనమున, కవిత్వమున నీతఁ డనుపమానమగు ప్రజ్ఞ సంపాదించెను. రామతీర్థుఁడు యం. యే. ప్యాసగుసరి కిరువది వత్సరముల వయస్సుగలిగి యుండెను. ఆతని యారోగ్యమునకు భంగమొదవెను. ఆతఁ డారోగ్యముకొఱకు శరీర పరిశ్రమ మారంభించెను.

కొలఁది కాలములో రామతీర్థుఁడు సుందరాంగుఁ డాయెను. లాహోరు ఫార్మన్ క్రిస్టియన్ కాలేజిలో నాతఁడు గణితశాస్త్రాధ్యాపకుఁడుగా నియోగింపఁబడెను. రామతీర్థుఁడు సచ్ఛీలయగు కన్యను

బరిణయము చేసికొనెను. అతనివలెనే, భార్యకూడ పారమార్థికచింత నము గల్గియుండెను. రామతీర్థులు హాక్స్లీ, స్పెన్సర్, మున్నగు వేదాంతుల గ్రంథములను, కపిల, గౌతమ, జైమినీ ఋషుల సూత్రార్థములను జదువుటయేగాక, పారశీక, ఉర్దు భాషలుగూడ నేర్చెను. రామతీర్థులు తాను గ్రహించుచుండిన మహాద్భుత వేదాంతరహస్యములను సతికిఁ దెలుపుచు, నామెనుగూడ జ్ఞానిగఁ జేసెను. రామతీర్థుఁడు శ్రీకృష్ణునియెడల భక్తి కలిగి, యాతని సాక్షాత్కారము నొంద ప్రయత్నించెను. రావీనదీతీరమున నేకాంతముగ గూర్చుండి, యహోరాత్రము లాధ్యాత్మికచింతన మొనరించెను. అనేక పర్యాయములాతఁడు హృషీకేశమునకు, హిమాలయ పర్వతములకడకుఁ బోయి, తుదకు బ్రహ్మపురికాంతారవములం దాత్మసాక్షాత్కారము నొంది, యింటికిఁజనెను. పిదప నతఁడు రెండుసంవత్సరములు మాత్రమే గృహస్థాశ్రమము నెఱపెను.

రామతీర్థులు ముక్తికాంతా కరగ్రహణ మొనరించుటకు నిర్జన స్థలమున నివసించుటయే యని తలంచి, 1899 సం॥ రము మొదట మూడు వత్సరములు హిమవత్సైల భూములందే జపతపంబు లొనరించుచు గడపెను. మహాభక్తులగు తుకారాం, చైతన్య, చోకామేళ, తులసీదాసుల భక్తివైరాగ్యభావము లీతనియందు మూర్తీభవించెను. కంటకాన్వితములైన యరణ్యములందు రామతీర్థుఁడు నిర్భయముగ నడచిపోవుచుండెను. రామతీర్థునకు ఓంకారజపమునఁ జాలనమ్మకముండెను. ఆతఁడు హిమాలయపర్వత ప్రాంతముల వసించుయోగులతోఁ గలిసి, యొకప్పుడు తత్త్వవిచారణ చేయుచుండఁగా, నాతని బంధుగుఁ డొకఁ డరుదెంచి, "రామతీర్థా! ఏమని చెప్పుదును? నీ కుమారుఁడు కాలధర్మము నొందినాఁడు". అని చెప్పెను. రామ

తీర్థస్వామి యేమాత్రము విస్మయమును ప్రకటించక "పుట్టినవా రెల్లరు మృత్యువుపాలగుట స్వాభావికమేగదా" యనెను. 1901 సం॥ రము రామతీర్థస్వామి గంగోత్తరినుండి, జమ్నోత్తరికి బయలుదేఱెను. ఆమార్గము దుర్గమమై, పది దినములవఱకు బట్టుచుండెను. ఆతఁడు జమ్నోత్తరియం దున్నపుడు సుమేరూసందర్శన మొనరింపఁదలంచి, యిర్వురు శిష్యులతో బయలుదేఱెను. అత్యంతరమణీయమైన యీ ప్రదేశమును జూడ నాతఁడు మిక్కిలి కుతూహలము గలిగియుండెను.

ఫర్లాంగునకుఁబైగా దూరమునుండి, సుమారు నూఱడుగుల ఎత్తున నున్నయాపర్వతమును, చలింపనిధైర్యముతోఁ నాపర్వతముం జేరి, యచ్చటిప్రకృతి శోభనుగాంచి, మహదానందభరిత స్వాంతుఁ డయ్యెను. అచ్చటినుండి యాతఁడు వశిష్ఠాశ్రమవనంబునకరిగి, యొక చిన్న కుటీరమును నిర్మించుకొని కొంతకాలమట వసించెను. పిదప స్వామి కౌడియాశైలప్రాంతమున కొంతకాలముండెను. 1902 ఆగష్టు 20 వ తారీకున శ్రీరామతీర్థస్వామి కలకత్తాలో స్టీమరునెక్కి జపానుదేశమున కేగెను. టోకియో, యొకహామానగరములందు రామతీర్థస్వామి యొసంగిన మహోపన్యాసములను జపానునందలి పత్రికలును, విమర్శకులు, కవులును మిక్కిలిగఁ బొగడినవి. అటనుండి, రామతీర్థు లమెరికా దేశములోని సాన్‌ఫ్రాంసిస్కోనగరమున కరిగిరి. వేదాంతమునుగూర్చి పెక్కుమహోపన్యాసముల నొసంగెను. అనేకులు రామతీర్థులయుపన్యాసముల నాకర్ణించి, సంతృప్తచిత్తులగుచుండిరి. ఆడంబరమునెడ నిష్టము లేనిస్వామి, రాంచి యను యేకాంతప్రదేశమున నివసింపసాగెను. అచ్చోట శాక్రమెంటునది ప్రవహించుచుండెను. అనేకులు స్వామి యుపదేశముల వినుచుండిరి.

ప్రశాంతము, మనోజ్ఞమునగు ప్రకృతియే మానవుని హృదయమునకు నిరవధికానందము. పారమార్థికచింతనముఁ గల్గించునని రామతీర్థస్వామి పల్కుచుండెను. స్వామి తన్నుఁజూడనే తెంచినవారిని "నా ప్రియతత్వస్వరూపులారా" యని పిలుచుచుండెను. రామతీర్థస్వామి భారతీయుల విజ్ఞప్తియను గ్రంథము విరచించెను. తన్నుజూడనేతెంచిన యమెరికాఖండపుఁ బ్రెసిడెంటునకు స్వామి యాగ్రంథము నొసంగెను. ఆ ప్రసిడెంటు యాగ్రంథమును దనకన్నులకు లక్షపర్యాయములు ప్రేమపూర్వకముగ నద్దుకొని చదివి, సంతోషమునొందెను. ఆసమయమున యొక యమెరికనుకాంత స్వామినిసందర్శించి, యామహాత్మునివలన నుపదేశమునొంది శిష్యురాలాయెను. ఆమెకు స్వామి సూర్యానదంయని పేరుపెట్టెను. ఆమె తుదకు స్వామియెడగల భక్తిచే హైందవుల యాచారవ్యవహారాదుల గమనించుటకై హిందూదేశమునకువచ్చెను. న్యూయార్కు, చికాగో మున్నగు నగరముల సందర్శించి, శ్రీరామతీర్థస్వామి యనేకసంస్థలనేర్పఱచి, 1904 జూన్ 30, 31 తేదీలందు సెంట్‌లూయీనగరమున ప్రపంచసమ్మేళనసభలో మహాద్భుతముగ నుపన్యసించి, యఖండప్రఖ్యాతి నొందెను. స్వామి అక్టోబరు 1 వ తారీఖున ఫ్లారిడాకరిగి, యటనుండి జిబ్రాల్టరుమీఁదుగా నీజిప్టుదేశమునకుఁబోయి, పెక్కువేలమంది మహమ్మదీయులు సమావేశమైన మసీదులో పారశీకభాషలో నత్యద్భుతముగ నుపన్యసించెను.

అటనుండి రామతీర్థస్వామి అజ్మీరు, పుష్కర్, జయపూర్, ఆల్వార్, హరిద్వారములఁ జూచెను. అచ్చటినుండి హిమాలయపర్వతప్రాంతముననున్న టెహ్రీ సంస్థానములోని గార్వాల్ నగరమునకరిగి, యటనొక యాశ్రమముననుండి పెక్కువేదాంతగ్రంథముల విరచించెను. 1906 సం॥ రమున నక్టోబరు నెలలో నొకనాఁడు రామతీర్థస్వామి తనకవసానదశ యాసన్నమైనదని యెఱింగి "ఓ మృత్యువా! ఈ జీవి

తము నాకిఁక చాలును. నన్ను నీలోనికిఁ గొనిపొమ్ము. మఱలనాకు నిరంతరము నిరతిశయానందకరమైయుండు జన్మనొసంగు" మని, వ్రాసి గంగానదికి స్నానముచేయుటకుఁబోయి, నదిలోమునిఁగి మృతినొందెను.

పాపము, శ్రీరామదీర్థులు మృతినొందునరికి ముప్పదిరేండ్ల వయస్సేయుండెను. ఆయనయింకను మహోత్కృష్టగ్రంథములరచించి యుండుననకాశము లేకపోయినందులకుఁ బ్రపంచములోని వారెల్లరు దుఃఖశారాశినిమగ్నులైరి. నేఁటికిని స్వామిజ్ఞాపకార్థము హృషీకేశమున స్థాపింపఁబడిన గ్రంథభాండాగారమును కాననగును.

---

# 34 బుద్ధుఁడు.



సుద్ధోదనుఁ డనురాజు 'కపిలవాస్తు' పట్టణము రాజధానీనగరముగఁ జేసికొని, జనామోదకరముగ పరిపాలించుచుండెను. అతని సతి మాయాదేవి, సకలసద్గుణసంశోభితయై యొప్పుచుండెను. ఆ దంపతులకు సంతానమే కొఱవడియుండెను. తదన్యవిచార మెద్దియును వారి చిత్తములందు లేకుండెను. ఆ దంపతు లనేక దానధర్మములఁ గావించిరి. తుదకు మాయాదేవి సపరివారముగ నొక యరణ్యమునకుఁ జని, యొక పర్ణకుటీరము నిర్మించుకొని యట నిశ్చలచిత్తయై జపతపముల నొనరించెను. దైవానుగ్రహమున నామె గర్భవతియై, నవమాసములు గడచిన పిదప, బాలసూర్యప్రభావిభాసితుండైన పుత్రునొకనిఁ గాంచెను. పుత్రజనన శుభవార్త నాకర్ణించి, శుద్ధోదనుఁడు మేరమీఱిన

యానందము నొందెను. మాయాదేవి మహావైభవముగ నూరేగుచు నగరములోనికి వచ్చెను. ఆబాలునకు సిద్ధార్థుఁడని నామకరణ మొనర్పఁబడియెను. ఒకనాఁడు రాజు నాస్థానమునకుఁ గొందఱు జ్యోతిష్కులరుదెంచిరి. వారలకు శుద్ధోదనుఁడు సిద్ధార్థునిఁ జూపి, "ఈ బాలుని జాతకఫలముల వ్రాయుఁ" డని యడిగెను. ఆ జ్యోతిష్కులు జాతకమును జాగ్రతగఁ బరిశీలించి, "ఓ రాజా! ఈ జాతక మసమానమైనది. ఈ జాతకునకు రెండేదశ లున్నవి. సర్వసర్వంసహాధిపతియై, భూచక్రమును బరిపాలించుట లేక సర్వసంగపరిత్యాగియై, సత్యాన్వేషణ మొనర్చి మతోద్ధారకుఁడై యాచంద్రతారక యశఃకాముఁడగుట".

శుద్ధోదనుఁ డాలోచించి "నా కుమారునకు సన్యాసముపై నెప్పుడును భ్రాంతి కలుగకుండ జేయలేనా?" యని ప్రశ్నింపఁగా, నా యాగతానాగతకోవిదులు "ఓ రాజన్యా! నీ కుమారుఁడు దుఃఖకారణమగు విషయమును గాంచనంతకాలము విరక్తి నొందఁజాల" డని పలికి వెడలిరి. ఎన్నఁడును, రాకుమారుఁ డుద్యానవనవిహారమునకుఁ జనునపుడు వ్యాధిగ్రస్తుఁడు, మృతుఁడుగాని, సన్యాసిగాని కనబడకుండు కట్టుదిట్టముఁజేసెను. సిద్ధార్థుఁడు నవయౌవనోత్సాహియై, సకలశాస్త్రపారంగతుఁడై, ధనుర్విద్యాకుశలుఁడై యుండెను. శుద్ధోదనుఁడు పొరుగు రాజ్యమునేలు నృపాలుని కుమార్తె యశోధరను కుమారునకుఁ బెండ్లిచేసెను. అసమానసౌందర్యోజ్వలయైన యా యశోధరతో సిద్ధార్థుఁడు నివసించుటకు మూఁడు మేడలు నిర్మింపఁబడెను. ఒకటి స్వర్ణవినిర్మితము. రెండవది రజితనిర్మితము. మూఁడవది కాచవినిర్మితము.

ఒకనాఁటి సాయంసమయమున సిద్ధార్థుఁడు వాహ్యాళికై రథము నెక్కి బయలుదేఱెను. రాజభటులు జనసంచారమును నిరోధించిరి. సిద్ధార్థుఁడు రథముమీఁద పోవుచుండగా నొకరోగి కఱ్ఱ నూఁతగాఁగొని నడచుచుండుటచూచెను. సిద్ధార్థుఁడు రథచోదకునిగాంచి, "ఛన్నా! అతఁడెవరు? మానవలె నడవక నతఁడు కఱ్ఱనేల యూఁతగాఁగొని నడచుచున్నాఁ?" డని ప్రశ్నించెను.

"రాజకుమారా! అతఁడు రోగగ్రస్తుఁడై యున్నాఁ" డని, ఛన్నుఁడు పలుక "మనమందఱమును యెప్పుడో యొకప్పుడు రోగులము కావలసినదేనా?" యని సిద్ధార్థుఁడు ప్రశ్నించెను. "అవును. బాల్య, యౌవన, కౌమార, వార్థక్యదశలందు మనమందఱము నెప్పుడో యొకప్పుడు వ్యాధిగ్రస్తులము కావలసినదే" యని ఛన్నుఁడు బదులుచెప్పెను.

"జీవిత మింతటిదేనా?" యని సిద్ధార్థుఁడొక వేఁడినిట్టూర్పు విడిచి "రథమును వెనుకకు మఱలించు" మనెను. విచారరేఖాంకిత వదనుఁడై యున్న కుమారునిఁగాంచి, శుద్ధోదనుఁడు యావద్వృత్తాంతమును దెలిసికొని, దుఃఖితుఁడయ్యెను. మఱునాఁడు సిద్ధార్థుఁడు మఱల వాహ్యాళికి బయలుదేఱి, యొక ముదుసలినిగాంచి, "జీవికి వార్థక్యము తప్ప" దని తలంచి, మఱల నంతఃపురమునకే వెడలెను. ఆ మఱుచటి దినంబున సిద్ధార్థుఁడు మృతునొక్కని శ్మశానమునకుఁ గొనిపోవుచుండుట, నామృతు ననుసరించి - బంధుజనమేడ్చుచు పోవుచుండుటగాంచెను. సిద్ధార్థుని చిత్తము భయోద్విగ్నమయ్యెను. మఱునాఁడు సిద్ధార్థుఁ డెప్పటియట్ల వాహ్యాళికేగుచు, కాషాయవస్త్రధారియగు యోగి నొక్కనిం గాంచి, "ఛన్నా! ప్రతిజీవికిని రోగము,

ముదిమి, మృత్యువుతప్పదని గ్రహించితిని. మఱి యాతఁ డెవ ? ” రని ప్రశ్నింప, నతఁ డిట్లనె—

“ రాకుమారా ! సర్వసంగపరిత్యాగియైన యీసన్యాసి ప్రశాంతముగ జీవించును. భిక్షాన్నమునే భుజించును. ఏ నదీతీరముననో నిశ్చలచిత్తుఁడై దైవసాన్నిధ్యముఁ జేరుటకై తపమొనరించును. ప్రపంచము మాయామయమని, విషయసుఖములు, నైశ్వర్యము నశాశ్వతములని యీతని యుద్దేశములు. ”

తానుగూడ నట్లయినచో బాగుండునుగదా యని సిద్ధార్థుఁడు తలంచెను. దుఃఖభరితాత్ముఁడై యాతఁ డంతఃపురమునకుఁ బోయెను. శుద్ధోదనుఁడు జరిగినదంతయుఁ దెలిసికొని, కుమారునిచిత్తము న్యస్తముఁగాకుండ, వారకాంతల నృత్యగానములఁజేసి, యాతని రంజింపఁ జేయుమని పంపెను. ఆ వెలయాండ్రు జగన్మోహనకరముగఁ బాటలఁ బాడసాగిరి. ఆ గాన మాతనిచిత్తము నాకర్షింపలేదు. సంసారము మాయా మగుట, సత్యమునేదో యరయుటకై సిద్ధార్థుఁడు దృఢముగ నిశ్చయించుకొనెను. ఇంతలోఁ దనకు పుత్రోదయమైనదని భటుఁడు తెలిపెను.

“ మఱల నిదియొక క్రొత్తయవరోధమా ” యని సిద్ధార్థుఁడు తలపోసెను. ఎట్లైనను సంసారమువీడి సన్యసించుటకే యాతఁడు కృతనిశ్చయుఁడై యుండెను. పురమునందెల్లెడల నానందకోలాహలధ్వనులు చెలరేగుచుండెను. ఆ మధురనినాదము లాతనివీనులఁ జొరలేదు. అర్థరాత్రమున జగత్తునిశ్శబ్దాధదేవతయొడిలో నిద్రించుచుండఁగా, సిద్ధార్థుఁడు మెల్లగా లేచెను. భార్యశయ్యాగారమువంక నాతఁడుచూచినాఁడు. ఆమె నిశ్చింతగా నిద్రించుచుండెను. ప్రక్కలోబిడ్డయుండెను. ఆతఁడు చలింపలేదు. తిన్నగానాశ్వశాలకుఁబోయి, మెల్లగా

"ఛన్నా !" యనిలేపెను. ఛన్నుఁడులికీపడిలేచి "స్వామీ! ఎందుల ?" కనెను. "నా 'కంటక' నామాంకితమైన ఘోటకమును దెమ్ము. ఏమియు సద్దుచేయవలదు" అని సిద్ధార్థుఁడు పలికెను. నగరద్వారములన్నియుఁ దెఱువఁబడియుండెను. సిద్ధార్థుఁడు ఛన్నుఁడును దెల్లవాఱునంతవఱకును బయనమొనరించి, రాజ్యముయొక్క సరిహద్దులను దాఁటిపోయి, యొకనదీతీరముంజేరిరి. తత్తీరంబున సిద్ధార్థుఁడొక సన్యాసినిఁగాంచెను. ఆయోగినడిగి, కాషాయాంబరములుధరించి, సిద్ధార్థుఁడు తనఖడ్గసాహాయ్యంబున కేశపాశము ఖండించుకొనెను. తనదుస్తులను, యాభరణములను, నాతఁడు ఛన్నునికొసంగి "ఛన్నా ! నాతలిదండ్రులతో నాకొఱకు వెదకి, ప్రయాసపడవల" దని చెప్పుము. నేను ప్రపంచము నావరించియున్న యజ్ఞానాంధకారము వెనుకనణగియున్న సత్యమును దెలిసికొనుటకేగుచున్నా" నని పలికి వీడ్కొలిపెను. చేయునదిలేక, మిక్కిలి భారమైన హృదయముతో ఛన్నుఁడు వెడలి పోయెను.

సిద్ధార్థుఁ డాక్షణముమొద లనేకనగరముల సందర్శించి, చాలమంది పండితులఁగలిసికొని, వారికు శ్రూషఁగావించెను. తనహృదయమలజడిపడుచున్న సత్యము లభించకపోవుటచే సిద్ధార్థుని చిత్తమున యశాంతిజనించెను. ఆఱువత్సరములాతఁడు గంగానదీతీరమున నేకాగ్రచిత్తుఁడయి తపమునల్పెను. తపంబువలన నాతనిమేను శుష్కించెనేగాని యేమియులాభము కాన్పించనందున తపముమాని, యొకనాఁడొక యశ్వత్థవృక్షముక్రిందఁ గూర్చుండి, యాలోచనాపరతంత్రుఁడయ్యెను. అప్పుడాతనికి తాను దేనికొఱకై యంత యారాటమునొందుచుండెనో. ఆసత్యము బోధపడెను. ఆ సత్యమును గ్రహింపఁగలిగిన సిద్ధార్థుఁడంతట బుద్ధుఁడయ్యెను. సత్యము, శాంతము, అహింస యాతని సిద్ధాంతములలోఁ బ్రధానమైనవి. మానవునకుఁ బునర్జన్మలేదనియు, నాతఁ

డొనరించు పాపపుణ్యములఫలము నిహామునసే యనుభవించునని యాతని యుద్దేశము.

ఇఁకనుండి బుద్ధుఁడనియే మనమువ్యవహరింతము. బుద్ధుఁడు తన సిద్ధాంతములను ప్రపంచమునకుఁ బ్రచారముచేయఁబూనెను. అనేకులు బుద్ధుని మతమవలంబింపసాగిరి. అతని మతము బౌద్ధమత మని ప్రఖ్యాతినొందసాగినది. ఆనందుఁడందఱుశిష్యులలోను ముఖ్యుఁడై యెల్లప్పుడు బుద్ధుననుసరించియే మెలంగుచుండెను. బుద్ధుఁడు మగధ రాజ్యమును సందర్శించి, యారాజన్యునిఁ దనమతావలంబకునిగ నొన రించెను. ఆతనిభార్య యశోధరయు మఱికొందఱంతఃపురాంగనలును గూడ బౌద్ధమతావలంబన మొనరించిరి. బుద్ధుఁడు తుదకు వైశాలీనగ రమునకువచ్చి, పురబహిఃప్రదేశంబుననున్న నదీతీరమునఁ గాలధర్మము నొందెను. ఆతనిసిద్ధాంతములు పాళిభాషలో స్తూపములపైఁ జెక్కఁ బడినవి. ఈబౌద్ధమతము నేఁడు ప్రపంచమునందంతటను వ్యాపించి యున్నది.

---

# 35 ప్రేమాబాయి.

కాశీనగరమున ప్రేమాబాయి యను సాధ్వికలదు. ఆమె అన సూయ, అరుంధతి, సీత, సావిత్రి, మున్నగువారివలెనే పతిసేవయే గతియని నమ్మి మెలఁగుచుండెను. ఆమె భర్తయు భక్తాగ్రగణ్యుఁడని ఖ్యాతినహించెను. ఆ దంపతులకు చక్కనిపుత్త్రుఁడు కలిగెను. కొంత కాలము కడచినపిదప ప్రేమాబాయి భర్త యసువులఁ బాసెను. ఆమె జీవులకు జననమరణములు సహజములు గనుక, మనశ్శాంతి

పొంది, పుణ్యకార్యములఁ జేయుచు, పరమభాగవతోత్తముల పురాణ కాలక్షేపముల నాలకించుచుఁ గాలము గడపుచుండెను.

ఒకనాఁడు కొందఱతిథు లామెగృహమునకు రాగా, పురాణము వినుట కవకాశము లేకపోయెను. "పురాణము వినుట యెట్లు పుణ్యదాయకమో, భగవత్స్వరూపులగు భక్తుల సేవించుటయుఁ బుణ్యదాయకమె. అయినను నొకపనిచేసెద" నని పుత్రుని బిలిచి, "నాతండ్రీ, నేనిచట నీయతిథుల సత్కరించుచుందును. నీవు పురాణమును వినివచ్చి యచ్చట నీవు విన్నదాని నాకుఁ బూసఁగ్రుచ్చినట్లు చెప్పుదువుగాని" యనెను. ఆ బాలుఁడు పురాణకథాశ్రవణ కుతూహలాయత్తచిత్తుఁడై రయమున నేగెను.

అతిథులుభోజనమొనరించి, వెడలిపోయిరి. ఆమెయుఁ బురాణమునువినివచ్చిన తనయునితో భోజనమొనరించి, "నాయనా! పురాణమెంతవఱకువచ్చిన?" దని ప్రశ్నింప, నాబాలుఁడు శ్రీకృష్ణుని బాల్యక్రీడలు చెప్పిరని వానిని దేటతెల్లముగ నామెకెఱింగించి "అమ్మా! పాపము! ఆచిన్నకృష్ణుఁ డల్లరిసేయకుండ నాతనిజననిఱోటికిఁగట్టెనట. ఆకట్లువిడిపించుకొనఁజాలక కృష్ణుఁడేడ్చెనట. ఆతని నేత్రములు దుఃఖాశ్రుసిక్తము లయ్యెనట" ననెను.

"అయ్యో! శ్రీకృష్ణా! పూతనాదిరాక్షసులఁజంపిన ధీశాలివి. ఱోటిబంధనమునేఁ ద్రెంచుకొనలేకపోయితివా? ఉండు. నేనువచ్చి, నిన్ను బంధనిర్ముక్తుఁ గావించెద" నని, ప్రేమాబాయి బృందావనోన్ముఖయై నడచుచు, భక్త్యాతిశయమున నుసురులఁబాసి, యొకచోఁ బడిపోయెను.

ప్రేమాబాయి భక్తివిశేషమున కెల్లరునుముగ్ధులై "ఇట్టి పరమపవిత్ర చరిత్రను మనమెచ్చటను జూడ" మనివేనోళ్లను పొగడిరి. ఆమె తనయుఁడుకూడ భక్తశిఖామణి యయ్యెను.

---

# 36 భా ను దా సు.

పైఠనుపురంబున నొక బ్రాహ్మణుఁ డుండెను. అతఁడు సంతానముకొఱకు సూర్యునిఁగూర్చి ఘోరమగు తపము నాచరించెను. అతనిభార్య గర్భవతియై, తొమ్మిదినెలలును నిండినవెనుక భానునివలెనే తేజశ్శాలియైయుండు మగశిశువును గాంచెను. తలిదండ్రులా శిశువునకు భానుదాసనిపేరిడి, మిక్కిలి గారాబముతోఁ బెంచుకొనుచుండిరి. భానుదాసు విద్యయందేమియు శ్రద్ధగలిగియుండక, యల్లరిసేయుచుండెను. ఒకనాఁ డాతనితలిదండ్రులు భానుదాసును బిలిచి "నీ విట్లల్లరి సేయుచో, చదువెట్లువచ్చు ?" నని కోపముతోఁ బల్కిరి. ఆపలుకు లాతని కోమలహృదయమున ములుకులవలెనాఁట, నెవ్వరితోను జెప్పకుండ నగరబాహ్యప్రదేశముననున్న వనములలోనికిఁబోయి, యచ్చట నున్న యొక శిథిలదేవాలయమునఁ గూర్చుండి, "అక్కటా ! విద్యాగంధశూన్యుఁడనై యిన్నాళ్ళు వ్యర్థపఱచితిని. విద్యావిహీనుఁడు పశుప్రాయుఁడని పెద్దలందురు. విద్యయున్నచో, నిగూఢవేదాంత రహస్యములను, భక్తితత్వమును దెలియంగఁజాలి యుందునుగదా ! నేను మహాపాపి" నని వాపోవసాగెను.

భానున కీతనియందనుగ్రహము జనింప, మాఱువేషమున నచ్చటికివచ్చి, యాబాలుని దృఢమనోనిశ్చయమును గుర్తించి "నాయనా!

నీవు భక్తాగ్రేసరుఁడ వగుదువు. శ్రీమన్నారాయణు నెల్లపుడును భజించుచుండుము. నీవలెనే బాలుఁడై పరాత్పరుని ధ్రువుఁడాశ్రయించి, యాతనిసాక్షాత్కారము నొందెను. ప్రహ్లాదుడు తండ్రి బాధలనుండి విముక్తిగాంచెను. జీవితమును బుణ్యకార్యాచరణమునకే వినియోగింపుము" అని, పాయసము దాగ్రిగుమనెను.

ప్రచ్ఛన్నవేషుఁడై యుండిన యా సూర్యనారాయణమూర్తి యనుగ్రహించిన పాయసము స్వీకరించి, యాఁకలిదప్పు లెఱుంగక యహోరాత్రములు శ్రీమహావిష్ణువును ధ్యానించుచుండెను. లేక లేక కలిగిన మగబిడ్డ మాయమగుటచే శోకవ్యాకులచిత్తుఁడై భానుదాసు తండ్రి కుమారునివెదకుచు బయలుదేఱి, కొన్నిదినముల కీయాలయమునకువచ్చి, కుమారుఁడు భక్తితన్మయుఁడై యుంటఁజూచి, నిశ్చేష్టుఁడై కొంతవడి మిన్నకుండి, "నాయనా! భానుదాస! మమ్ము విడిచి, యీరీతిగా నిటకు రాఁదగునా? నీతల్లి డోలాందోళితచిత్తయై కృశించియున్నది. ఇంటియొద్దనేయుండి నిరాటంకముగ నీవు దైవారాధనఁ జేసికొనుచుండవచ్చును" అని నచ్చఁబలికి, యింటికిఁ దీసికొని పోయెను.

భానుదాసు యౌవనదశ నందినపిదప, తలిదండ్రులు వివాహముఁ జేసిరి. భానుదాసున కిర్వురు కుమారులు కల్గిరి. ఆతఁడు సంసారము నెడ విరాగమువహించి, యాదినారాయణ భజనముననే మగ్నుఁడై యుండెను. ఆతని తలిదండ్రులు గతించిరి. అప్పుడును భానుదాసు సంసారాపేక్ష వహింపకుండుటచే, నాగ్రామములోని వర్తకులువచ్చి "భానుదాసా! ఇట్లు ప్రవర్తించినచో నెట్లు నీభార్యాపుత్ర కుటుంబము పోషింతురు? నీతలిదండ్రు లున్నంతకాలము నీవు వైరాగ్యశీలుఁడవై యుంటివిగదా? ఇప్పుడుకూడ నట్లున్నచో వారిగతియేమి? నీకు

మేమప్పిచ్చెదము. బట్టలవ్యాపారముఁ జేయుము. నీలాభములోఁ గొంత సంసారమునకు గర్చుపెట్టి, కొంత మాఋణమును దీర్పు" మని, నాల్గువందల రూప్యము లప్పిచ్చిరి.

ఆధనముతో నాతఁడు బట్టలవ్యాపారము నారంభించి, యితరులవలె హెచ్చువెలలకు విక్రయింపక, స్వల్పలాభమునకే విక్రయించుచు, భగవద్విషయములఁ జెప్పుచుండుటచే, నెల్లరు నీతనియంగడికే రాసాగిరి. అతఁ డచిరకాలములో ఋణమును దీర్చివైచెను. ఇతర వణిజు లీతనియెడ మత్సరగ్రస్తులై యుండిరి. ఒకనాఁడు భానుదాసు వస్త్రములబేరము చేయుటకై, యితరవర్తకులతోఁ బొరుగూరికిఁబోయి తిరిగివచ్చుచు నొకచోట భక్తులు భజనసేయుచుండుటగాంచి, తన బట్టల మూటలను, యశ్వమును వారికప్పచెప్పి, "మిమ్ములనొకగంటలో సత్రమునఁ గలిసికొందును. ఈరేయి మనమట విశ్రమింపవలయుగదా!" యనెను.

భానుదాసు భజనకుఁ బోయినంతనే, యసూయాగ్రస్తులై యున్న వర్తకు లాతని బట్టలమూటల నొక నూతిలోఁ బాఱవైచి, యశ్వమును గట్టక, వదలివైచి నిద్రించిరి. చోరు లాసత్రమునఁ జొరఁబడి, యావర్తకులఁ జావఁగొట్టి, బట్టల మూటలను, సొమ్మును దోఁచుకొని పోయిరి. ఆ వర్తకులు "పుణ్యచరిత్రుఁడగు భానుదాసునకు మన మపకారము సేయుటవలననే మనకు దైవమిట్టి హాని కల్గించె" నని పశ్చాత్తాపపడి, విచార భరితాంతరంగులై యుండిరి.

పరమాత్ముఁడు భక్తవత్సలుఁ డగుటచే యా బావిలోని మూటలఁ బైకిఁదీసి, గుఱ్ఱముపై నుంచి, తాను కావలిగనుండెను. భానుదాసు తిరిగి వచ్చుసరికి, శ్రీమన్నారాయణుఁ డదృశ్యుఁడై యుండెను. అతఁడు జరిగినదంతయుఁ దెలిసికొని, "అన్నలారా! మీరు

యితరులకు ద్రోహముఁ దలపెట్టినచో మీకు మఱొకరు హాని తల పెట్టుదురు" అని, తన మాటలు వారు బావిలోఁబడవైచినను, పైనుండుటయుఁ, దడిసిపోవకుండుటయుఁ జూచి, యది భక్తపరాధీనుఁడగు లక్ష్మీకాంతుని లీలయే యని గ్రహించి యమందానందభరితాత్ముఁడై, వేయివిధముల శ్రీహరిని స్తుతించి, తనవస్త్రములను వారికిఁగూడ పంచియిచ్చెను.

భానుదాసు పైఠణపురముఁజేరి, సదా శ్రీమన్నారాయణుని భజించుచు, భక్తులలోఁ దలమానికమను యశస్సు నార్జించెను.

---

## 37 త్రైలింగస్వామి.

:o:

క్రీ॥ శ॥ ౧౫౨౯ సం॥ రమున విజయనగరము జిల్లాలోని హోలియము' అను కుగ్రామమున నృసింహదేవుఁడను బ్రాహ్మణుఁడు నివసించుచుండెను. ఆతఁడు చిరకాలము సంతానహీనుఁడై యుండెను. తనకా భార్యవలన సంతానముఁ గలుగఁదని తలంచి, నృసింహదేవుఁడు ద్వితీయవివాహముఁ జేసికొనెను. అదేమి చిత్రమోగాని, యిర్వురు భార్యలును గర్భవతులై, మగశిశువులఁ గాంచిరి. ప్రథమకళత్రమునకు జన్మించిన శిశువునకు నృసింహదేవుఁడు శివరాముఁడని పేరు పెట్టెను. నృసింహదేవుని కుమారు లిర్వురును దినదినప్రవర్ధమానులైరి. వారలకు వివాహములయ్యెను. శివరాముఁడు నలుబది యెనిమిది వర్షముల ప్రాయముఁగలవాఁడైనంతనే తల్లి మృతినొందెను. తల్లి మరణించినంతనే శివరామునకు సంసారమున విరక్తికలిగెను. శ్మశానభూమి

నుండి గృహమునకుఁ దాను రానని శివరాముఁడు తమ్మునితోఁ జెప్పెను. అతని సోదరుఁడును, తదితరబంధుగులును మిక్కిలి బ్రతిమాలిరి. అయినను బ్రయోజనము లేదయ్యెను. సంపదనంతయుఁ దమ్ముని కొసంగి, శివరాముఁడు శ్మశానభూమి కడనే యుండిపోయెను. అతని సోదరుఁడు చేయునదిలేక, యా శ్మశాన భూమియం దొకచోటఁ జిన్నకుటీరము నిర్మించి, యనుదినము ఫలాహారముల నంపుచుఁ దఱచుగాఁ దానువచ్చి చూచుచుండెను.

ఇట్లుండఁగా శివరాముఁ డొక యోగీశ్వరు నొకప్పుడు కలిసికొనుట తటస్థించెను. ఆ సంయమీంద్రుఁడు శివరాముని నిశ్చలభక్తి తత్త్వములను గాంచి, యెంతయుఁ బ్రమోదమంది, నిగూఢములు, మహత్తరములు నగు యోగరహస్యములఁ దెలిపి, త్రైలింగస్వామి యని పేరిడెను. త్రైలింగస్వామి యటనుండి రామేశ్వరమున కేగెను. త్రైలింగస్వామి త్రికాలవేది యగుటచే నాతఁ డెచ్చటికేగిన నచ్చట జనులు గుమిగూడి, తమ భవిష్యజ్జీవితఫలముల నెఱిఁగింపుఁడని కోరుచుండిరి. శాంతి యించుకంతైన లేకుండుటచేఁ ద్రైలింగస్వామి తిన్నగా మానస సరోవరమున కేగి, యటనుండి కాశికిఁ బోయెను. అతఁడు వారణాసిలో దశాశ్వమేధాసి తులసీపంచగంగా ఘట్టములఁ గొంత కాలము వసించెను. అనేకులు భాగ్యశాలురు, త్రైలింగస్వామికి శిష్యులుగాఁ జేరసాగిరి. ఒకప్పుడు జయగోపాలుఁడను శ్రీరామపుర గ్రామ నివాసి, వారణాసికిఁ జనుదెంచి, త్రైలింగస్వామి శిష్యుఁడై, శుశ్రూష చేయసాగెను. అతఁ డొకనాఁ డేలనో కాని విచారవారాశినిమగ్నుఁడై యుండెను. అదిచూచి, త్రైలింగస్వామి "నాయనా! నీవిట్లు విచారముగ నుంటివే?" మని ప్రశ్నించెను.

జయగోపాలుఁడు "స్వామీ! నాహృదయ మేలనో కాని, చింతాక్రాంతమైనది ఏదైన యశుభము మూడనున్నదేమో" యనెను.

త్రైలింగస్వామి దివ్యదృష్టివలన, శ్రీరామపురమున నాతనిగృహమున జరుగుచున్నది కన్గొని "నాయనా! నీవిచారము సహేతుకమే. నీ తనయుఁడు మృతినొందినాఁడు. అయినను వగవఁబనిలేదు. జీవులకు సుఖదుఃఖములు రెండును సమానములు. పుట్టుట, గిట్టుట సృష్టిలోని ముఖ్యసూత్రములని యెఱింగియు నిట్లు భ్రమనొందుట ధీరలక్షణము కాదు. అజ్ఞానతిమిరావృతమైన పథమునఁ జరించుమనుజుఁడు తాననుస రించిన పంథ సరియైనదేయని తలంచునుగాని, యన్యథా భావింపఁ జాలఁడు. మనమెల్లరమును మృత్యుదేవత కరాళగహ్వరమునఁ బడిపో వలసిన వారమే. కావున దుఃఖము మాను" మని బోధించెను.

మఱునాఁటి యుదయమునఁ బుత్రుఁడు మరణించెననువార్త తెలిసెను. త్రైలింగస్వామి బోధనవలన సమాశ్వాసము నొందిన జయ గోపాలుఁడు స్వామి మహాత్మ్యమున కెంతయు నచ్చెరువంది, యూఱటఁ జెందెను. త్రైలింగస్వామి యెల్లప్పుడు దిగంబరిగనే మెలఁగుచుండెను. తఱచుగా స్వామి గంగానదీ పవిత్రసలిలంబులఁ బద్మాసనస్థితుఁడై యుండెను. అతఁ డెన్నఁడును భిక్షకై నగరమునకుఁ బోలేదు. ఎవరో యొకరువచ్చి సమర్పించిన ఫలాహారములనే యాతఁడు భుజించుచుం డెను. స్వామి యనేకములైన యద్భుతకార్యములఁ జేసెను. ఒకప్పు డొక యున్నతోద్యోగి, గంగానదిపైఁ బయనముసేయుచు, జలమున బద్మాసనాశీనుఁడై యున్న త్రైలింగస్వామినిఁ జూచి, యాయన మహా త్ముఁడని తనకడనున్న వారివలనఁ దెలిసికొని, నావలోనికి రమ్మనికోరెను. స్వామి నావలోనికేగి, యాయుద్యోగికడనున్న కరవాలము జూపుమని సంజ్ఞగాపించెను. ఆయుద్యోగి యొరనుండి, ఖడ్గమునీవలికిఁదీసి స్వామి చేతికిచ్చెను. త్రైలింగస్వామి యాఖడ్గమును బరిశీలించుచుండ చేతి నుండిజాఱి నదిలోఁబడిపోయెను. ఆయుద్యోగి యాగ్రహావేశపరవ శుఁడై స్వామిని దూలనాడెను. పరిచారకులు స్వామియేమిచేయునో

యని భయకంపితులైరి. త్రైలింగస్వామి జలమునఁజేయినిడి, యొక స్వర్ణఖడ్గమును, నొకరజతఖడ్గమును, ఉక్కుకత్తిని దీసియిచ్చెను. ఉద్యోగి తనకరవాలమును గైకొని, త్రైలింగస్వామి మహాత్మ్యమున కెంతయు నచ్చెరువంది, తనయనజ్ఞకెంతయుఁ బశ్చాత్తాపమునొంది, తన తప్పు సైరింపుమని పాదములపైఁబడి వేడుకొనెను—

మఱియొకప్పు డొక వైద్యుఁడు వచ్చి, త్రైలింగస్వామిని "మనుజులకు మృత్యువునకుఁ బిదపఁ బునర్జన్మముకలదా ?" యని ప్రశ్నించుటకు వెళ్లెను. స్వామి యాతనితో నేడు దినములవఱకు సంభాషింపక, యెనిమిదవనాఁడు "సుకృత దుష్కృత్యములే పునర్జన్మనకు, పునర్జన్మరాహిత్యమునకు హేతుభూతములు. నీవు కలుషితాత్ముఁడ వైనందుననే నీతో నే నేఁడు దినములును సంభాషింపనైతిని" అని చెప్పి, విస్మయము కలిగించెనట.

త్రైలింగస్వామి వారణాసీనగరమునఁ బంచగంగాఘట్టమున శివలింగముఁ బ్రతిష్ఠించి, శిష్యు నర్చకునిగా నియమించి, 180) సం॥ రమునఁ బ్రహ్మైక్యము నొందెను. యోగశక్తి వలన నీ మహానుభావుఁడు రెండువందల యెనుబది సంవత్సరములు జీవించెను. మహావాక్య రత్నావళి యను నొకయుద్గ్రంథమును గీర్వాణభాషలో వ్రాసెను. సత్కార్యాచరణమున మనస్సిద్ధికుగును. ఆనందము, శాంతము, సుస్థిర చిత్తము గలిగియుండుట మానవునకు శ్రేయస్కరమని త్రైలింగస్వామి బోధించెను.

---

# 38 శ్రీ రామకృష్ణ పరమహంస.

———:0:———

శంగశకము 1214 సం॥ రము ఫాల్గుణశుద్ధ దశమినాఁడు శ్రీ రామకృష్ణపరమహంస కమర్పుకరను కుగ్రామమున జన్మించెను. బారసాల మహోత్సవసమయమున నీతనికి గదాధరుఁడని పేరుపెట్టఁబడినను తలిదండ్రులు రామకృష్ణుఁడను ముద్దుపేరుతోఁ బిలుచుచుండిరి. రామకృష్ణుని తండ్రిపేరు ఖుదీరామ చటోపాధ్యాయుఁడు, పౌరోహితవృత్తిచేఁ గష్టపడి, కుటుంబపోషణ మొనరించుకొనుచుండెను. ఆతనికి మువ్వురుపుత్రులు, పుత్రిక లిర్వురు జన్మించిరి. మొదటివాని పేరు రామకుమారుఁడు. రెండవవాని పేరు రామేశ్వరుఁడు. తృతీయపుత్రుఁడు రామకృష్ణుఁడు. రామకృష్ణుఁడు గురుశుశ్రూష లేకుండఁగనే రాగతాళయుక్తముగ సంగీతమునఁ బ్రావీణ్యము సంపాదించెను. రామకుమారుఁడు హుగ్లీజిల్లాలోని ఝూమపుకర్ గ్రామమున నొక పాఠశాలను స్థాపించెను. ఆ పాఠశాలలో రామకృష్ణుఁడు విద్యాభ్యాస మొనరించెను. కొన్నివత్సరములు రామకుమారుఁ డట్లు పాఠశాలను నడిపి, తరువాత కలకత్తా సమీపముననున్న దక్షిణేశ్వరాలయమున నర్చకుఁడుగ నియమింపఁబడెను. అప్పుడే జయరామపురనివాసి యగు రామచంద్రముఖర్జీ కుమార్తె శారదాసుందరీదేవి రామకృష్ణునకు వివాహముఁ జేయఁబడియెను.

మూఁడువత్సరములు గడచెను. రామకుమారుఁడు దైవదుర్విపాకమునఁ గాలధర్మమునొందెను. రామకుమారుని మరణానంతర మాతనిమీఁది యభిమానముపెంపున దక్షిణేశ్వరాలయార్చకత్వపదవిని, యా యాలయపోషకురాలగు రాష్మణీ మహారాణియును, నామె

యల్లుఁడగు మధురబాబును రామకృష్ణున కొసంగిరి. రామకృష్ణుఁడు జాగ్రతగ మంత్రములనేర్చి, లోపరహితముగఁ బూజాదికముల నెరవేర్చుచుండెను.

రామకృష్ణుఁడు కామక్రోధ లోభ మోహ మదమాత్సర్యముల నణచుట కేకాగ్రచిత్త మవసరమని తలచి, నిశ్చలచిత్తముతో కాళికాధ్యానమునకు గడంగెను. తోతపూరీయను సాధువు నొకప్పుడు రామకృష్ణునిఁ గలిసికొనుట తటస్థించెను. ఆసాధువువలన నుపదేశమందెను. తదాదిగ నాతనికి సంసారమునెడ విరక్తిజనించి, సన్యాసావలంబన కుతూహలమొదవెను. రామకృష్ణుఁడు తుదకు సన్యాసమవలంబించెను. ఒకప్పు డాతఁడు "ఓహో! ప్రపంచములోని మానవులు స్త్రీని గాంచినంతనే మోహావికారమునకు లోనుగానేల? ఆమె శరీరమాత్రము రక్తమాంసాస్థిగతముకాదా? శ్మశానమునఁ బడియుండు పుఱ్ఱెనుగాంచినపుడేల మానవులచిత్తములు మోహావిలములుకావు? మనుజులమానసములు సుందరాంగులపయోధరముల వీక్షించినపుడు కలవరము నొందనేల? కసాయివాఁడుపర పర కోయు మాంసఖండములఁ గాంచినపుడు వారి చిత్తము లెందులకుఁజలింపవు?

రామకృష్ణుఁడు పూర్వజన్మార్జిత పుణ్యవిశేషమున మహాభక్తుఁడయ్యెను. ఆతని భక్తితత్త్వమును గాంచి, యెల్లరును విస్మయము నొందుచుండిరి. శాస్త్రవిజ్ఞాన మేమియు లేకుండఁగనే రామకృష్ణుఁడు నిరవధిక భక్తియుక్తుఁడగు టాశ్చర్యముగదా! ఆతని యుపన్యాసముల నాలకించినంతనే, ప్రతివారును భక్తియుక్తు లగుచుండిరి. రాజకీయ మతరంగముల నద్భుతఖ్యాతి నార్జించిన కేశవచంద్రసేను, గిరీశఘోషు మున్నగువారు రామకృష్ణుఁడు ప్రజల కుద్బోధింపసాగిన భక్తిసిద్ధాంతము లుత్కృష్టమైనవని, వేనోళ్ల పొగడిరి.

ఒకప్పుడు రామకృష్ణుని కంఠమున వ్రణమై, చాలబాధ కలిగించెను. రామకృష్ణుని ప్రియశిష్యుఁడగు వివేకానందస్వామి "మహాత్మా! బాధ యెట్లున్న ?" దని యడుగఁగా, రామకృష్ణపరమహంస "వివేకానందా ? బాధ భౌతికశరీరమునకే గాని యాత్మకుఁ గానపుడు నాకేమియు బాధకలుగదు" అనెను. రామకృష్ణపరమహంస వ్రణబాధ క్రమక్రమముగా నధికము కాసాగెను. ఆతఁడు క్రమముగా కృశింపసాగెను. శిష్యు లాతనిని కలకత్తాలో నొక భిషగ్వరుని కడకు చికిత్సకై గొంపోయిరి. అచటకూడ నేమియుఁ బ్రయోజనము లేక పోయెను.

ప్రియశిష్యుఁడగు వివేకానందస్వామికి తన సిద్ధాంతములనెల్ల నెఱిఁగించి, ప్రజలకు వానిని బోధించుమని చెప్పి, రామకృష్ణ పరమహంస సంగళకము 1292 స॥ర శ్రావణ బహుళ అమావాస్య ఆదివారమునాఁడు బ్రహ్మైక్యమునొందెను. శ్రీ రామకృష్ణపరమహంస పేరిట నిపుడు దేశమునఁ బలుస్థలముల మఠములు నిర్మింపఁబడినవి. హిమాలయపర్వత ప్రాంతములనున్న మాయావతీనగరమున నొక మఠము, బేలూరునం దొకమఠము, చెన్నపట్టణములో నొకమఠము పే రెన్నికగాంచినవి. వివేకానందస్వామి శ్రీ రామకృష్ణపరమహంస భక్తి సిద్ధాంతముల నమెరికా మున్నగు ఖండాంతరముల బోధించి, హిందూమతధర్మోత్కృష్టతను జాటించి, యఖండ యశస్సిద్ధకుఁ డయ్యెను.

విసువు విరామములులేక సాధనఁజేయువారియెడ పరమాత్ముఁడు ప్రేమాభిమానములు గలిగియుండును. విభయాసక్తి విడనాడి, పారమార్థిక విచారణమొనరింపని మనుజుఁ డెన్నఁటికిని మోక్షము నొందఁజాలఁడు. ధనకాంక్ష, పరదారాగమనము, అధికారమునెడ నాసక్తి — యివి మానవహృదయము దుర్బలమగుటకుఁ దోడ్పడుచున్నవి. కామా

యాంబరధారణమున మనుజుని చిత్తమున మహాద్భుతమైన మార్పు జనించును. అందుచేతనే సన్న్యాసమవలంబించుట మానవునిచిత్తము పవిత్రీభూత మొనర్చుటకే యని చెప్పఁదగును.

సంసారమునుండి విడివడనేరనపుడు కూడ శ్రీహరినిఁ దలంచుచు ముక్తినొందఁ ప్రయత్నించుట పురుషుని ముఖ్యవిధియై యున్నది. విజ్ఞానోజ్జ్వలముగాని మానివునిచిత్తము మర్కటము విచ్చలవిడిగా సంచరించు తెఱంగున వక్రగామి యగును. నది సముద్రమును చేరునపు డెట్లుపొంగునో, యట్లే పరాత్పరుని సాన్నిధ్యమును జేరఁబోవు భక్తుఁడు పరవశత్వమునొందును. నోరు గీరుకొని పోయినను, రక్తముఃస్రవించుచున్నను ఒంటె ముండ్లపొదలనే భుజింప నభిలషించునట్లు, మనుజుఁడు దుర్బలహృదయుఁడై, రాగలోలుఁడై, పాపముల కాకరమగు విషయ సుఖపాశమునుండి విడివడజాలకున్నాఁడు.

పైనుదహరించిన వన్నియు, రామకృష్ణపరమహంస సిద్ధాంతములలోఁ గొన్ని. వీనినిఁబట్టి శ్రీ రామకృష్ణపరమహంస భక్తితత్త్వమెట్టిది బోధపడును. ఇట్టి మహాత్ముని పుత్రునిగాఁ గాంచిన భారతమాత ధన్యచరిత గదా!



# 39 గిరిధరలాల్.

———:౧:———

తొల్లి పరమపావనంబైన బృందావనక్షేత్రమున భక్తిపరుడును జ్ఞానసంపన్నుడును, సాధుజన పూజానిరతుడును నగు గిరిధరలాల్ అను విప్రుడొకండు వాసముచేయుచుండెను. ఆ సద్బ్రాహ్మణుండను దినంబును గాళ్ళకుగజ్జెలుకట్టుకొని, చేత సితారునుబూని, శ్రీకృష్ణభగవానుని దేవాలయమునకరిగి, యాదిశేషు వాలకించునట్లును, గంధర్వులానందాబ్ధి నోలలాడునట్లును, తదితర సర్వప్రాణులును తన్మయత్వమందునట్లును, మధురగానము నాలాపించుచు, భక్తికీర్తనలబాడి తానును నాభగవంతునిలో లీనమై నృత్యముసల్పుచుండును.

ఒకనాడు గిరిధరలాల్ ఉదయముననే తటాకమునకరిగి, జలకమాచరించి, నిజగృహాభిముఖుడై జనుచుండుసమయమున కొందరు భక్తులెచ్చటినుండియో యాయరుదెంచి, యాబృందావనపుణ్యక్షేత్రమున గల గోపాలమూర్తి విగ్రహముచెంత భజనలుజేయుచు గీర్తనలబాడుచుండిరి. ఆదృశ్యమునుగాంచిన గిరిధరలాలుకూడ తన్మయుడై, దానుకూడ నాభక్తులతోగలసి భజనసేయదలంచెను. కాని అతను తనవద్ద గజ్జలును, సితారును నప్పుడు లేకుండుటకు మిగులవిచారించి, ఖిన్నుడై భగవంతునిట్లు ప్రార్థించెను. “ఓగోపాలమూర్తీ! యదుకులభూషణా! భక్తులెల్లరును నిట్లుభజనలు సల్పుచుండ, నేనిట్లు రిక్తవడి యెట్లుచూచుచుందును? నేనుకూడ వారితోగలసి, నిన్ను గీర్తింపవలదా? అయిన నాకాళ్ళగజ్జలును సితారును యింటివద్ద నుండిపోయినవిగదా! నేనిపుడు మిక్కిలి దవ్వుననున్న మాయింటికరిగి నాగజ్జలను, సితారును దెచ్చుకొనునంతలో నీభక్తులుతమభజనను బూర్తిగావించుకొని వెడలిపోవుదురేమో! అయ్యో! నేడీవిధముగా నాకిట్లుత్సాహభంగ మొనర్చుట

భావ్యమా! గోపాలకృష్ణా! గోకులకృష్ణా! రమ్ము. నన్ను గూడ వారితో భజనసల్పుటకుపాయంబును జెప్పి, నాకానందమును గూర్పుము"

అని యిట్లా విప్రవరేణ్యుండు ప్రార్థించునంతలో భక్తవత్సలుండైన కృష్ణభగవానుని యనుగ్రహంబున నెల్లరును నాశ్చర్యాద్భుతమానసులగున ట్లంతరిక్షమార్గమునుండి యొకబంగరు గజ్జలజతయు, నొకదివ్యమైన సితారును, పట్టుపీతాంబరములును వచ్చి గిరిధరలాలుని కట్టెదుట నుండెను. అంత గిరిధరలాల్ పరమానందభరితుండై వాటిని స్వీకరించి, యాభక్తపరులతో నత్యుత్సాహమున భజనగావించెను. ఆతని నిశ్చలభావమునకును, భక్తికిని, కృష్ణభగవానున కాతనియందు గల యాదర వాత్సల్యములను, నాభజనపరులు పెక్కుతెరంగుల గొని యాడిరి. అట్లు గిరిధరలాల్ పీతాంబరధారియై, కాళ్లకు గజ్జలనుగట్టి, సితారునుచేబూని, ఆభక్తులతో శ్రీకృష్ణుని రాసక్రీడావైభవకీర్తనంబుల గానము చేయుచుండ, నాగోపాలమూర్తియే యటనవతరించి, తాను బూర్వము కృష్ణావతారమున గోపికలతో ననుభవించిన రాసక్రీడానందము ననుభవించి, తనదివ్య దర్శనముచే నెల్లరభక్తులను తరింపజేసి, యదృశ్యుడాయెను. ఆ భక్తులును దమకు గిరిధరలాలు మూలమున భగవద్దర్శనమైనందుల కెంతయు సంతసించి, గిరిధరలాలునకు పెక్కువిధంబుల బ్రణమిల్లి తమయాత్రల ననుసరించి జనిరి.

అనంతరమొకనాడొకయోగి బృందావనప్రాంత స్మశానవాటికయందు ద్రిమ్మరుచుండ, గిరిధరలాల్ వానినిగని బ్రణమిల్లి, తన యాశ్రమంబునకు గొనిపోయి, వానికి ఆతిథ్యమునొసంగగా, నచటి బ్రాహ్మణులెల్లరును గిరిధరలాలుకడకరిగి, వానిని పెక్కువిధంబులనిందించి, "స్మశానమున ద్రిమ్మరుచుండు నొకబైరాగికి నీవాతిథ్యము నొసంగితివిగాన, నేటినుండియు నీవు మా బ్రాహ్మణసంఘమునందు వెలిగాబడితివి". అని నుడువగా, వారలకు గిరిధరలాలిట్లనియెను. "ఓ

అయ్యలారా ? నేనాతిథ్యమిచ్చినయతడు కేవలము స్మశానములం దిమ్మరు బైరాగికాడు. అతడు మహాజ్ఞానసంపన్నుడు. పరమాత్మస్వరూపంబునెరింగిన మహాతత్వవేత్త. అతనిని మీరీవిధముగా దూరుట తగదు ". అని చెప్పగా వారప్పటికిని తృప్తినందనివారై " నీవా బైరాగి కాతిథ్యమిచ్చుటవలన నీవపవిత్రుడవైతివి. అట్లుకానిచో నొకచచ్చినవానిని బ్రతికింపుము. అప్పుడుగాని నీపవిత్రతను మేమంగీకరింపము ". అనిరి. అంతట గిరిధరలాలు వారిమాటలకునవ్వి, " అల్లనేకానిండు. ఒకచచ్చినమానవుని బ్రతికించి, మీయపోహమునుబాపి, మీకోరికనే నెరవేర్తు " ననియెను.

అదేసమయంబున నాగ్రామంబునగల నొకక్షత్రియ యువకుడు మరణింపగా, నాతనిమృతకళేబరమా మార్గముననే గొనిపోబడుచుండ, నామృతుడైనవానిభార్యయగు పదునారేండ్లజవ్వని, గుండెలుబాదుకొని విలపించుచు, నామెబంధుగులెన్ని విధంబుల జెప్పుచున్నను వినక భర్తృమృతకళేబరముతో సహగమనము జేయుటకై యరుగుచుండెను.

ఈ సమాచారము నంతను నెరింగిన గిరిధరలాలు " ఓ బ్రాహ్మణోత్తములారా ! ఈశవము నిటదింపుడు. ఆమృతుడైనవానిని బ్రతికించుటకై ప్రయత్నింతును. నేను వానిని బ్రతికింపజాలనియెడల మీయిష్టప్రకారమే నన్ను కులములోవెలివేయుడు ". అని చెప్పగా, గిరిధరలాలుయొక్క మహాత్యమును పరీక్షించుటకదియే సమయమని యెంచి, యా బ్రాహ్మణులుశవమునటదింపించి,విలపించుచున్ననామగువనూరడించి, గిరిధరలా లెట్లామృతుడైనవానిని బ్రతికించునోయని చూచుచుండిరి.

అంతట గిరిధరలాలు నిర్మలచిత్తముతో భగవానుడగు శ్రీకృష్ణపరమాత్మ నీక్రిందివిధముగా స్తుతింపదొడంగెను.

'మేఘశ్యామం పుండరీకాక్షం ।
శ్రీవత్సాంకం కౌస్తుభోద్భాసితాగం ।
పీతకౌశేయవాసం పుణ్యోపేతం ।
విష్ణుం వందే సర్వలోకైకనాథం ।
గోవింద ! గోవింద ! హరమురారే ।
గోవింద గోవింద ముకుందకృష్ణః ।
శ్రీ కేశవానంతనృసింహ ।
విష్ణోమాం త్రాహి సంసారభుజఙ్గదష్టం ':

ఓ మహానుభావా ! శ్రీకృష్ణపరమాత్మా ! నీయమానుష లీలల గొనియాడ నాదిశేషునకైనను దరముగాదు అట్టియెడ నేనన నెంత ? భక్తజనమందార ! ఆపద్బాంధవా ! లక్ష్మీవల్లభా ! నేనెనీ నిజమయిన భక్తుడనగుదునేని, నీమృదుచరణసేవను నేనెపుడు దప్పకుందునేని, యిపుడీమృతుడయినవాడు సజీవుడౌగాక !" యని గిరిధరలాలా మృతకళేబరమును గన్నెత్తి చూచినంతమాత్రమున, నతడు నిద్దురమేల్కాంచినపగిది లేచి నిలుచుండి, గిరిధరలాలునకును, తదితర బ్రాహ్మణులకును నమస్కరించెను.

అంతట నా బ్రాహ్మణులెల్లరును గిరిధరలాలునకు బ్రణమిల్లి, "ఓ దేవా ! మీయద్భుతశక్తిసామర్థ్యంబులను, భక్తివిశేషంబును, మహిమలను నెరుంగజాలక మూర్ఖులమై చరించి మిమ్ముల దూలనాడితిమి. మాతప్పులనన్నిటిని క్షమించి, తరుణోపాయంబును గనుమార్గము నుపదేశింపుడు. భవత్పాదసేవనంబు సేయుచు తరింతుము" అనిరి. అనంతరము మృతుడైన దన భర్తను సజీవునిగా నొనర్చినందుల కాతనిభార్య గిరిధరలాలునకు సాష్టాంగబడి మ్రొక్కి. "ఓ భగవత్స్వరూపా ! పతిభిక్షను బెట్టిన మీ ఋణంబును నే నెట్లు తీర్చుకొనుదానను ? అశక్తురాలను—అబలను—అయిన నేను

తమకు భక్తిపూర్వకముగా నొక్కనమస్కారముకంటెను నేమొసంగ గలను ?” అని నమస్కరింప, గిరిధరలాలా దంపతులను దీవించి, బ్రాహ్మణుల కోరిక ననుసరించి; వారలకెల్లరకును శ్రీకృష్ణమంత్రము నుపదేశించి “ అయ్యలారా ! ఈ మహామంత్రమును జపించుకొనుచు, పిపీలకాది బ్రహ్మపర్యంతమునుగల సర్వపదార్థములును నా పరంధాముని స్వరూపముగా నెరింగి, భక్తి, జ్ఞాన, వైరాగ్యంబు లనియెడి త్రివిధమార్గంబుల నలవరచుకొని, అరిషడ్వర్గముల జయించి, ధనేషణ, దారేషణ, పుత్రేషణ యనెడి యీషణత్రయంబులకు లొంగక, నిష్కాములై, సాధుజనుల పూజింపుచుండుడు ”. అని తత్త్వోపదేశంబు గావించి, యనంతరము కొన్నాళ్లకు గిరిధరలాలు చరమావస్థ నందె విష్ణుపదంబు జేరెను.

---

# 40 శ్రీ ధ ర పం డి తు డు.

మహాసంపత్సమన్వితంబును, సకల సస్యసమృద్ధంబును, నగు ధామనగరంబునందు పూర్వము శ్రీధరపండితుడను మహానుభావుడు నివసించుచుండెను. అతడు సాధుజనులయెడల భక్తిగలవాడై, సర్వ ప్రాణులయందును భగవత్స్వరూపముం గనుచు, నిత్యమును హరినామ స్మరణయందే కాలముం గడపుచు, భక్తిపరుడై మెలంగుచుండెడి వాడు. ఈ మహనీయునకు, సీత, సావిత్రి, అనసూయ, అరుంధతి మొదలగు మహాతల్లుల పాతివ్రత్యముకంటెను నధిక పాతివ్రత్య మహిమను గలిగిన సుమబాల యనునొక భార్యకలదు. ఆయమ వివేకవతియై భక్తిజ్ఞానవైరాగ్యములచే ప్రకాశించుచు, ననయము భర్తపాదసేవ దప్పక, నాతనినె పరమదైవంబనియెంచిపూజించుచుండెను.

ఇట్లుండ నా పుణ్యదంపతులకు నానాక్షేత్రములను దర్శించి యందందుగల భగవద్భక్తులను దర్శించి, ఆయా పవిత్రతీర్థములం గ్రుంకి జన్మసాఫల్యము జేసికొనవలయుననియెడి కోరిక జనింప, నా భార్యాభర్త లిరువురును నొక్కశుభముహూర్తంబున తీర్థయాత్రలకై పయనంబై చనిరి. వారట్లు దివ్యక్షేత్రదర్శనాభిలాషతో కొంతదవ్వరుగ, యలసి, యిక నశువజాలనివారై, యొకయశ్వము నధిరోహించి యొక యరణ్యమార్గముగుండా జనుచుండిరి. వారాయరణ్యము ప్రవేశించునప్పటికి సూర్యభగవాను డస్తమించుటయు, నెల్లతావులను గాఢతిమిరము లలముకొనుటయు గనిన సుమబాల భర్తతో నిట్లు లనియె —

" నాథా! రాత్రిసమయమునందీ భయంకరారణ్యముగుండా ప్రయాణముసల్పుట మన కనుచితంబు. ఈ యరణ్యమును దాటుటకు మనమింకను నెంతమేర గడువవలయునో తెలియదుగదా! మనమింకను ముందునకు సాగిన అర్ధరాత్రమగును. అట నే క్రూరమృగంబులవలన గాని, నే దుర్మార్గులవలనగాని, మన కపాయము వాటిల్లవచ్చును; గనుక యిప్పుడె మనము వెనుకకు మరలి, యీ సమీపగ్రామమునం దీరాత్రంబు గడపుటమంచిది ". అని యామె చెప్పుచుండునంతలో నంతవరకును నటనే యొక పొదచాటున దాగియుండి, యామె చెప్పుచుండిన మాటలను వినిన కొందరుదొంగలు బయటకువచ్చి, శ్రీధర పండితుని గని, " అయ్యా! ఈయరణ్యమునం దెట్టిభయమును లేదు. మీరు నిశ్చింతగా మీప్రయాణమును సాగింపవచ్చును. మేమును యీ మార్గము ననుసరించియే బోదలంచితిమి. మీ కెట్టియాపదయు రాకుండ మేము కాపాడుదుము. మేముకూడ మీవెంటవచ్చుట కనుమతి నీయుడు ". అన, సుమబాలకా దొంగల రూపములబట్టియు, మాటలబట్టియు గొంత యనుమానము కలిగెను. అందుచే నామె

భర్తతో "నాథా! వలదు. మనమిక ముందునకు బోవలదు. వీరల జూచిన నా కెందులకో మనమున సంకోచము కలుగుచున్నది". అని చెప్ప, శ్రీధరపండితుఁడా దొంగలగని యిట్లనియెను. "అయ్యలారా! మీ వాక్యములందు నా కెట్టిసంకోచమునులేదు. కాని నాభార్యకు మాత్రము మీమాటలయందు విశ్వాసము లేనట్లు దోచుచున్నది. మీరయిందామెకు నమ్మికగలుగునట్లు గావించినయెడల, మన ప్రయాణమును సాగించుట కెట్టియభ్యంతరమును నుండదు".

అంత నాదొంగలు సుమబాలతో "అమ్మా! మన యెల్లర యందునుఁగూడ నేకభావముతో బ్రకాశించుచుండు శ్రీరామచంద్రుని పాదసాక్షిగా మా కెట్టిపాపచింతయును లేదు. మీరు మీ సంకోచమును వీడి, మాతో సుఖముగా ప్రయాణమును సాగింపుడు". అని దేవునిపై నొట్టుబెట్టుకొని చెప్పగా, కల్లకపటముల నెరుంగని యా సాధ్వి కాదొంగల మాటలయందు విశ్వాసము కలిగెను.

అనంతరమా శ్రీధరపండితుఁడు నిజభార్యతోడను, నాదొంగలతోడను పయనంబై, యామహారణ్యముగుండా గొంతదవ్వు ప్రయాణముసల్పెను. దుర్మార్గులగు నాదొంగలట్లు వారితో మాటాడుచుండినట్లే మాటాడుచు, శ్రీధరుఁడు పరధ్యానముగా నున్నసమయమున, నొకనిశితకరవాలమున వానికంఠమును దెగనరికి, యతనివద్దగల ధనమును, వస్త్రాభరణములును దోచుకొని, సుమబాలయొంటినున్న వస్త్రములనుగూడ దోచుకొనవలయునను తలంపుతో నామెవద్దకు రాగా, నాయిల్లాలు నేలబడియున్న భర్తృమృతకళేబరమునుగని విలపించుచు దొంగలజూచి యిట్లనియెను.

"అన్నలారా! మీకు ద్రవ్యాపేక్షగలదేని, మమ్మడిగిన మే మీయమా? నిష్కారణముగా నాభర్తనుజంపి, నన్ననాథను గావించి

తిరిగదా ! మీరుసాక్షియనిచెప్పిన ఆశ్రీరామచంద్రమూర్తి కఠినుడై, మీరాచరించిన యీఘోరకృత్యమును గన్నులారజూచి సహించి యెట్లూరకుండెనోగదా ! ఆతడు దయామయుడనియు, భక్తవత్సలుండనియు, ఆర్తత్రాణపరాయణుండనియు బిరుదులవహించియుండెనే ! ఈ బిరుదములన్నియు నిపుడాతనియందు నిరర్థకములుగావా ?" అనియనుచుండునంతలో దశరథనందనుండును, సీతాపతియు నగు నా శ్రీరామచంద్రుడే యట సాక్షాత్కరించి, సుమబాల యాభరణముల నొలచుకొన నుద్యుక్తులై యున్న యాయెల్లరదొంగలను నొక్కక్షణమునవధించి, విలపించుచున్న సుమబాలనుగని, "తల్లీ ! ఈదుర్మార్గులపాపములు నేటితో పూర్తియైనవి. అంతవనుక నేనోపిక పట్టవలసియుండుటచే, నీభర్తనువారు వధించుచుండుటను జూచియు నూరకుండవలసినవాడనైతిని. నీనాధుడిపుడే సజీవుడుకాగలడు". అని యాదివ్యమూర్తి యనునంతలో శ్రీధరపండితుండు పునర్జీవితుండై, తనకన్నులయెదుట నిలుచుండిన శ్రీరామచంద్రమూర్తికి నమస్కరించి "ఓపుణ్యపురుషా ! పురాణవినుతా ! నేడు నీదివ్యరూపదర్శనభాగ్యంబున మాజన్మలు చరితార్థతనందినవి—మా నోచిననోములు ఫలించినవి. మహాయోగిసత్తములకును, తపోధనులకునుగూడ నలభ్యంబైన నీదివ్యరూపసందర్శనమును మాకు కటాక్షించి, తరింపజేసిన నీకివియే నామనఃపూర్వకవందనంబు. అందుకొని నన్ను కృతార్థుంజేయుము". అని యాదంపతులిరువురును నాభగవదవతారునకు పెక్కువిధంబుల నమస్కృతుల నాచరించిరి.

అంతట శ్రీరాముడు వారలదీవించి, మాయర్థరాత్రంబున వారల నాభీకరారణ్యంబున నేయుపద్రవములును రాకుండదాటించి, యదృశ్యుండాయెను. పిమ్మట శ్రీధరపండితుండు భార్యకు శ్రీరామునియొక్క మహిమాదిగుణంబుల వర్ణించిచెప్పుచు, పూర్వము కళ్య

పాది ఋషిశ్రేష్ఠు లొకబోయవానిచే నెదుర్కొనబడిన యొకయరణ్యమును బ్రవేశించి, ఆనాడా బోయవాడు భీకరఖడ్గధరుడై యా సప్త మహాఋషులను నెదుర్కొనగా, వారు తమ్మా యాపత్సముద్రము నుండి దాటించగలవాడును, దుష్టులసంహారించువాడును, ఆధ్యాత్మిక ఆదిదైవిక, ఆదిభౌతికంబుల నివృత్తిచేసి, శాశ్వతానందదాయకంబగు మోక్షపదంబును సర్వభక్తజనంబులకును బ్రసాదించువాడు నగు ఆ శ్రీరామచంద్రుని ధ్యానించి, వా రెట్లాబోయవాని బారినుండి దప్పించుకొనినదియు, మొదలగు విషయములను భార్యయగు సుమబాలకు జెప్పుచు, యాశ్రీధరపండితుండు సర్వతీర్థయాత్రలను సేవించి, నానా పుణ్యస్రవంతులను గ్రుంకి, ఆయాచోటులంగల వింతలను, పుణ్యపుంగవులను గనుచు, నాయాతావుల చరిత్రల దెలిసికొనుచు, సంతృప్తాంతరంగుడై, నిజభార్యతో స్వపురిజేరిన గొన్నాళ్లు ఆదంపతులిరువురునుగూడ, భగవద్భక్తులై యుండి, యనంతర మనసాన కాలము సంప్రాప్తింపగా పరమపదంబునంది, శాశ్వతానందములబడసిరి.

---

# 41 హ రి పా ల దా సు.

పాపనాశనియు, పుణ్యప్రదాయినియు, పవిత్రయాత్రాస్థలంబునగు భాగీరథీతీరంబునగల నొకపట్టణమున భక్తాగ్రేశ్వరుండును, సాధుస్వభావుండును, సత్యవ్రతుడును, సజ్జనవత్సలుండును నగు హరిపాలదాసుండనువాడు నిత్యమును హరినామసంకీర్తనంబుల బాయక, అతిథియభ్యాగతులకు పూజాసత్కారములనిడుచు, యెల్లతావులందును 'హరిపాలదాసు మహనీయుడు' యని చెప్పుకొనునంతటి కీర్తినార్జించెను. ఈతనికీర్తి నాలుగువైపులకును వ్యాపించుటచే నెల్లరుసాధు

వులు, నెల్లరుమార్గస్థులును నీతనియింటికే యరుదెంచుచుండిరి. హరి పాలదాసు వారలనెల్లరను శక్తివంచనలేకుండసత్కరించి పంపుచుండెను. ఇట్లు కొన్నాళ్లుగడచిన యనంతరము, హరిపాలదాసుయొక్క పెద్ద లార్జించియిచ్చిన ద్రవ్యమంతయు సాధువులకొరకును, అతిథులకొరకును వ్యయమైపోగా, హరిపాలదాసు నిర్ధనుడై, సాధువుల సత్కరింపలేని వాడై, యొకనాడు తనలోదానిట్లు వితర్కింపనొడంగెను. "అయ్యో నే నెంతటి దురదృష్టవంతుడను. నాయింటికరుదెంచు భగవద్భక్తులను హరిదాసులను సత్కరించి, యాదరించుటకైన శక్యములేకపోయెనే! ఇకనేమిసేతు? వారల కెట్లులేదని చెప్పవలయును? అది నావలను గాదు. చోరవృత్తి నవలంభించియైనను, నాసువులకైనను, భగవద్భక్తుల కును నాతిథ్యమిడియే తీరవలయును". అని నిశ్చయించి, యానాడు మొదలుకొని రాత్రులందొక ఖడ్గమును చేబూని, మార్గస్థుల నదలించి, వారినద్దగల ధనములను వస్త్రములను నపహరించి తెచ్చి, సాధు సంత ర్పణంబుల నవిచ్ఛిన్నముగా కొనసాగించుచుండెను.

ఇట్లుండ నొకనాటిరాత్రి యతడెప్పటి ప్రకారముగా బాటసా రులు నడచుమార్గమున ఖడ్గహస్తుడై వేచియుండెను. కాని, యానా డొక్కబాటసారియైనను నామార్గమున జనడయ్యె. హరిపాలదాసు నట్లే రాత్రియంతయు వేచియుండెను. ఇక తెల్లవారుట కెంతయో యవకాశముగూడ లేదు. అంత నతడు విచారముతో నిట్లు దుఃఖింప నొడంగెను. "అయ్యో! నే డిట్లయినదేమి? ఒక్కబాటసారియైనను రాడయ్యె. నేను రేపటిదినమున నతిథుల నెట్లుసత్కరింపగలను? అన్నా ర్తులై నాయింటి కరుదెంచిన భగవద్భక్తుల ఆకలి నెట్లు చల్లార్పగలను? ఛీ! ఇట్టి యసమర్థుడనైన, యాకలి గొన్న వారి నాదరింపజాలని వాడను నేను బ్రతుకుటకంటె చచ్చుటయే మేలు." అని చింతించి, తన చేతనున్న కత్తితో నరుకుకొనుట కుద్యుక్తుడుకాగా, నెవరో

యిరువురు భార్యాభర్త లామార్గముగుండా జనుచున్నట్లాతనికి గోచ రించెను. అంత హరిపాలదాసు తన యాత్మహత్యాకార్యమును విర మించుకొని, యామార్గమున జనుచున్నవారిని బరిశీలించి చూడగా నొవరో యొక ధనికుడగు వర్తకుడు భార్యాసహితుండై జనుచున్నట్లా తనికి దోచెను. అంత నతడు పరమానందభరితుడై వారల డాయ జని కత్తినిజూపి, "మీ యిరువురను వధించి, మీకడనున్న నెల్ల సొమ్ముల నపహరింతును. ఏమందురు ?" యని యడుగ, నా వర్త కుడు "ఓయీ! చోరుడా! మమ్మేల వృథాగా సంహరింతువు ? మావద్దగల సొమ్ముల నన్నింటిని మేమే నీకు సమర్పించుకొందుము మమ్ముల వధింపక ప్రాణభిక్షను బెట్టుము" అని వేడుకొనగా హరి పాలదాసు వారికడగల సర్వాభరణములను, రొక్కమును స్వీకరించి, వారిని ప్రాణములతో వదలి పొమ్మనియెను.

లక్ష్మీనారాయణులే యట్లు వర్తక దంపతులరూపమున నరు దెంచి, తనను ద్రవ్యమును కూర్చిరని యెరుంగక, హరిపాలుడా చోర సంపాదిత ధనముతో భక్తజనుల కెల్లరకును విరివిగా సంతర్పణలు గావించెను. అట్లె, యతడనుదినమును ధనికులదోచి, భక్తులకు బెట్టుచు వారలతో హరిభజనల గావింపుచు దినములు గడపుచుండెను.

ఇది యట్లుండ, యట నాదిశేషువుపై బవ్వళించియున్న విష్ణు దేవునితో శ్రీమహాలక్ష్మి యిట్లనియెను "నీ భక్తుడు నాసర్వాభర ణములను దొంగిలించుకొని పోయెను, ఇట్టి చోరులేనా నీకు భక్తులు ! సెభాష్ !" అనియెను. ఆమెమాటలకు విష్ణుదేవుడు నవ్వి, "ప్రేయసీ! వాడు మనయందు దయదలచి, ప్రాణములతో విడిచిన విషయమయినను దలంపక, వస్తువులు పోయినవని వానిని నిందించుట తగునా ? అదియునుగాక, వాడు ద్రవ్యవంతుల ధనముల కొల్లగొట్టి, నాభక్తులకు బెట్టుచున్నాడు.

శ్లో॥ బ్రాహ్మణ్యాధాయకర్మాణి సంగంత్యక్త్వాకరోతియః
లిప్యతేనసపాపేన పద్మపత్రమివాంభసా ॥

తా॥ ఏ పురుషుడు తాను జేయునట్టి కర్మలను నా కర్పణముగావించి, సంగమును వర్జించినవాడై యనుష్ఠించుచున్నాడో; అట్టివానిని తామరాకును నీరంటనివిధముగా, పాపములు అంటనేరవు.

మరియు నో ప్రేయసీ! నా నామమును నిత్యమును నెవరు స్మరింతురో, వారే నాకు తల్లి, దండ్రి, మిత్రులు, బంధుగులుగ నగుచున్నారు. అట్టివారలకు నేను స్వాధీనుడను. వారికష్టముల జూడజాలనివాడను. కనుక నా మహానుభావుడు చోరవృత్తిచేసినను, సాధుపోషణయందు దీక్షవహించినవా డగుటచే మహోత్కృష్టకార్యమును జేయుచున్నవాడే యగును ”.

అనియిట్లు విష్ణుమూర్తి లక్ష్మీదేవితోనన, నామె “ అయిన నో నాథా! నీభక్తుని అతిథిసత్కార మెట్టిదో, సాధుపూజ యెట్టిదో, నాతని వర్తనంబేరీతిగ నుండునో, జూడవలయునని నాకభిలాషగలదు” అన, విష్ణుమూర్తి యట్లేకావచ్చునని నుడివెను. అనంతరము లక్ష్మీనారాయణు లిరువురును సాధువేషధారులై హరిపాలదాసుని గృహము చెంత నిలచి, “ ఓ సీతారామా! పుండరీకాక్షా! ఆకలితో నుంటిమి. మా యాకలిదీర్పుము ”. అని భగవన్నామస్మరణ గావించుచుండిరి. వారిమాటల వినినంతనే లోనున్న హరిపాలదాసు చరచర బయటకరుదెంచి, ఆ సాధువులను లోనికిగొనిపోయి, షోడశోపచారంబుల వారల దృప్తులంజేసి మృష్టాన్నభోజన మిడెను. అనంతరము హరిపాలదాసు అతిథులకు శ్రమపోవునట్లు పాదములొత్తుచు, సాదరముగ నిట్లడిగెను. “ ఓ యయ్యలారా! మీదేయూరు? ఇట్టి నిరుపేదావస్థయం దుండుటకు గారణమేమి? ”

వాని ప్రశ్నలకా సాధువులు "ఓ యతిథిపూజాదురంధరా! మేము తొలుత ధనికులమగు వర్తకులము. కొలది దినముల క్రితము మేమొక యరణ్యమార్గముగుండా ప్రయాణము సల్పుచుండ, నొక చోరుడు మార్గమున నడ్డగిలి తన నిశితకరవాలముతో మమ్ము బెదరించి, మా ధనమునంతను నపహరించుకొని పోయెను. దానం జేసియే, మేమీ దరిద్రావస్థయం దుండవలసినవారల మైతిమి". అని నుడివి, తమ తొల్లింటి వర్తకవేషములతో నిలుచున్న నా వర్తకదంపతు లకు హరిపాలదాసుం డిట్లనియెను— "ఓ వర్తకదంపతులారా! మీ సొమ్ముల నపహరించిన దుర్మార్గుడను నేనే. అయ్యో! నామూలమున మీ రెంతటి దీనావస్థకు బాల్పడితిరి. నాపాపమునకు ప్రాయిశ్చిత్తముగా నా నిశితకరవాలమునన్, నన్ను వధింపుడు" అని నుడివి, యా సాధువు లకు తనవద్దనున్న ఖడ్గమునీయగా, లక్ష్మీనారాయణులా వర్తకరూపముల నుండి, తమ నిజరూపములనంది, హరిపాలదాసును కౌగిలించుకొని, "ఓ పరమభక్తుడా! విచారింపకుము. నా ప్రియసతియగు నీ లక్ష్మీ దేవి నీ శీలమును పరీక్షింపగోరగా, మేమీ కపటవేషములతో వచ్చి, నీ యాతిథ్యమువలన సంతృప్తమానసుల మయితిమి. నీ వొనరించినది క్రూరకృత్యము కానేరదు. ఏలనన, నీవు చోరవృత్తివలన నార్జించిన ధనమును భగవదారాధనకు మాత్రమె వెచ్చించుచుంటివి. దాన సర్వవ్యాపినై యుండి చేయించినవాడను, అనుభవించినవాడను నేనే గనుక, తత్ఫలము నన్నే జెందునుగాని, నిన్నింతమాత్రమును నంటదు. తొల్లి నాభక్తులలో గొందరు చోరకృత్యమునవలన దేవాలయప్రతి ష్ఠయు, దివ్యమందిరనిర్మాణములును గావించి, పాంథులకు భోజనాదుల నేర్పరచి, సాధుజనులసౌకర్యార్థమై తటాకాదుల నిర్మించి, తమక్రూర కృత్యదోషముల బోగొట్టుకొనిరి. నీవునునదేవిధముగా సత్కార్యముల

వలన పాపమునకు దూరమయితివి. ఇకనయినను నీ చోరకృత్యము లను విడిచిపెట్టుము. నా యనుగ్రహము వలన నీకు నేటినుండియు అష్టమహాసిద్ధులును చేకూరును. వాటి మూలమున నీ వేశ్యారకృత్య మును నొనరింపనక్కరలేకయే, నెట్టికొరతయును లేకుండ సాధుపూజను జరిపించుచు సుఖింపగలవు ". అని వాత్సల్యముతో బల్కిన విష్ణుదేవు నకు హారిపాలదాసు నమస్కరించి " ప్రకృతి కతీతుడనయిన నోపరమ పురుషా ! యజ్ఞమున, హవిస్సయియుండు నీకు నమస్కరించుచు న్నాను. పంచభూతాత్మవై, ఏకాదశాత్మవై, సర్వభూతనియామకుం డవై, సర్వరక్షకుండవై, సర్వేశ్వరుండవైన నీకు మ్రొక్కుచున్నాను. ఆత్మవై, అవ్యక్తాత్మవై, పరమాత్మవై, జీవాత్మవలె కర్మోపాధిక మగు దేవమానవాది రూపవిరహితుడవై, నిర్వికారపరబ్రహ్మవై, నామరూపశూన్యుడవైన నీకు బ్రణమిల్లుచున్నాను. నన్ను రక్షించి కరుణజూడుము " అని పెక్కువిధంబుల నా దేవదేవదంపతులను స్తుతించెను.

అంత నా భగవత్స్వరూపుండు " వత్సా ! నా స్వరూపమును సేవించుటవలన నీవు చరితార్థతనందితివి. నీకల్మషములన్నియు దొలగి పోయినవి. నీ వచిరకాలములోనె నాసాన్నిధ్యమును జేరుకొనగలవు ". అని దీవించి, లోకమాతయగు నా లక్ష్మీదేవితో నంతర్ధానమయ్యెను. అనంతరము హారిపాలదాసు నిత్యమును దన గృహమున కరుదెంచునట్టి సాధుజనంబులకు అన్నవస్త్రాదులనిడి వారల సంతృప్తులం జేయుచు నుండి, మరికొన్నాళ్ల కవసానకాలము ప్రాప్తింపగా నా పరమభక్తుడు విష్ణుసాన్నిధ్యముం జేరుకొని శాశ్వతానందపదవి నందెను.

---

# 42 కూర్మదాసు.

——:0:——

పూర్వకాలమునం దొకపట్టణమున కూర్మదాసుండను నొక బాలకుండు బ్రాహ్మణకులమునందు జన్మించెను. అతడు పుట్టుకలోనె కాళ్లులేనివా డయ్యెను. అతడు క్రమముగా బెరిగి నడువలేనందున నెచటికి పోవలయుననినను, తాబేలువలె ప్రాకుచు పోవుచుండుటచే నతనికి కూర్మదాసుండను నామము కలిగెను. ఆ పసిబాలుం డయిదారు సంవత్సరముల ప్రాయము గలిగినప్పటినుండియు, పరమభక్తుడై, యెచట భజనలు జరుగుచున్నను, దైవసంబంధమగు నే యితరగోష్ఠి జరుగుచున్నను, నటకుబోయి వాటినెంతయు శ్రద్ధతో నాలకించుచుండును. ప్రతి క్షణమును హరినామస్మరణను దప్పక నుచ్చరించుచుండును.

ఇట్లుండ, నొకదినంబున కొందరు బ్రాహ్మణు లొకచోట గుమిగూడి 'పండరిపురమహాత్మ్యము' ను జదువుకొని యానందించుచుండిరి. అంతట కూర్మదాసుండును మెల్లన ప్రాకిపోయి, యా పండరిపురమహాత్మ్యమునంతను సాంతముగా నాలకించి బ్రహ్మానందమునంది, యా బ్రాహ్మణసమూహము నుద్దేశించి యిట్లనియెను. "తండ్రులారా! నాకు పండరిపురమును దర్శింపవలయుననెడి గాఢమైనకోరిక గలిగినది. అది యెట్లునెరవేరును?" వాని మాటలవినిన బ్రాహ్మణులునవ్వి, "ఓరీ! సర్వావయవములను గలిగి, ద్రవ్యసహాయమును గూడ పొందియున్న మేమే పండరిపురమును దర్శింపజాలకుంటిమి. అట్టియెడ, కుంటివాడవును, నిరుపేదవునునైన నీవెట్లు పండరిపురమును దర్శింపగలవు. ఇక నటువంటి పిచ్చికోరికలను వీడి, యొకమూలపడి యుండి, నీవు పూర్వజన్మంబున నాచరించిన కర్మఫలము ననుభవింపు" మనిరి.

ఆ యవమానకరములయిన మాటల నాలకించిన కూర్మదాసు బోరున నేడ్చుచు, మెల్లన ప్రాకుకొని యిల్లుచేరి తనలో దానిట్లు వాపోవదొడంగెను. "అయ్యో! పూర్వజన్మమునందు నేనేమహాపాప కార్యముల నొనర్చుటవలననో కదా, నాకీజన్మంబున నీరీతిగ కాళ్లులేకుండ పోయెను! ఇక నేను పండరిపురమును దర్శించి, ఆ పండరినాథుని గన్నులార దిలకించి, చేతులార భజించి, నోరార కీర్తింపనియెడల నాజన్మ నిరర్థకంబుకాదా! ఓ రుక్మిణీవల్లభా! పండరినాథా! నిన్ను దర్శింప జాలనియెడల నేనుండియు లేనివాడనే! గాన యిపుడే నీదర్శనార్థమై బయలుదేరుచుంటిని. నన్నెట్లుకాపాడి, పండరిపురముజేర్చి నీ దర్శనభాగ్యము గలుగజేయుదువో! ఆ భారమంతయు నీదేసుమా!" యని మనంబున దలంచి, యాబాలకుండు నాడే యేరికిని దెలియకుండ పండరిపురమునకు బోవపయనమయ్యెను. ఆనాడాతడట్లు భూమిపై ప్రాకుచు రెండుక్రోసుల దూరమువరకును పోయి, యిక ప్రాకుటకు శక్తిలేనివాడై యలసి, యాప్రాంతమునంగల యొకదేవాలయముచేరి యట నున్న శ్రీరాముని విగ్రహమునకు నమస్కరించి,

"ఓ లోకైకనాథా! ఆపద్బాంధవా! దీనశరణ్యా! నన్నెట్లయిన పండరిపురము జేర్చవా? నాకు నీవుదక్క నింకెవ్వరుదిక్కు?" అని పరిపరివిధముల ప్రార్థించి, ఆకలి మిక్కుటముగా నగుటచే నచ్చటనే శోషిల్లి పడిపోయెను. అంతట దయామయుండును, భక్తవత్సలుండును నగు పండరినాథుడొకవర్తకుని వేషమును ధరించివచ్చి, యా దేవాలయమున బడియున్న కూర్మదాసునకు వివిధోపచారముల నొనర్చెను. కొంతతడవునకు గూర్మదాసు సేదదీరి, తన చెంతనున్న వర్తకునకు నమస్కరించి, "అయ్యా! తమరెవ్వరు? ఎందేగుచుంటిరి? నాయందు దమకేల యిట్టియవ్యాజానురాగము కలుగవలయును?" అని యడుగ, నావర్తకుడు "వత్సా! నేనొక బేహారిని. పండరిపురము

నకు బోవలయునని బయలుదేరి పోవుచు, మార్గమునంగల యీదేవ శమున విశ్రమింపవలయునని వచ్చి, యిట నిన్నుగని జాలినందితిని. నీ వెవ్వరిచిన్నవాడవు ? ఇందేలపరుండియుంటివి ? " అని ప్రశ్నించిన, యావర్తకునకు కూర్మదాసుం డిట్లనియెను. " తండ్రీ ! నేనును పండరి నాధుని సేవింపవలయుననెడి యుత్సాహముతోడనే యరుగుచుంటిని. కాని కాళ్లులేనివాడ నగుటచే మెల్లనభూమిపై, ప్రాకుచు, నింతవరకును రాగలిగితిని. ఇకముందున కెట్లుపోవలయునో దెలియక యుస్లాడు చున్నాడను. నన్ను కూర్మదాసందురు. బ్రాహ్మణకులమున జన్మించిన వాడను. కుంటివాడనయిన నాకా పండరినాధుని దర్శనము కలుగునా తండ్రీ ! " యని యెంతయు జాలిగొలుపు ఆ బాలకుని మాటలకు వర్తకవేషధారియగు పండరినాధు డిట్లనియెను. " వత్సా ! విచారింప కుము. నీకు పండరినాధుని దర్శనము కలుగగలదు. నేనును నటకే బోవుచుంటినిగాన, నీవు నాతోరమ్ము. కుంటివాడవయిన నీవు నాతో నెట్లు నడువగలవని సంకోచింపకుము. నేనును నీతోడనే మెల్లగా ప్రయాణము సేయుదును. " అని యా బాలకునోదార్చి, యట వంట కములజేసి వర్తకుడా బాలకునకు బెట్టి తాను తిని, తిరుగవానితో ప్రయాణము సాగించెను. ఇట్లావర్తకుడు కూర్మదాసును మెల్లగా ప్రాకించుకొనుచు, ప్రయాణము సల్పుచు, వాని కలసట కలిగినప్పు డెల్ల మధ్యమధ్య విశ్రాంతిగృహంబుల విడిదిసేయుచు, నటతానె కూర్మ దాసుకు భోజనాదుల నేర్పరచుచు, తిరుగ ప్రయాణము సల్పుచు చాలదూరము గడచి, పిమ్మట నాలుగుమాసములకు పండరిపురమునకు పదిక్రోసుల దూరముననుండు బహుళాపురము జేరికొనియెను. ఎన్నె న్నియో శ్రమలకోర్చి తన్నంతదూరము గొనివచ్చిన యా వర్తకునకు గూర్మదాసు పెక్కుభంగుల నమస్కృతులనిడి, యా బహుళాపుర మున నానాడు విశ్రాంతిదీసుకొన నుండెను.

ఆ మరునాడె పండరిపురమున కార్తీక శుద్ధయేకాదశీ మహోత్సవము మహావైభవముగ జరుగనుండెను. ఆ యుత్సవమును జూడదలంచిన యనేకమంది యాత్రాపరులు బహుళాపురముననే విడసిరి. కూర్మదాసు వారలదర్శించి "అయ్యో! పండరిపురమున రేపు జరుగఁబోవు యేకాదశీయుత్సవమును జూచుభాగ్యము నాకు లేకపోయెనుగదా! ఈ పది క్రోసులదూరమును ప్రాకుటకు నా కథమపక్షమయిదుదినములయినను పట్టును. ఓ భక్తిపరులారా! కుంటివాడనయిన నాకు పండరినాథుని యుత్సవముజూచు భాగ్యము లేకపోయినది. మీరు నాయందను గ్రహించి, నా నమస్కృతులను పండరినాథునకు దెలిపి, నా దీనావస్థను వాని కెరింగించి, నన్ను దయజూడుమనుడు. అనాథనాథుడును, దయాసముద్రుడును నగు ఆ పండరినాథుని దర్శనమునకై కాళ్లులేని నేను, మేఘాంబువుల నపేక్షించు చాతకపక్షి చందంబున వేచియుంటినని విన్నవింపుడు. మాతనెడబాసిన గోవత్సమువలె నేనా పాండురంగని దర్శనములేక గుందుచుంటినని దెలుపుడు". అని ప్రార్థింపగానాయాత్రాపరులు కూర్మదాసుని యానతిచొప్పున సేయుటకు సమ్మతించి. ప్రయాణమును సాగించి, యనతికాలములోనె పండరిపురమునుజేరుకొని, చంద్రభాగలోజలకమాడి, పవిత్రులై పండరినాథునిసన్నిధి జేరుకొనిరి.

అట పండరినాథుడు నిజరూపముతో దన్ను దర్శింపవచ్చిన భక్తజను లెల్లరతోడను మహోత్సాహముతో భజనలు సల్పుచు, నృత్యములు సేయుచు, మైమరచియుండ, నాతని యాంతరంగిక భక్తులగు నామదేవ, జ్ఞానదేవు లాదేవుని పలువిధంబుల స్తుతించుచుండిరి. ఇట్లా పాండురంగడు నిజభక్తజనంబులతో సరససల్లాపము లాడుచు నానందపరవశుడై యున్న సమయమున బహుళాపురమునుండి యరుదెంచిన భక్తులు పాండురంగనికి కూర్మదాసుయొక్క యావద్వృత్తాంతమును వివరించిచెప్పి, వెండియు నిట్లనిరి——

"ఓ యనంతకళ్యాణ గుణనిధీ! పండరినాథా! కూర్మదాసుం డనునొక బ్రాహ్మణ బాలకుండు నీ దర్శన భాగ్యమునకై పలు తెరంగుల విలపించుచున్నవాడు. ఆతడు కృంటివాడగుటచే బహుళాపురము వరకును నెట్లో ప్రాకివచ్చి, నేడీయుత్సవమున పాల్గొనజాలనివాడై, యట మహాఖేదమందుచు, నిన్నెట్లు చేరగలుగుదునాయని వాపోవుచున్నాడు". అనివిన్నవింప నావిఠలనాథుడు తన భక్తుడగు కూర్మదాసునకు దర్శనమొసంగుట కర్తవ్యమనియెంచి, నామదేవ, జ్ఞానదేవాది పరిజనంబులతో పయనంబై చని, మార్గమధ్యమంబునగల 'పెండి' యనుగ్రామముచేరి యటనున్న తన యాంతరంగికభక్తుడగు సామంతునకు దర్శనమొసంగి, వానినిగూడ దోడ్కొని, యనతికాలములోనే, బహుళాపురముజేరి యట తనదర్శనార్థమై విలపించుచున్న కూర్మదాసును కౌగలించుకొని యాతని కన్నులనుండి కారు కన్నీటిబిందువులను దన చీనాంబరముతో నుడిచి, యాబాలకుని రొమ్మునకు హత్తుకొని "కుమారా! నాదర్శనమునకై నీ వెంతగా పరితపించుచుండినదియు నే నెరుంగుదును. వర్తకవేషమును ధరించి, నిన్నింతవరకు గొని వచ్చినది నేనుగానా? కాని యేమిచేయుదును? నేడు నా యుత్సవ దినంబగుటవల్లను, జ్ఞానదేవ, నామదేవాదులగు భక్తులెల్లరును నా కొరకు వేచియుండుటంచేసియు, నిన్నటిదినమున నిన్నిటవిడచి పోవలసినవాడనైతిని. అంతిదనుక నేను నీచెంతనేయుండి, నీ కుపచర్యల జరిపిన వాడనుగానా?" యని వాత్సల్యమొప్ప బలుక కూర్మదాసు పరమానందభరితుడై పండరినాథుడగు పాండురంగని కౌగలించుకొని,

"ఓ ప్రాణనాథా! నన్నీరీతిని వీడిపోవుదువని నే నంతకుముందే యెరింగి యుండినయెడల నీ పీతాంబరమునకు నా మొలత్రాడును గట్టిగ ముడివేసికొని, యేమరక యుండెడివాడను గదా! ఇప్పటికయి

నను నాయం దనుగ్రహించి, బ్రహ్మాదులకయినను నలభ్యంబయిన నీ దర్శనభాగ్యంబును నాకుఁ గలుగఁజేసి నన్ను ధన్యునిఁజేసితివి.

శ్లో॥ శ్రీవల్లభేతి వరదేతి దయాపరేతి
భక్తప్రియేతి భవలుంఠనకోవిదేతి।
నాథేతి నాగశయనేతి జగన్నివాసే
త్యాలాపనం ప్రతిపదం కురుమేముకుందం॥

అని కూర్మదాసు పాండురంగని స్తుతించి, యానందబాష్పంబుల రాల్ప, నాదేవుం డాతని చేయెత్తి దీవించి, "వత్సా! నాకును నీకును రూపభేదముదప్ప, స్వరూపభేద మెంతమాత్రమును లేదు సుమా! నీవు కోరునదెద్దియో కోరుకొనుము. ప్రసాదింతును". అని సాదరముగ బలుక, నా దేవదేవునకు గూర్మదాసు "ఓ దయానిధీ! నీ నామామృతపానము దప్ప మరియొక భోగ్యపదార్థమును నేనొల్లను. లక్ష్మీవల్లభాది నీనామంబుల నే నేమరక నాలాపించునట్లు ప్రసాదించితి వేని, యదియె నాకు బదివేల వరప్రసాదితతుల్యంబగును. అయినను నాయందు వాత్సల్యముతో వరముల వేడుమంటివిగాన, నామొర నాలకింపుము—ఈ లోకమునందుగల యెల్లమానవులును జేయునట్టి సర్వకార్యములును పాప భూయిష్టములుగనే యున్నవి. అట్టివారు నిన్ను దర్శించి, పావనచరిత్రు లగుటకుఁగాను, నీ విచటఁగూడ నివసించి, నిన్ను మరచి, సంసారంబనియెడి మహార్ణవంబునబడి దరిగానక, తాపత్రయంబులకు లోనై, మహాదుఃఖముల ననుభవించు మూర్ఖపుబ్రజలకు నీ దర్శనభాగ్యము నలవడఁజేసి, నీ నామామృతపానంబుచే వారలఁగూడ జరితార్థజన్ములుగా నొనర్పుము. ఇదియె నే గోరుకొను వరము". అని మనవిచేయ, భక్తమందారుఁడగు నాపాండురంగుఁడు కూర్మదాసు యొక్క మనోవాంఛితము ననుసరించి, బహుళాపురమున నొక యాల

యము నేర్పరుచుకొని, యందు నివసించుచు, కూర్మదాసునెడ దనకు గల వాత్సల్యము నిప్పటికిని ప్రకటించుచున్నాడు.

నేడీ బహుళాపురము పండరిపురముతో సమాన యాత్రా స్థలంబై ప్రతిసంవత్సరమును ఆషాఢ కార్తీకమాసములందు వేనకువేల భక్తజనులచేతను, యాత్రాపరులచేతను సేవింపబడుచు, కూర్మదాసు యొక్క నామము నట చిరస్థాయిగానిలపి, యాతని భగవద్భక్తిని దెలుపు కీర్తితారమై కోటిసూర్యప్రభలతో వెలుగందుచున్నది.

---

# 43 సురదాసు.

మున్నొకప్పుడు మధురానగరంబున బరమభాగవతోత్తముండగు సురదాసుండను మహానీయుడు జన్మించియుండెను. అతడు పుట్టుగ్రుడ్డి వాడయ్యు, మహాజ్ఞానసంపన్నుండై, యాజ్ఞానచక్షువుచేతనే భగవంతుని దర్శించుచు, ననుక్షణమును భగవన్నామస్మరణనే జేయుచు, తానుస్వయముగా రచించినకీర్తనలను రాల్లరగునట్లుబాడుచు వినువారి వీనులకు విందుగొల్పుచు, తనమధురగానముచే గంధర్వులపైతము బులకాంకితుల నొనర్చుచుండెను.

ఇట్లుండ సురదాసొక్కదినంబున నొకనిసాయమున నాగ్రామమునంగల యొకదేవాలయమునకరిగి, యందుగలస్వామికెదుటనిలచి, యాదేవదేవు నీవిధముగా స్తుతింపదొడంగెను—

"ఓ మహానుభావా! నే నేజన్మంబున నేయపరాధమొనర్చితినని, యీజన్మమునందు నన్నీవిధముగా బుట్టంధునిజేసితివి? నిన్ను

గన్నులార దర్శింపజాలక అంధుడనై యున్న నేను జీవన్మృతుడనేగదా! అయ్యో! నే నెంతటి నిర్భాగ్యుడనయితిని. ఓ మహాప్రభూ! విజ్ఞానమున కునికిపట్టువై, ప్రకృతికతీతుడవై నట్టియు, సకలమవై, సకలమునకాత్మవై, సర్వభూతాత్మలకును నియామకుండవై నట్టియు, బ్రహ్మ, విష్ణు, శివంబులనియెడి కల్పితనామంబుల బిలువబడుచుండియు, నామరూపరహితుండవై నట్టియు, నోపరమేశ్వరా! నిత్యమైనట్టియు, యుక్తముండై నట్టియు, నిరాకారమైనట్టియు పరబ్రహ్మస్వరూపుండవును నీవే కదా! సర్వజీవాత్మలకునగు కర్మసాధకమగు దేవమానవనామరూప కల్పనలు లేనివాడవును నీవే! పభేదంబులగు వివిధరూపంబులతో సర్వప్రపంచమును రక్షించుచుంటివికదా! అట్టి దయామయుండవగు నో పరమేశ్వరా! నాయందిట్టి యుదాసీనత నేలబూనవలసినచ్చె? నీ దివ్యమంగళవిగ్రహమును సేవించుటకు సాధనములగు కన్నుబోగొట్టుకొని, నేనికజీవింపజాలను. ఇదిగో! యిపుడే నాపాపభూయిష్టమగు తనువును నీసన్నిధానముననే విసర్జించుచున్నాడను. నన్ను నీలో నైక్యముజేసికొని తరింపజేయుము". అని సురదాసు తనమొలనున్నకత్తినిదీసి, యాదైవసన్నిధానమునం దాత్మహత్య గావించుకొనుట కుద్యుక్తుడు కాగా, దయాసముద్రుడును, నాత్రత్రాణపరాయణుండును, భక్తవత్సలుండును నయిన శ్రీకృష్ణపరమాత్మ తనదివ్యసుందరవిగ్రహముతో సురదాసునకు సాక్షాత్కారమొసంగి, వానికి దన్ను దర్శించుటకు దృష్టిని ప్రసాదించెను.

వెంటనే సురదాసా గోపికావల్లభుని పాదములబట్టుకొని—యాతని మంగళస్వరూపమును నేత్రోత్సవంబుగా దిలకించి,—

శ్లో॥ "త్వమాదిదేవః పురుషః పురాణ స్త్వమస్యవిశ్వస్యపరం నిధానం।
వేత్తాసివేద్యంచ పరంచధామత్వయాతతం విశ్వమనంతరూప॥

వాయుర్యమోగ్ని ర్వరుణశ్శశాంకః ప్రజాపతి స్త్వం ప్రపితామహశ్చ।
నమోనమ స్తేస్తు సహస్రకృత్వఃపునశ్చభూయోపి నమోనమస్తే॥
నమః పురస్తాదథపృష్ఠతస్తేనమోస్తుతే సర్వతయేవసర్వ।
అనంతవీర్యామితవిక్రమ స్త్వం సర్వంసమాప్నోషితతోసిసర్వః॥

భగవానుడా! నీవాదిదేవుడవు—పురాణపురుషుడవు—సర్వప్రపంచమునకును మూలాధారమైనవాడవు—విశ్వకర్మవు—విశ్వపాలకుడవు—విశ్వేశ్వరుండవు—విశ్వవ్యాపకుండవు. వాయు, వగ్ని, వరుణాది పంచభూతంబులును నీవేకదా! నీకు శతసహస్రవందనము లర్పించుచుంటిని. నాకు దృష్టినిబ్రసాదించి, నీదివ్యమంగళవిగ్రహమును సేవించుమహాపదంబు నొసంగిన నీయద్వితీయకరుణాకటాక్షము నేమని వర్ణింపగలుగుదును? నిన్నుగనిన యీ నా నేత్రములతో నేనన్యపదార్థముల దిలకింపజాలను. నీ సుందరమూర్తినిగని సంతృప్తమానసుండనైతిని. ఇక నాకీదృష్టితో బనిలేదు. ఈదృష్టినిక బోగొట్టి నీవిశ్వస్వరూపము ననవరతమును దర్శింపగలుగు జ్ఞానచక్షువును బ్రసాదింపుము. ఇదియే నేను నిన్నుకోరువరము". అని సురదాసు రుక్మిణీనాధునకు బెక్కుభంగుల మ్రొక్కులిడెను. అంత నాకృష్ణపరమాత్ముండును దన నిజభక్తుడు కోరినతెరంగున వరమునుబ్రసాదించి, యాతనిని కైవల్యప్రాప్తికిదీవించి, యంతర్ధానుండయ్యెను. నాటనుండియు సురదాసు మరింతభక్తితో శ్రీకృష్ణమహాత్మ్యమును నెల్లరకుబోధించుచు, నిత్యమును నాహరినామసంకీర్తనమునందే కాలముగడపుచుండెను.

ఇది యిట్లుండ, అవంతికాపురాధీశ్వరుం డనేకులగు సుప్రసిద్ధగాయకశిఖామణులను దన యాస్థానమునందుంచుకొని పోషించుచుండెను. అంతట నొకదినమున నా ప్రభుండు సర్వజనులతోడను, సంగీతవిద్వాంసులతోడను నిండుకొలువుండిన సమయమున నెందుండియో

యొక గాయకుం డరుదెంచి, యా ప్రభువునకు నమస్కరించి, "అయ్యా! నే నొక సంగీతపాటకుడను. నావిద్య నేలినవారు పరీక్షించి, సత్కరింపగలరను యాశతో నరుదెంచినవాడను పిమ్మట దేవర చిత్తము". అనగా, నారాజు సమస్తసంగీతవిద్వాంసుల సముక్షమునందును నా నూతనవిద్వాంసుని విద్యాకౌశలమును జూపుమని కోరగా, నా గాయకుడు, మహాద్భుతముగా బాడి, గంధర్వుల మించు తన మధురగానముచే నెల్లరును విమోహితులను గావించెను. ఆయాస్థానమునగల సర్వసంగీత ప్రవీణులును వాని పాటనువిని తలలువంచుకొనిరి. అంతట నా రాజు విద్వాంసునిగని "ఓ గాయకశిఖామణీ! నీ సంగీతవిద్యానిపుణతకు మాకెంతయు సంతసమయినది. నీవీ విద్య నెటనేర్చుకొంటివి? నీయంతటి ప్రతిభావంతుని నే నింతకు మున్నెన్నడును జూచియుండలేదు. నీ గురువు లెవ్వరో మాకు దెలిపి, మాసంతోషము నినుమడింపజేయుము". అని కోరిన నా ప్రభువున కా గాయకుం డిట్లనియెను.

"అయ్యా! నా గానకౌశల మేపాటిదని నన్నింతగా స్తుతించుచున్నారు. నేను కేవలము సామాన్యపాటకుడను నేను కొలదికాలము మాత్రము సురదాసుం డనియెడి యొకభక్తునకు శుశ్రూషగావించి యీ విద్య నలవడజేసికొంటిని. ఆ మహనీయుడు తన మధురగానముచే గఠినశిలల గరిగింపగలడు—మోడులు చిగుర్చునట్లు చేయగలడు— అతని శ్రావ్యగీతముల నాదిశేషువు లాలకించును—గంధర్వులు తలలు వాల్తురు". అని నుడువ, నా ప్రభుండు సురదాసుని గానమును విని తరింపగోరి, సమర్థులగు కొందర యుద్యోగస్థులను సురదాసునికడకు బంపి, యాతని నెట్లయిన బ్రతిమాలి గొనిరావలసినదిగా నాజ్ఞాపించిన యనంతరమా గాయకునకు బెక్కుబహుమతులను, అమూల్యాభరణములను నొసంగి సత్కరించెను.

సురదాసు అవంతికాపురాధీశ్వరుని ప్రార్థనము నంగీకరించి, యాతని యాస్థానమున కరుదెంచగా, నా భూపతి భక్తునకు బ్రణమిల్లి, వివిధపూజలతో వానిని సత్కరించి, వాని పాదజలమును శిరమునదాల్చి, రాజభవనమునకు గొనిపోయి, వానిని, తన నిజసింహాసనమునందు గూర్చుండబెట్టి, యంతఃపురస్త్రీలును, మిగిలిన యెల్లపరివారజనంబులును నా భక్తాగ్రగణ్యునకు సేవలజేయుచుండ, నా యవనీపతి యా పరమభాగవతోత్తమునకు సవినయముగా నిట్లు మనవి జేసికొనియెను.—

"ఓపరమభక్తశిఖామణీ! మిమ్ములనిచటకు గొనివచ్చి మీకు శ్రమ గలుగజేసినందులకు క్షమింపుడు మీ గానామృతపానము జేయవలయునను తలంపుతో యిట్లొనరించితిని నాతప్పును క్షమించి, నాకోర్కెను దీర్చుటకు తమ్ము ప్రార్థించుచున్నాను". అనిన నాభూవరేణ్యుని మాటల కా యోగివరేణ్యుండు నవ్వి, "ఓ రాజా! నా గానమును వినవలయుననియెడి కోరిక నీకుగలదేని, యట్లని గావింపవచ్చును. ఈ తనువొకరిని సుఖపెట్టుటవల్లనే సార్థకమగుచున్నది సుమా! నావలన నొక్క ప్రాణికైనను నానందము గలిగినయెడల నాకు సంతోషముగల్గును". అన, "ఓ మహానుభావా! మీగానమువలననే నొక్కడనే యానందము నందుటగాక, నా యాస్థానమునగల యనేకమంది మీగీతముల వినవలయునని యువ్విళ్ళూరుచున్నారు". అని యారాజు అనినంతనే, సురదాసు తన శ్రావ్యకంఠము నెత్తి భగవల్లీల దెలుపు కొన్నిగీతముల నతిమధురముగా బాడదొడంగెను. అతని మధురగానమునకు నిజముగా రాల్గరగజొచ్చెను. మ్రోడులు చిగుర్పనారంభించెను. రంభ, యూర్వశాది గంధర్వాంగనలు తమ నిజరూపములతో నా సభయం దవతరించి, సురదాసుని గానమున కనుగణ్యముగ నృత్యము సేయదొడంగిరి. నారదుడు, తుంబురుడు మొదలగు

మహాగాయకు లెల్లరును స్వర్గమునుండి యట నవతరించి, సురదాసుని గానమునకు నిశ్చేష్టులై తన్మయావస్థ నందసాగిరి. అంతట నా యునం తికాపురాధీశ్వరుని సభామంటప మంతయు నింద్రలోకముగా మారి పోయెను. గానలోలుడగు శ్రీకృష్ణమూర్తి సైతము రాధతో నట నవతరించి, సురదాసుగానముతో తనవేణునాదము శృతికలిపి నృత్యము చేయదొడంగెను. అట్లు కొంతతడ వెల్లరును తన్మయులై మహానందము ననుభవించిన యనంతరము సురదాసు గానసమాధినుండి మేల్కాంచి, కన్నులవిప్పిచూడ, కట్టెదుట శ్రీకృష్ణభగవానుడు తన నిజస్వరూప ముతో నృత్యము సల్పుచుండెను. సురదాసు గానము నాపగనే నెల్ల రును సుషుప్తావస్థనుండి మేల్కాంచినవారిపగిది కన్నులవిచ్చి చూడగా, నదియే యింద్రలోకమయ్యెను. సురదాసు శ్రీకృష్ణభగవానుని పాద ములపై వ్రాలి, "ఓ పరమాత్మా! నేను నాకే కాక, యిటనున్న వారల కెల్లరకును గూడ నిదర్శనభాగ్యమును గలుగజేసి, యెల్లర ధన్యులుగా నొనర్చితివి. ఇకనేను నిన్నుబాసి యుండజాలను. కనుక నోపరంధామా! నన్ను నీలోజేర్చుకొని కృతార్థునిగా నొనరింపుము" అని వేడగా దయామయుడగు నా దేవకీనందనుండు సురదాసుని తనలో నైక్యముజేసికొని, వాని చిరకాలవాంఛితమును నెరవేర్చెను.

నారద తుంబురాది మహాఋషిపుంగవులును, రంభాది దేవాం గనలును, ఆనాడు తమకు తలవనిదలంపుగా భగవద్దర్శనభాగ్యము కలిగినందులకు పరమానందభరితులై, యాదేవదేవుని పెక్కువిధంబుల నుతించిరి. సురదాసు మూలముగా నల్పజ్ఞులగు, దమకుకూడ శ్రీకృష్ణ సందర్శన మయినందులకు, అనంతికాపురాధీశ్వరుండు, తన సర్వాపరి జనంబులతోడను నా దేవదేవునకు బ్రణమిల్లి, యాతనిని గనిన తమ జన్మలు చరితార్థతనందినవని సంతసించిరి. అనంతరమా కృష్ణదేవుండు వారలనెల్లర దీవించి, రాధాసతితో నంతర్ధానమయ్యెను.

---

# 44 కళ్యాణదాసు.

కళ్యాణదాసుండనునొక సద్బ్రాహ్మణుండు హరిద్వారమున గృహ స్థాశ్రమంబుననుండియు, తామరాకునంటని నీటివలె, యాసంసారబంధ ములకు దగుల్కొనక, పరమభాగవతోత్తముండై, అతిథియభ్యాగతుల బూజించుచు, నిత్యమును హరినామస్మరణయందే కాలముగడపుచు, కొన్నాళ్ళుగడపినయనంతర మాతడు సకలతీర్థంబుల సేవింపవలయునెడి కోరికగలవాడై, భార్యాబిడ్డలకు దానుతిరిగి వచ్చుదనుక వలయునేర్పా టులనెల్లగావించి, యాత్రార్థంబై పైనంబై నానాక్షేత్రములసేవింపుచు నానాపవిత్రస్రవంతులగ్రుంకుచు గొన్నాళ్లకు సేతువునుజేరుకొనియెను. అటకే నొకగాడ బ్రాహ్మణ బ్రహ్మచారి నానాతీర్థములను సేవింప వచ్చెను. అతడు పరమభక్తుడు. వానిభక్తిజ్ఞాన వైరాగ్యములగనిన కళ్యాణదాసు మిగుల నానందపరవశుడై వానితో నేస్తముకలిపి హరి నామసంకీర్తనము జరిగిచుచుండెను ఇట్లుండ వారలకిరువురకును బ్రాణ స్నేహమయ్యెను. ఒండొరుల యభిప్రాయము లేకమయ్యెను. ఇరువు రును పరమభక్తులే—యిరువురును మహాజ్ఞాన సంపన్నులే. వారట్లా పుణ్యక్షేత్రమునందు కొన్నిదినములుండిన యనంతర మాతావునువీడి, భగవన్నామ సంకీర్తనములగావించుకొనుచు, యింకను ననేకంబులగు పుణ్యక్షేత్రంబుల సేవించి, యనంతరము, సకలజన సేవ్యంబును, పర మపవిత్ర యాత్రాస్థలంబును శ్రీకృష్ణుని జన్మస్థానంబును నయిన మధు రానగరంబున బ్రవేశించి, యట గొంతకాలముండిరి. అపుడె కాళ్యాణ దాసునకు శరీరమునందొక వ్యాధిజనించి, వానిని బెక్కు బాధలబెట్టెను. మిత్రుడును, దయాసముద్రుడును నయిన బ్రహ్మచారి యాతరుణమున కళ్యాణదాసున కెల్లవిధంబుల నుపచర్యలగావించుచు, నతివాత్సల్య ముతో వానికెల్లవిధంబులయిన సేవలను నొనర్చినగొన్నాళ్లకు గళ్యాణ

దాసునకు దైవకటాక్షమువలన దేహరుగ్మతవదలి, యెప్పటియారో గ్యముకలిగెను. తనకష్టకాలమునందు దనకెల్లవిధముల నుపచర్యలగావించిన యాబ్రహ్మచారియొక్క దయాగుణము నాతడు పెక్కుతెరంగుల మదిలోఁగొనియాడుకొని, యొకదినంబున నామిత్రునితో నిట్లనియెను. "మిత్రమా! నాకు వ్యాధిదినములలో నీవునాకొనర్చిన యుపచర్యల నే నీజన్మమధ్యంబున మరువజాలను. నీ ఋణమునెట్లు తీర్చుకొనవలయునో నేనెరుంగజాలకుంటిని. అయినను నాకొక్కయుపాయము మాత్రము నీ ఋణవిముక్తికొరకు తట్టుచున్నది. అదేమందువేని, నాకు సుగుణవల్లియు, మహారూపవతియు నగు నొకచక్కనికుమార్తె కలదు. ఆమెను నీవు బరిగ్రహించి నన్ను కృతార్థుని జేయవలయును. ఆమె నీకెల్లవిధముల దగినభార్యయగును". అని నుడువ నాబ్రహ్మచారి నుకుక్కపై వ్రేలిడికొని, "ఓయీ మహానుభావా! నేనాజన్మాంతమును నిట్లే బ్రహ్మచారిగానుండి, భగవన్నామస్మరణయందే కాలమును గడపుచు, నాదేవదేవుని సాన్నిధ్యమును బొందవలయునని ప్రయత్నించుచుండ, నీవీ విధముగ నన్ను దిరుగసంసారబంధములో ద్రోసి ముక్తికి దూరముజేయుట నీకుపాడియే? నీవు సర్వమునెరింగిన మహాజ్ఞానివిగదా! నన్నీసంసారమహాసముద్రమున దోఁయజూచుటకు నేను నీకేయపకార మొనర్చితిని? సంసారవ్యామోహమునందు దగుల్కొనినవాడు భగవంతునకు దూరమై, జన్మపరంపరలకు లోనగును గదా! నన్నేల యీరీతిని భ్రష్టునిజేయ జూచుచుంటివి? నీవింకను నాకేదోతత్త్వోపదేశము గావించి, తరుణోపాయము నెరింగింతువనుకొంటిని. బాగుబాగు! చివరకు నీవుచెప్పునది సంసార కూపమునంబడి యధోలోకమునబడమనియా?" అనినిష్టురోక్తులాడుచున్న యీబ్రహ్మచారికి గళ్యాణదాసీ విధముగా జెప్పదొడంగెను—

వత్సా ! ఎంతటి వెఱ్ఱివాడవోయి ! మున్ను గృహస్థులెల్లరును నధోలోకంబున బడిపోయిరనియే తలచుచుంటివా ? జనకుడు, విదురుడు, అంబరీషుడు మొదలగువారు గృహస్థులయ్యు పరమపదంబు నందలేదా ? భార్యాపుత్త్రులతోగూడి గృహమున నివసించుటచే గృహస్థుండనియు, నవిలేనంతమాత్రమున విరక్తుడనియు నెన్నడును దలంపకుము. తత్త్వత్రయాత్మకంబైన నీ జగత్తునందు, 'చిత్తు' యనబడు యాత్మ పరమచిత్తగు పరమాత్మకు శ్రీకౌస్తుభస్థానమై వెలయుచుండును. అహంకార మమకారాదులతో గూడుకొనియుండు హృదయము భగవంతునకు నివాసయోగ్యముకాదు. జ్ఞానియైనవాడీ యహంకార మమకారంబులనియెడి శత్రువులను హృదయమునుండి పారద్రోలి, యందు భగవంతుని నిలిపి, శమదంబులనియెడి జలంబులతో నా దేవునకు నభిషేకమొనర్చి అహింసాది పుష్పములతో బూజించుకొనుచున్నాడు. ఇట్టి నియమముగలవా డెట్లు ప్రవర్తించినను పరిశుద్ధాత్ముడే యగుచున్నాడు. పుత్ర, దార, గృహాదులుమాత్రమె మమకారహేతువులని యెంచకుము. వాటిని వీడిన విరాగికయినను, దండకమండలాదులు మమకారహేతువులు కావా ? వాటిని సహితము వీడినవానికి శరీరము మమకారహేతువగును కదా ! అట్లు మమకారముతో కూడుకొనిన వైరాగ్యమును బొందుటకంటె, పుత్రదారాది సర్వగృహస్థోపకరణంబులును నీశ్వరవిభూతియనియు, దనకు దేనితోను సంబంధము లేదనియు యెంచుచు, మమకారమును వర్జించియుండువానికి, దేహావిసర్జనానంతరము పునర్జన్మరాహిత్యమగు మోక్షప్రాప్తి కలుగుట తథ్యము.

శ్లో॥ బ్రహ్మణ్యాధాయకర్మాణి సంగంత్యక్త్వాకరోతియః ।
విప్యతేననపాపేన పద్మపత్త్రవివాంభసా ॥

అని శ్రీకృష్ణపరమాత్ముండు గీతాశాస్త్రమునందు నుడువుట లేదా ? దానిభావ మేమందువేని—ఏపురుషుడైతే, తా నాచరించు

సర్వకర్మలను నీశ్వరార్పణము గావించి, సంగవర్జితుండై యాచరించు చున్నాడో, యట్టిపురుషుని, తామరాకును నీ రంటనివిధంబుగానే, పాపము లంటజాలవు.

కనుక నో వత్సా! నీ కంతర్యామియై నీ రూపముచే ప్రకాశించుచున్న భగవంతునే నాకుమార్తెకు వరునిగా నిర్ణయించితిని. అందుచే నీ మధురానగరంబునగల మాధవుని సాక్షిగా నాకుమార్తెను నీకు సమర్పించితిని. ఆమె నీకు నేటినుండియు భార్యయయ్యెను. ఆమెతో సంసారమును సాగించుచు, భగవాదారాధా గుణుండవై చరింపుము. అపుడు భగవంతుడు సదా నిన్నెడబాయక యుండును". అని గా విం చి న క ళ్యా ణ దా సు యొక్క హితోపదేశమున కా బ్రహ్మచారి యెంతయునలరి, "ఓ మహానుభావా! కేవలము ఆ కృష్ణపరమాత్ముండే నీలో యావర్భించి, నాకీయుపదేశవాక్యముల బలికి, నా యజ్ఞానతమంబును బటాపంచలుగావించెను. నీ యనుగ్రహామువలన నే నజ్ఞానకూపంబున బడకుండ రక్షింపబడితిని. నాసర్వ సందేహములును నివృత్తిజెందినవి. ఇక నీ యాజ్ఞానుసారముగా నడచుకొనుటకు స్థిరచిత్తుడనై యుంటిని". యని నుడివెను. అంత కళ్యాణదాసా బ్రహ్మచారి హస్తమును బట్టుకొని, యా సమీపముననేగల శ్రీకృష్ణాలయమునకు గొనిపోయి, వాని నా మాధవుని విగ్రహమున కెదుట నిలిపి,

"ఓ కృష్ణభగవానుడా! నీ దివ్యసాన్నిధ్యమునం దీబ్రహ్మచారిని నా యల్లునిగా స్వీకరించి, నా కుమార్తె నిచ్చితిని". అని నుడివి, యా బ్రహ్మచారి హస్తమునం దుదకమును విడచెను. అనంతరము కళ్యాణదాసా బ్రహ్మచారితో నిజపురంబగు హరిద్వారము జేరుకొని, యెల్లరబందుగులను గలసుకొని, యా బ్రహ్మచారికి దన కుమార్తె

నిచ్చుట కేర్పరచిన సమాచారమునుజెప్ప, వా రెల్లరును గౌడ బ్రాహ్మ ణునకు, దమ కులములోని కన్యక నిచ్చుటకు ఏక గ్రీవముగా నసమ్మ తిని దెల్పిరి. కళ్యాణదాసు వారలకెల్లరకును నెన్నియో విధముల బోధించి, యా బ్రహ్మచారియొక్క సద్గుణములను, యోగ్యతను వివ రించి చెప్పెను. అయినను వాని బంధుగులెల్లరును నా వివాహము శాస్త్రవిరుద్ధమని వాదించి, అట్టివివాహము జరుగుట కెంత మాత్ర మును వీలుపడదని నుడివిరి.

అంత కళ్యాణదాసు చేయునదిలేక యాపట్టణమును పరిపాలించు రాజుకడకుబోయి తనయావద్వృత్తాంతమును విన్నవించి, తనకుమార్తె నా బ్రహ్మచారికిచ్చుటకు మధురానగరంబున శ్రీకృష్ణుని సాన్నిధ్య మున బాసయొనర్చిన విషయమును, నావివాహమునకు దనబంధుగు లెల్లరును నాటంకపరచుచున్న సమాచారమును నా ప్రభువునకువిన్న వించి, న్యాయమును ప్రసాదింపుమని వేడగా, నా ప్రభుండు కళ్యాణ దాసుతో నిట్లులనియెను ". ఓ పరమభాగవతోత్తమా! నీవు దేవుని యెదుట బాసయొనర్చినట్లు చేయకుండుట యధర్మమే. అయినను మత చట్టములకు విరుద్ధముగా గౌడ బ్రాహ్మణునకు నీకుమార్తెనిచ్చుటకు వీలులేదు. ఈవిషయమున నేనేపక్షము జెప్పుటకు వీలుపడకున్నది. అందుచే నీవేనిజమయిన భగవద్భక్తుడవయినయెడల—నీవు శ్రీకృష్ణ భగవానునియెదుట నీ బ్రహ్మచారికి నీకుమార్తెనిచ్చునట్లు వాగ్దాన మొనర్చినవిషయమే యదార్థమయినయెడల, నాకృష్ణభగవానునే నిటకు గొనివచ్చి సాక్ష్యము బలికింపుము. అప్పుడు నీయెల్లబంధుగులును నీ వాక్యములు విశ్వసించి, నీకుమార్తె నీ బ్రహ్మచారికిచ్చుట కంగీకరింప గలరు". అని నుడువ, యిక కళ్యాణదాసు చేయునదిలేక వెంటనే మధురానగరమునందు దానంతకుముందు బాసయొనర్చిన శ్రీకృష్ణుని దేవాలయమునకరిగి, యటనున్న శ్రీకృష్ణవిగ్రమున కెదుటనిలచి,

హ_స్తములముకుళించి, నిమీలితనేత్రుడై, " ఓ శ్రీకృష్ణభగవానుడా! నేను నీనిజమగు అంతరంగిక భక్తుడనగుదునేని, నీవెదార్థముగా భక్త వత్సలుండవౌదువేని, తొల్లినీవు ద్రౌపదిమానమును గాపాడుటయు, ప్రహ్లాదుని రక్షించుటయు, కరిని కరుణించుటయు మొదలగువిషయములెదార్థములయ్యేనేని, నీవిపుడె నావెంటజనుదెంచి. మున్ను నేను నీ కడ నాబ్రహ్మచారికి నాకుమార్తెనిచ్చి వివాహమొనర్చిన యెదార్థ విషయము నాబంధుగులకును రాజుకును రుజువుబల్కి, నాకవమానము రాకుండ కాపాడుము. ఓ ఆపద్బాంధవా! దీనశరణ్యా! కరుణాసముద్రుడా! ఇప్పుడు నాకు నీకంటెను నన్యముదిక్కులేదు. నిన్నునమ్మి యనవరతమును నీచరణసేవను దప్పని నీభక్తునిగాపాడ రావా?"

యని పెక్కువిధంబుల బ్రార్థించినయనంతరంబు కరుణామయుడగు నాయదుకులభూషణుండగు శ్రీకృష్ణమూర్తి కళ్యాణదాసునకు బ్రత్యక్షంబై "వత్సా! విచారింపకుము. నీయభిమతమువనుసరించి నేనిపుడే నీతోనరుదెంచి, నీబంధుగులకెల్లరకును యెదార్థవిషయమును జెప్పి, నీకుమార్తె నాబ్రహ్మచారికిచ్చి వివాహముజేయునట్లొనర్చెద" ననినుడివి, యాపరంధాముడు కళ్యాణదాసుతో హరిద్వారమునకరిగి; యటకళ్యాణదాసు రాకకై వేచియున్న వానిబంధుగులను, రాజును నుద్దేశించి, "ఓ మూర్ఖులారా! గౌడబ్రాహ్మణుండైనంతమాత్రమున, నాతడు మానవుడుకాడా? వానికేల కన్యనిచ్చుటకు సంకోచించుచుండిరి? ఈకళ్యాణదాసు నాకాంతరంగికభక్తుడు. ఈబ్రహ్మచారియు పరమభాగవతోత్తముండు. ఈతనికి దనకుమార్తెనిచ్చి కళ్యాణదాసు నాసన్నిధానం దింతకుముందే వివాహమొనర్చుట యెదార్థము. మీరికసంకోచింపక, యాకన్యకామణి నీబ్రహ్మచారికిచ్చి వివాహముగావింపుడు. అదియెనాకును సమ్మతము". అనినుడువ, నచ్చటివారెల్లరును శ్రీకృష్ణునకు బెక్కువిధంబుల మ్రొక్కులిడి, "ఓ శ్రీకృష్ణపర

మహాత్మా ! మేము నిక్కమముగా మూఢులమై చరించిన యీ మానేరమును క్షమించి, నీవే యీవధూవరులకు వివాహమొనర్చి మమ్ము కరుణింపుము ". అని వేడగా, నాభగవంతుడు తలంచినమాత్రమున విశ్వబ్రహ్మయరుదెంచి వివాహమంటపమును నిర్మించెను. కామధేను, కల్పతరులట ప్రత్యక్షంబై సర్వమును సిద్ధపరచెను. దేవతలెల్లరునువచ్చి వివాహకార్యము నిర్విఘ్నముగా కొనసాగింప, ఆకశమున దేవదుంధుబులు మ్రోగెను ఖేచరులు కుసుమవర్షము గురిపించిరి. శ్రీకృష్ణభగవానుడే పెండ్లిపెద్దయైయుండ నికనావివాహమున కెట్టికొరతలుండును ? అట్లావివాహ మత్యంతవైభవోపేతముగా జరిగినయనంతరము శ్రీకృష్ణభగవానుడా నూతనదంపతుల నాశీర్వదించి, సర్వపరిజనంబుల తోడను నిజనివాసంబగు మధురానగరంబును జేరుకొనియెను. కళ్యాణదాసు కుమార్తెయొక్క కాపురమును గన్నులపండువుగా జూచుచు, గొన్నాళ్లుగడపినయనంతరము విష్ణుసాన్నిధ్యముంజేరుకొని, శాశ్వతానందము ననుభవించెను.

---

# 45 త్రిపురదాసు.

——:0:——

మధురానగరంబున నొకప్పుడు త్రిపురదాసుం డనియెడి భగవద్ధ్యానపరుండగు నొక బ్రాహ్మణుండు వసియించుచుండెడివాడు. అత డనుదినంబునను వేకువననే లేచి నిత్యకర్మానుష్ఠానముల దీర్చుకొని, నిర్మలమగు నొక యేకాంతస్థలమున గూర్చుండి, మానసికముగా రుక్మిణీవల్లభునకు అర్ఘ్యపాద్యాది పూజల నాచరించుచు సంసారమునందనురక్తిలేనివాడై, సదా భగవంతునియందే మనస్సును నిలుపుకొని

ధ్యాహ్నించుకొనుచు కాలము గడపుచుండెను. ఇట్లు కొంతకాలము గడచిన యనంతరమా భక్తిపరునకు దీర్ఘయాత్రల సేవింపవలయు ననెడికోరిక జనింపగా, నతడు భార్యాసమేతుండై శ్రీకృష్ణనివాసమగు బృందావనమునకేగి, యట నివాసము నేర్పరచుకొని, అట వేంచేసి యుండు రుక్మిణీనాథునకు పెక్కువిధంబులగు నమస్కృతుల నాచరించుచు ననుదినంబును నిద్రాహారములందు సైతము నిచ్ఛలేనివాడై, యా స్వామియందే మనంబును లగ్నముగావించి, హరినామసంకీర్తనములు గావించుచు, నృత్యములసల్పుచు, నిత్యానందసాగరనిమగ్నుండై ప్రొద్దులు పుచ్చుచుండెను.

ఇట్లు కొంతకాలము గడువ మార్గశీర్షము సంప్రాప్తించి, యెల్ల మానవులను వణికించుచుండెను. ఆ శీతకాలమునందొక దినంబున త్రిపురదాసు దేవాలయమున శ్రీకృష్ణుని సంకీర్తనముల బాడుచు, నా దేవుని గీర్తించుచుండు సమయమున, నాస్వామి చలిచే వణుకుచున్నట్లాభక్తునకు గోచరింపగా నాతడుకన్నుల నీరుకార్చుచు "హా! మాధవా! అచ్యుతా! జనార్థనా! నీవు చలిచే వణుకుచుంటివా తండ్రీ! నీ కిందరు భక్తులుండియు నీకొక వస్త్రమునయినగప్పి, చలి బాధను నివారింప జాలకపోతిరా! అయ్యో! నా ముద్దులకృష్ణా! మురారికృష్ణా! ముకుందకృష్ణా! ఎంతగా నణుకుచుంటివి! చలిబాధను సహించుట యెంతకష్టము! అగు మాగుము. ఒకింత తడవుమాత్ర మోపికపట్టుము. నే నిప్పుడేపోయి నీకు మంచి వస్త్రమునుదెచ్చి కప్పి, చలిబాధను తొలగింతును. అయ్యో! నా కృష్ణుడెంతగా యల్లాడి పోవుచున్నాడు!" అని పెక్కుతెరంగుల విచారించుచు, కండ్ల నీరు కార్చుచు, నిజగృహంబునకరిగి, భార్యనుజూచి "ప్రేయసీ! ఎంత ప్రమాదము సంభవించినది! మన ముద్దులకృష్ణుడు చలిచే వణకి పోవుచుండ, మనమీరీతిగా చూచుచు, నూరకుండుట భావ్యమా!

మన గృహమునందొక్క వస్త్రమయినను లేదే! కొండమన్న చేత నొక కాసయినను లేదుకదా! అయ్యో! ఎంతటి దీనావస్థసంభవించి నది! నా దేవునిబాధను నివారింపజాలని నేను బ్రతికియు నేమిఫలంబు" అని పెక్కు తెరంగుల వాపోవు త్రిపురదాసునుగని, మహాసాధ్వియనం దగు వానిభార్య యిట్లనియె—

"నాథా! ఈ మాత్రముదానికే నింతగా విచారింపవల యునా! మన గృహమందు వస్త్రములు లేకున్నను, ధనములేకున్నను నేమాయె. మీరు నాకు పెండ్లిదినంబున జేయించిన మంగళసూత్రము నావద్దగలదుగదా, దాని నంగడికి గొనిపోయి, యెంతకయినను దెగ నమ్మి, యా యమూల్యముతో నొక మంచివస్త్రమును గొనితెచ్చి, చలిచే బాధపడు కృష్ణభగవానునకు గప్పుడు" అని నుడివి, యా యిల్లాలు తన కంఠమునందుండు మంగళసూత్రమును దీసి భర్తకిచ్చెను. ఆహా! భర్తల కనుగుణ్యముగా వర్తించు నిట్టిభార్యలు లభించుట ఆ భర్తల పూర్వపుణ్యఫలముకదా!

త్రిపురదాసు వెంటనే భార్యయొక్క మంగళసూత్రము నం గడియందు వెచ్చబెట్టి, యా ధనముతో నొకచక్కని శాలువనుగొని తెచ్చి, దైవసన్నిధానమున కరగి, యటనుండు యర్చకునకా వస్త్రము నొసంగి, చలిచేబాధపడు నాకృష్ణభగవానునకు దానిని గప్పుమని చెప్పగా, నాయర్చకుడు త్రిపురదాసుయొక్క మాటలకు లోలోన నవ్వుకొని, అట్లనేచేయుదునని చెప్పి, త్రిపురదాసును బంపివై చెను. త్రిపురదాసు సంతృప్తాంతరంగుడై వెడలిపోయిన యనంతరమా యర్చకుడు తనలో "ఆహా! చలిచే బాధపడు నీ శీతకాలమున నాకు బహుయోగ్యమయిన శాలువ లభించినది. ఆ వెర్రి త్రిపురదాసు చెప్పినయట్లీ శాలువ నీ నిర్జీవప్రతిమకు గప్పుటకంటె, నేనే దానిని గప్పుకొని సుఖించుటలెస్స". యని నిశ్చయించి, త్రిపురదాసొసంగిన

శాలువ నాదేవుని విగ్రహమునకు గప్పుటకుమారుగా దానే, గప్పు కొని, ఆ యాలయాంతర్భాగమునందు సుఖముగా నిదురించెను.

అంతట గొంతతడవునకు శ్రీకృష్ణుని విగ్రహమునుండి యొక యపూర్వధ్వని జనింపగా నా ప్రాంతమునగల నెల్లరును మేల్కాంచి చూడ, నా విగ్రహము గడగడ వణకనారంభించెను. అదిగనిన నెల్ల వారలును నత్యంతాశ్చర్య నిమగ్నమానసులై, శ్రీకృష్ణభగవానుడు చలిచే వణుకుచున్నాడని గ్రహించి, యనేకములగు పట్టువస్త్రము లను, శాలువలనుదెచ్చి, గప్పిరి. అర్చకుడు మాత్రము తనవద్దనుండు శాలువ నీయలేదు. ఎన్నివస్త్రములను దెచ్చికప్పినను నాస్వామి యిం కను నట్లే వణుకుచుండెను. అంతట నా ప్రజ లాదేవునకు గుంపటినెత్తిరి. ఇంకను నెన్నియో యుష్ణోపచారముల గావించిరి. కాని యా విగ్ర మట్లే వణకనారంభించెను. అంత వారెల్లరును జేయునదిలేక యాస్వా మికి సాష్టాంగపడి "ఓ దేవదేవా! మాయెడ నెట్టియపరాధము కలిగి నది? నీవీప్రకారముగా వణుకుచుండుటకుగల కారణమేమి? మాతప్పు లను క్షమించి, మేమిపు డాచరింపవలసిన కర్తవ్యము నానతిమ్ము". అని పెక్కుతెరంగుల వేడినయనంతర మా విగ్రహమునుండి, యీ క్రిందివాక్యములు వెలువడెను. "ఓ భక్తులారా! ఈ యమూల్యము లగు పట్టువస్త్రములును, ఉష్ణోపచారములు నాశీతలబాధను నివారింప జాలవు. నా యాంతరంగిక భక్తుడయిన త్రిపురదాసుచే నీయబడిన శాలువ యీ దేవాలయార్చకునికడ గలదు. దానిని నాకు గప్పితిరేని నా చలిబాధ తొలంగును" అని చెప్పగా నచటివారెల్లరును నర్చకొని బిలచి యడుగగా, నతడు తనవద్ద త్రిపురదాసుచే నీయబడిన శాలువ యుండుట యెదార్థమని నుడివి, దానిని వారికీయగా వారిలో గొంద రద్దానిని విగ్రహమునకు గప్పబోగా "ఆ త్రిపురదాసే యీ శాలు వను నాకు గప్పవలసియున్నదిగాని, యితరులు నాకుదీనిని గప్పరాదు".

అని మరియొకవాణి యావిగ్రహమునుండి వెలువడగా, నచటివారిలో గొందరు పరుగుపరుగున త్రిపురదాసుని కడకుబోయి, వానికి జరిగిన సర్వవృత్తాంతమును జెప్పి, వానిని దేవాలయముకడకు గొనివచ్చి, వాని శాలువను వానిచేతనే నాభగవానునకు గప్పించిరి. త్రిపురదాసు శాలువను విగ్రహమునకుగప్పి, దానిని బిగియార కౌగలించుకొని, "నా చిన్నికృష్ణా! వేణుగోపాలా! యింకను చలిపోలేదాతండ్రీ!" యనునంతలో నా కృష్ణవిగ్రహము వణుకుటను మాని యెప్పటియట్లుండి, సంతృప్తిని సూచింపగా నెల్లరును నాశ్చర్యచకితులై త్రిపురదాసుయొక్క చిత్తశుద్ధిని, భక్తిపరతను వేనోళ్ల గొనియాడి, యా మహనీయునకు బెక్కుభంగుల నమస్కృతుల నాచరించి, యెవరి గృహంబులకు వారు జనిరి. త్రిపురదాసుండును శ్రీకృష్ణపరమాత్మకు దనయెడగల వాత్సల్యభావమున కెంతయు ముదమంది, నిజనివాసమున కరిగి, భార్యకు జరిగిన వృత్తాంతమెల్లయు చెప్పి, యామె నానందపరవశురాలినిగా యొనర్చి, యామెతో నాజగద్రక్షకుని పెక్కువిధంబుల స్తుతించుచు కాలము గడపుచుండెను.

ఇది యిట్లుండ, జ్యోతిపురంబనియెడి నొకమహాపట్టణమును బరిపాలించురాజు రాజ్యభోగములయందును, సంసారసుఖములందును, నిచ్ఛలేనివాడై, రాజ్యభారములను మంత్రియధీనముగావించి, తాను సకుటుంబముగా నొకయుద్యానవనమునందు పర్ణశాలను నిర్మించుకొని, భార్యాసమేతుండై యనుదినంబును, నిత్యకర్మానుష్టానములదీర్చుకొనిన యనంతరము, మానసికముగా భగవంతుని ధూపదీపనైవేద్యాదులతో బూజించి, యాభగవానుని నామసంకీర్తనముల బాడుకొనుచు తన్మయుడై యుండిన నొక్కదినంబున భక్తులయెడ నపారవాత్సల్యమును గలిగిన నాశ్రీకృష్ణపరమాత్ముండు రుక్మిణీసహితుండై, యారాజదంపతులకు దనదివ్యమంగళవిగ్రహ సాక్షాత్కారమునొసంగ, నాదంపతు

లాపరమాత్మని దివ్యరూపంబునుగని పులకాంకితులై, కన్నులనుండి యానందబాష్పములురాల, ముకుళితహస్తులై,

శ్లో॥ " యజ్ఞేశాచ్యుతగోవిందమాధవానన్తకేశవ ।
కృష్ణవిష్ణోహృషీకేశవాసుదేవనమోస్తుతే ॥
నమఃకృష్ణాయ దేవాయ బ్రహ్మణేఽన్యతశక్తయే ।
యోగీశ్వరాయ యోగాయత్వామహం శరణంగతః ॥
కృష్ణాయవాసుదేవాయ దేవకీనన్దనాయచ ।
నందగోపకుమారాయనమోనమః ॥
నమఃపరమకళ్యాణ నమస్తె విశ్వభావన ।
వాసుదేవాయ శాంతాయ యదునాంపతయేనః ॥ "

అని యీ ప్రకారంబుగా ననేకవిధంబులస్తుతించి, యారాజదంపతులు శ్రీకృష్ణపరమాత్మునకు పునఃప్రణామంబులిడి, " ఓ దేవదేవా ! నేడు నీదర్శనభాగ్యంబుచే మాజన్మంబులు సాఫల్యతనందినవి. సర్వాంతర్యామివై, సర్వరక్షకుండవైన నిన్నే శరణువేడితిమి. మాకు తరుణోపాయమార్గంబు నుపదేశింపుము ". అని ప్రార్థింపగా నాజగదీశుండు మందస్మితవదనారవిందుడై, " ఓరాజదంపతులారా ! బృందావనక్షేత్రమునందు త్రిపురదాసుండను మహాతత్త్వవేత్తయు, జ్ఞానియునైన నాయాంతరంగికభక్తుడు కలడు. మీరాసద్గురునాశ్రయించి, యాతనిమూలమున ముక్తిమార్గమును గనుగొనుడు ". అని యానతిచ్చి యంతర్ధానుండాయెను.

అంత నాభూపతి భార్యాసమేతుండై, భగవానుని యానతి ననుసరించి, బృందావనంబునకు బయనంబై, నానాపుణ్యక్షేత్రములను సేవించుచు, పవిత్రనదీస్నానంబుల నాచరించుచు, హరినామసంకీర్తనంబుల గావించుకొనుచు గొన్నాళ్ళకు బృందావనముజేరి, స్నాన, జప, తపానుష్ఠాదికృత్యముల దీర్చుకొనినయనంతరము త్రిపురదాసు గృహ

మునకరిగి, యామహనీయునకు నమస్కరించి, ముకుళితహస్తుండై భార్యాసమేతముగ నిలచియుండ, త్రిపురదాసు వారలసగౌరవముగ గూర్చుండనియమించి, వారలు జనుదెంచినకారణమునడుగ, నారా జభక్తునకు బ్రణమిల్లి " ఓ దేవా ! దయామయుండగు నాపరంధాముడు మాకు సాక్షాత్కారమునొసంగి, దేవరవారి శరణనంది సకలార్థముల గ్రహించి ముక్తిమార్గము నందునట్లుగా మాకానతిచ్చియుండుటచే, మేము భగవత్పాదసేవనంబు సేయవలయునని యరుదెంచినవారము. తమరు మాయందనుగ్రహించి, భగవత్సాన్నిధ్యముం జేరగలుగునుపా యంబును బ్రసాదింపవలసినదిగా బ్రార్థించుచున్నాము ". అని వినయంబుగా మనవిజేయ, త్రిపురదాసు వారలకిట్లనియెను.

" పూజ్యులగు నోదంపతులారా ! శ్రీకృష్ణపరమాత్మని దర్శన మునందిన మీకెట్టిలోపమును నుండదు. అయినను భగవదాజ్ఞననుస రించి నాకుదెలిసినదానిని దమకుపదేశించుట కెట్టియభ్యంతరమును నుండదు.

శ్లో॥ న్యాసవిద్యైకనిష్ఠానాం వైష్ణవానాంమహాత్మనాం ।
ప్రాకృతాభిస్తుతిర్నిందా నిందాస్తుతిర్నితిస్మృతా ॥

నిష్ఠాచారములుగలిగిన మహాత్ములగు వైష్ణవులు సర్వేశ్వరుని యందలి విముఖత్వమును సహింపజాలరు. అట్టిమహాత్ములు శరీరధర్మ ములయందు విముఖత్వమునంది, యాత్మస్వరూపమునం దాపేక్షగల వారై యుందురు. నిత్యమును భగవదనుభవమువల్లను బురుషార్థము గనుగొని, క్షుద్రపురుషార్థకముల నేవగించుకొనుచుందురు. నరకకూ పంబున బడద్రోయుశత్రువులనదగు శబ్దాదివిషయవాంఛల విసర్జించి, మోక్షద్వారమైన భగవత్కైంకర్యములందు దగిలియుందురు. మరియు భక్తజనంబులకు భగవంతుడు భృత్యుడై మెలంగుచున్నాడు. చేతనా

చేతనంబైన నఖిలంబునకును నాధారభూతుండై, తనకువేరొకయాధారములేనివాడై, జాతి, వర్ణ, వృద్ధి క్షయాదికంబులైన నెట్టివికారంబులును లేనివాడై, షడైశ్వర్యములతో గూడినవాడును, జ్ఞానానందదాయకుండును, చేతనాచేతనంబులగు సర్వపదార్థములందును వ్యాపించియున్నవాడును నగు నాసర్వేశ్వరునిచే నీయనంతబ్రహ్మాండంబులును సృష్టింపబడినవి. శ్రేష్టమయిన యీమానుషజన్మంబును మనకు బ్రసాదించిన యీమహనీయుని యపారకరుణా కటాక్షంబునుమరువక యనవరతంబును, నామహనీయుని లీలలనే స్మరించుకొనుచుండినయెడల మనలకు మనజన్మంబులు సాఫల్యతనందగలవు. కనుక నోభూపతీ ! నీవికభార్యాసమేతుండవై నిజరాజధానింజేరుకొని భగవద్భక్తులను, సాధుజనంబులను బూజించుచు యీసర్వేశ్వరునియందే మానసంబును లగ్నమొనర్చి చరింపుచుండుము. నీకు శుభంబగును ”. అని త్రిపురదాసా దంపతులకు తత్త్వోపదేశంబు నాచరించి, వీడ్కొలిపెను.

అనంతరము కొన్నాళ్లకు త్రిపురదాసున కవసానకాలంబు సంప్రాప్తింపగా, నాపరమభక్తుడు భార్యాసమేతుండై శ్రీకృష్ణపరమాత్మని దివ్యమంగళవిగ్రహమునం దైక్యమయ్యెను.

---

# 46 షేక్ ఫరీద్.

:o:

మహోన్నతంబులగు సౌధరాజంబులతోడను, సువిశాలంబులగు రాజమార్గంబులతోడను, లెక్కకుమిక్కుటంబైన దివ్యభవనంబులతోడను, నిర్మలవారిపూరితంబులగు నదీతటాకంబులతోడను, నత్యంత మనోహరములగు గోపురప్రాకారంబులచే నొప్పు దేవాలయంబులతోడను, నవవికసితఫలపుష్పభరితంబుల తరులతాదులతో గూడుకొనిన సుందరోద్యానవనంబులతోడను, నొప్పుచు సుప్రసిద్ధంబగు

యాత్రాస్థలంబై యలరు యవంతీపురంబునం దొకప్పుడు నీళోబాయి యను నొక పరమభక్తురాలు నివసించుచుండెడిది. ఆమె మహాసాధ్వియై భర్త తప్ప నితరదైవంబు లేదనియెంచుచు, నతిథియభ్యాగతులను, సాధుజనంబులను నుచితరీతిని సత్కరించుచు, మహాజ్ఞానసంపన్నయై, యనవరతమును, హరినామస్మరణ దప్పక, భగవత్పాదపూజానియతి యందే గాలము గడపుచుండెను. ఆమె కెల్లవిధముల దీసిపోని ఆ యమ భర్త నీళోబాయి గర్భము దాల్చియుండగా, సర్వదష్టుడై మృతినం దుచు భార్యను బిలచి, "నీ గర్భమునందు ప్రహ్లాదునివంటి పరమ భక్తుడు జనింపగలడు. వానికి నీవు 'షేక్ ఫరీద్' అను నామమునిడి యీశ్వర గుణానుభవంబుల బోధింపుము". అనిచెప్పి పరమపదంబు నంది విష్ణుసాన్నిధ్యముం జెందెను.

ఆ మహాజ్ఞాని చెప్పినవిధంబుగానె నీళోబాయి గర్భమునందొక పరమ భాగవతోత్తముండు జన్మించెను. భర్త యాజ్ఞానుసారముగా నీళోబాయి యా బాలకునకు 'షేక్ ఫరీద్' అను నామమునిడి అతి గారాబముతో బెంచుచుండెను. షేక్ ఫరీద్ పంచవర్షప్రాయు డగు నప్పటినుండియు దల్లితో హరినామసంకీర్తనముల జరుపుచు, అందలి మహాత్మ్యంబుల నెరుంగునంతటి జ్ఞాని యయ్యెను. ఆ బాలకుం డొక నాడు నీళోబాయినిజేరి, "తల్లీ! సర్వగుణోపేతుండును, సకలలోక శరణ్యుండునగు నా పురుషోత్తముని దర్శింపవలయునని నాకు కుతూ హలముగలదు; గాన నీవు నాయందు దనుగ్రహించి, యా దివ్యమంగళ కరుని జూపుము". అని ప్రార్థింపగా నా బాలకుని మాటలకా సాధ్వి నవ్వి, "నాయనా! సచ్చిదానందమూర్తియగు నా భగవానుని రూపము నంతసులభముగా దర్శింపవచ్చుననుకొంటివా? బ్రహ్మాదుల కయినను నా మహామహుని దర్శన మలభ్యంబై నది. అట్టియెడల

మనకట్టి మహాభాగ్యము కలుగునా ? కొందరు మహారణ్యముల నివాస మేర్పరచుకొని, యుగ్రతపంబుల నాచరించియు, గొందరు ఏకాదశాది మహావ్రతంబుల నాచరించియు, మరికొందరు యజ్ఞయాగాది క్రతువుల నాచరించియు, నింకను గొందరు 'మమాత్మా సర్వభూతాని' యని సర్వప్రాణులను దమ ప్రాణంబులవలె భావించియు, కొందరు అనవరత భక్తిసంకీర్తనము లాచరించియు, నీ విధముగా బలువురు బలు మార్గంబుల నవలంభించి, యా జగన్నాథుని సాక్షాత్కారమును బొందుచున్నారు. ఇందు నీ కేదివాంఛితమో యద్దాని నవలంభించి, పరమేశ్వరుని దర్శింపుము ". అన, తల్లి హితోపదేశంబును వినినంతనే షేక్ ఫరీద్ విరక్తిజెందినవాడై, జనని యాజ్ఞనుగొని, మహారణ్యములకు జని, యట నివాసమేర్పరచుకొని, యొక కొండగుహాయందు గూర్చొని కన్నులు మూసుకొని తపస్సుచేసెను. కాని భగవంతుని దర్శన మాతనికి గలుగలేదు. అ ట్లెంతకాలమునకును భగవద్దర్శనము గానందున నా బాలకుండు మరింత పట్టుదలగలవాడై, యచటి వృక్షములంగల కాయలను దుంపలను దినుచు నట్లే మరికొంతకాలము తపస్సమాధియందుండెను. కాని వాని కప్పటికిని దేవునిదర్శనము కాలేదు. ఇట్లా బాలకుండు ఆకులలముల దినుచు పండ్రెండుసంవత్సరము లుగ్రతపం బాచరించినను భగవత్సాక్షాత్కారము లభింపకుండుటచే మిగుల దుఃఖితుడై, యాతావును వీడి, తిరుగ నిజపురంబు జేరుకొని, తల్లికి నమస్కరించి,

" జననీ ! నా దురదృష్ట మేమోగాని, పన్నెండుసంవత్సరము లాకులలంబుల భుజించి యుగ్రతపం బాచరించినను ఆ పరమాత్ముని దర్శనము కాలేదు. ఆ రుక్మిణీవల్లభుని దర్శింపజాలని నేను బ్రతుకుట వ్యర్థము ". అని కంట నీరువెట్టుకొనుచు నిలుచున్న కుమారు నక్కున జేర్చి, నీళ్లోబాయి వాని కిట్లనియెను.

"కుమారా! చచ్చుటకును బ్రతుకుటకును నీయిష్టమేయను కొంటివా? 'అంతవంత ఇమేదాహానిత్యస్యోక్తశ్శరీరిణః' అను చందంబున నీదేహము అంతముబొందునదేయైయున్నది. కాని శరీరాంతర్వర్తి. యగు పరమాత్మస్వరూపుండు నిత్యుడుసుమా!

శ్లో॥ నజాయతేమ్రియతేవాకదాచిన్నాయంభూత్వాభవితావానభూయః
తజో నిత్యశ్శాశ్వతోయం పురాణోనహన్యతేహన్యమానేశరీరే ॥

అనునట్లు నీకు జననమరణములులేవు. నీవు స్థిరుడవు. నీదేహము నశింపునందినను, నీయాత్మకెన్నడును నాశనములేదు. కర్మానుగుణము వలన జన్మంబులు నీయాత్మకనంతంబులు. ఈజన్మలకువలెనే, నందు తటస్థపడుచుండు భార్యాపుత్రులకును, దలిదండ్రులకునుగూడ నంతము లేదని నమ్ముము. షడ్గుణైశ్వర్యయుక్తుండును, సృష్టి, స్థితి, లయకారకుండునుఅవాఙ్మన సగోచరుండును, అవ్యక్తుండును, నామరూపరహితుండును నగునాపరంధాముండూరక గుహలయందుగూర్చొని కన్నులు మూసుకొనునంతమాత్రమున సాక్షాత్కార మొసంగువాడుకాడు. మరియు నాతడు తనచే సృష్టింపబడిన నేప్రాణికిని హింసజరుగుచుండ సహింపజాలడు. నీవు వృక్షములనుండి ఆకులలములు గోయునపుడు వాటికి బాధకలుగదా! దానంజేసియే నీకార్యమునకా భగవానుడనంతృప్తుడై దర్శనము నీయకున్నాడు".

అని తల్లిచెప్పినమాటలయొక్క యెదార్థమును గ్రహించిన షేక్ ఫరీద్ తిరుగ నరణ్యములకుజని, యాతడవు రాలినపర్ణంబులను ఫలములను మాత్రముదినుచు గొంతకాలం బుగ్రతపంబాచరించెను. గాని ఆభక్తున కప్పటికిని దేవుని సాక్షాత్కారము కాలేదు. అంత నా బాలకుండు తీగలతోడను లతలతోడను తనకాళ్లను బంధించుకొని వృక్షశాఖలకు దగిలించుకొని, తలక్రిందులుగా వ్రేలాడుచు నిరాహారుడై, భగవద్ధ్యానము సలుపుచుండెను. ఆతనిదేహము నానాటికి

క్ష్మిశించుచుండెనేగాని, భగవంతున కాతనియందు దయకలుగలేదు. పక్షులీతనిశరీరమునుగని, యది నిర్జీవదేహమనియెంచి, పెరికితినుటకారంభింపగా చివరకు రక్తమాంసములుకూడ హరించి శల్యములుమాత్రము మిగిలెను. అప్పటికిని షేక్ ఫరీదు పరమాత్ముని దర్శించుకోరికపోనివాడై, యాశల్యములతో నల్లే వ్రేలాడుచు పక్షులతో నిట్లనియెను. " ఓ పక్షిరాజములారా! నాశరీరమునుభక్షించి మీాక్షుద్బాధను తొలంగించుకొన నున్నందులకు నేను ధన్యుడనే. కాని ఆపరమాత్ముని దివ్యమంగళవిగ్రహమును దర్శించుటకు నేత్రములమాత్రముమిగిల్చి, మిగిలిన సర్వావయవములను భక్షించి మీాయాకలిని దీర్చుకొనుడు ". అని ప్రార్థించినదువినక యాపక్షులు షేక్ ఫరీద్ యొక్క నేత్రసహితముగా సర్వావయవములను భక్షించి వట్టిశల్యములమాత్రము మిగిల్చెను. అంతట నాశల్యాగతము నందున్న షేక్ ఫరీద్ యొక్క జీవుడు భగవాను నీవిధముగా బ్రార్థింపదొడంగెను.

" ఓ యాపద్బాంధవా! కరుణాసముద్రా! కరివరదా! ద్రౌపదీ మానసంరక్షా! భక్తవత్సలా! శరీరమునం దభిమాన ముండునంతకాలము నీ సందర్శనభాగ్యము కలుగుట దుర్లభంబు. నిన్ను దర్శించుకోరికతో నేను సర్వాభిమానములను విసర్జించి, ప్రార్థించుచుంటిని. వెంటనే దర్శనమొసంగి, తరింపజేయుము. నా నేత్రములు పక్షులకాహారమయ్యెగదా నిన్నెట్లు తిలకింపగలనని భావింపకుము. ఈబాహ్యనేత్రముల కతీతమయిన జ్ఞానచక్షువుతో నిన్ను దర్శింపగలను ". అని యిట్లు పరమభక్తుడయిన షేక్ ఫరీద్ పెక్కువిధముల ప్రార్థింపగా, దయామయుడగు నా పరంధాముడు, కోటిసూర్యప్రభాభాసమానమగు కిరీటముతోడను, మకరకుండలములతోడను, శంఖచక్రాది దివ్యాయుధంబులతోడను, పట్టు పీతాంబరములతోడను లక్ష్మీసహితముగా

షేక్ ఫరీద్‌నకు సాక్షాత్కార మొసంగి, తన కోమలహస్తంబులతో నా భక్తునియొక్క కట్లనువిప్పి, యాతనిని కౌగలించుకొనగా, షేక్ ఫరీద్‌యొక్క దేహము దివ్యతేజోమయంబై ప్రకాశించి, యాతనికి యెప్పటియట్లు దృష్టియుగల్గెను. అంతట నా పరమభాగవతోత్తముండు శ్రీలక్ష్మీనారాయణుని చరణకమలములపై వ్రాలి, " మేఘశ్యామం పీత కౌసేయవాసం శ్రీవత్సాంకం కౌస్తుభోద్భాసితాంగం । పుణ్యోపేతం పుండరీకాయతాక్షం విష్ణుం వందే సర్వలోకైకనాథం " అని పెక్కు విధంబుల స్తుతింప నా భక్తవత్సలుండు తనభక్తుని లేవనెత్తి,

" ఓ వత్సా ! నీవు నన్ను దర్శింపవలయునని యిరువదినాల్గు వత్సరంబు లుగ్రతపం బాచరించితివి. మిగుల శ్రమల ననుభవించితివి. ఇక నీవు నీ యూరికిబోయి నన్ను ధ్యానించుకొనుచు నీ తల్లితో సుఖముగానుండుము. నీ జననియగు నీళోబాయి నా కాంతరంగికభక్తురాలు. ఆమె కుమారుండ వౌటంజేసికూడ నీవును నా కాంతరంగిక భక్తుడవే యైతివి. నీకు కోరినపుడెల్ల నా దర్శనభాగ్యంబు గలుగుచుండును. నీకు శుభంబగుగాక ! "

యని దీవించి, యా నారాయణస్వరూపుండు లక్ష్మీసమేతుండై యంతర్ధానమయ్యెను. అనంతరము భగవంతు డనుగ్రహించిన దివ్య సుందర విగ్రహమును మనమునందు నిలుపుకొని షేక్ ఫరీద్ భగవన్నామస్మరణను గావించుకొనుచు, తన నిజగ్రామంబునకు బోయి, జననియు, పరమభాగవతోత్తమురాలును నగు నీళోబాయికి బ్రణమిల్లి, " తల్లీ ! నీ యనుగ్రహంబువలన నేనా శ్రీమన్నారాయణుని యొక్క సాక్షాత్కారమును బొందగలిగితిని. ఇపుడు నేను బొందుచున్న పరమానందమునకు మేరయేలేదు ". అని సంతోషాతిరేకంబున విన్నపింప

కుమారుని మాటలకా తల్లి మిగుల నానందించి, "కుమారా! ఇక సంతరించితివి భగవత్పాదసేవనంబు దప్పక మెలగుచుందుము". నుడివెను.

అనంతరము గోన్నాళ్లా మాతాపుత్రు లిరువురును ననవరతము హరినామ సంకీర్తనముల సల్పుచు, భక్తజనంబులకును సాధువులకును సత్కారములిడి వారిని బూజించుచు గొన్నాళ్లు గడపిరి. పిమ్మట పరమభాగవతోత్తములగు నా తల్లీకుమారు లిరువురును నొకేసారి, శరీరముల విసర్జించి, శాశ్వతంబై, నిత్యానందదాయకంబగు విష్ణుపదంబును జేరుకొనిరి.

సంపూర్ణము.



# మైలవరం కంపెనీ వారిచే ప్రదర్శింపబడు

# నాటకములు.



| | | | |
|---|---|---|---|
| కనకతార చం. కే. | 1.4 | రోషనార కో. సు. | 1.4 |
| హరిశ్చంద్రీయము బ. ల. | 1.0 | గయోపాఖ్యానం చి. ల. | 0-8 |
| శ్రీకృష్ణతులాభారం ము.సు. | 1.4 | ప్రసన్నయాదవము డిట్టో | 0-8 |
| కాంతామతి గూ. కో. | 0-12 | పారిజాతాపహరణం డిట్టో | 0-8 |
| కృష్ణలీల బళ్ళారి పం. కె. సు. | 1.4 | చతురచంద్రహాస డిట్టో | 0-8 |
| లవకుశ డిట్టో | 1.4 | తులసీదేవి ము. వెం. చె. | 1.0 |
| రంగూన్‌రౌడీ సో. రా. | 1.0 | చింతామణి కా. నా. | 1.0 |
| వేణీసంహారము వ. సు. | 1.0 | వరవిక్రయం డిట్టో | 1.0 |
| సాత్రాజితీయము బ. ల. | 1.0 | మధుసేవ డిట్టో | 1.0 |
| ఉత్తరరాఘవం కుశలవ డిట్టో | 1.4 | పద్మవ్యూహం డిట్టో | 1.0 |
| రామదాసు బళ్ళారి డి. గో. | 1.0 | పాండవవిజయం తి. వెం. | 1.0 |
| బొబ్బిలియుద్ధం శ్రీ. కృ. | 1.0 | పాండవవుద్యోగము. అను | |
| పాదుకాపట్టాభిషేకము | | శ్రీకృష్ణరాయభారం ,, | 1.0 |
| పా. ల. న. | 1.4 | పాండవాశ్వమేధం ,, | 1.0 |
| విప్రనారాయణ డిట్టో | 1.0 | సావిత్రి శ్రీ. స. | 1.0 |
| సారంగధర డిట్టో | 0-8 | ద్రౌపది మ. అ. | 1.0 |
| రాధాకృష్ణ డిట్టో | 0-12 | అనసూయ సో. రా. | 1.0 |
| చూడామణి డిట్టో | 0-12 | బుద్ధిమతీ విలాసము జ. ల. | 1.0 |
| రసపుత్రవిజయము ఇ.య. | 1.0 | శాకుంతల కం. వీ. | 1.0 |
| జయంతజయపాల బ. కో. | 0-12 | ధరణికోట సో. రా. | 1.4 |
| కన్యాశుల్కము గు. అ. | 1.0 | చండిక ము. వెం. చె. | 1.0 |

శ్రీ సత్యానంద బుక్ డిపో, రాజమండ్రి.

